TO

HIM

WHO KNOWS

MY

TUNES AND TONES

"YAMINEE"

## నామాట :— 2

1962 మార్చి పదిహేను రాత్రి సుమారు తొమ్మిది గంటల ప్రాంతంలో ఓ చిత్రమైన సన్నివేశం మనసులో మెదలింది. దాసిని ప్రాతిపదికగా తీసుకుని వెంటనే రచన సాగించటం జరిగింది. సుజాత పాత్ర చిత్రణలో అనుక్షణం మథన పడుతూ రచన ముగించాను. ఆ పదునాలుగు రోజులూ మనసు ఏదో భ్రమలో మత్తులో వుండింది. ఒక్కోచోట రచన ఏంచేస్తున్నానో తెలీకుండానే జరిగింది. అందుకే యంవేస్తోంది సుజాతని సుస్పష్టకోణాల్లో చిత్రించగలిగేనా తిరిగి ఈనాడు ఆ వాతావరణంలోకి మనసుని చొప్పించి శుద్ధంగా వ్రాయటానికి ఎంతో కష్టపడ్డాను. ఎందుకో రత్నావళికి పోలికలు చాలాసార్లు తేబడ్డాయ్. అర్థం కావటంలేదు కారణం. ముగింపు నేనూహించు కున్నది కాదు. పాత్రలే వ్రాయించింది. తెలిసీ తెలియ కుండా జరిగిన రచన కాబట్టి కష్టాని గమనిస్తే, గుర్తిస్తే కృతజ్ఞతలు. ధన్యత చెందినట్టు భావిస్తాను.

యామినీ సరస్వతి.

15-జూలై'-65

# విషాదిని

జీవితంలో సుఖం కాని కష్టం కానీ అనుకున్నట్టుగా రావు.

కలలు కనటమే కొందరికిష్టం ఆ కలలు కల్లలైననాడు వారి మనోవ్యథ చిత్రించాలంటే భయం వేస్తుంది.

ఒక్కొక్కరితో పసిపిల్లలు ఆశచూపించి తాయిలం నోట్లో వేసుకొని ఎదుటి పిల్లని ఉడికించినట్టుగ విధి ఆడుకుంటుంది. అది సర్దుకోవటానికి కేవలం విధే కారణం అనుకోవాలి.

ఒక్కోసారి పూర్వజన్మ కృతపుణ్యా పాపాల ఫలితాలా అని అనిపించేట్టుగా జరిగే సంగటనల్ని చూచి నాస్తికత మీద విసుగెత్తి ఆస్తికత వేపు మానవుడు పరుగెత్తాలనిపిస్తుంది.

మనిషికి ఒక్కోసారి క్రౌర్యం ప్రబలిపోయి ఏది చేయవచ్చో ఏది చేయరాదో కూడా నిర్ణయించుకోకుండా—అలా నిర్ణయించుకోటానికి వ్యవధికూడా యివ్వకుండా—చేసిఅతనిలో ఊహించలేని దుర్మార్గాన్ని వేయిస్తున్నది. అతీతమైన శక్తి—దివ్యమైనా కావచ్చు బౌమమైనా కావచ్చు.

కాలం విసిరిన గాలానికి చిక్కుకొని ప్రాణం గిలగిల కావుంటే ఎదురుగా కనిపించే భయంకారాన్ని చూచి నా దుఃఖస్థితి అందకుండానే నశిస్తోంది ప్రాణికోటి.

రాత్రి సుమారు పండ్రెండు దాటివుంటుంది. దట్టంగా చీకటి అలుముకునివుంది. సాయంకాలం నుండి అలలు అలలుగా లేచి అలుముకునివున్న చీకటి దట్టంగా పేరుకునివుంది.

ముద్దకట్టిని పాపంలా వున్న చీకటిని మునిసిపల్ లైట్లు ఏమీ చేయలేక పోతున్నాయ్ అశక్తుని యత్నంలా. ఇహ శక్తిహీనుడుకూడా ఇష్టపడినదాన్ని సాధించుకోటానికి యత్నిస్తాడు ఫలితాన్ని దైవ ఆధీనానికి వదిలేసి. అలాగే చీకట్లని ద్రోలటానికి యత్నిస్తున్నాయ్ మునిసిపల్ దీపాలు.

లైఫ్ ఇన్సూరెన్స్ వారి నినాదానికి ప్రతీకల్లాగున్నాయ్ ఎ పాలిటీ వారి యత్నాలు. "చుట్టూరవున్న చీకటిని కుంటూ కూచోకండి. చిన్నదైనా కాస్త వెలుగిచ్చే నా దీపం వెలిగించుకోండి" ఆదర్శనం మాత్రం ఆచరణలోకి లేక పోతున్నారు మునిసిపాలిటీవారు.

ఆ నిశాసమయంలో తిరుగరాని స్థలాల్లో తిరుగాడుతున్నాడో యువకుడు.

ఆ సమయంలో ఆ స్థలమంతా నిర్జనంగా వుంది గాని లేకపోతే అతని పరువు ఏమయ్యేది? అదే పగలై యుండినా లేదా ఆ నిశారాత్రినే తెలిసిన-వారెవ్వరైనా అక్కడ తిరుగాడుతూ వుండినా ఏమయ్యేది? అతని పరువు కాస్తా గంగలో కలిసిపోయేది. కారణం గంగ సర్వపాప సంహారిణట! అదో తిరుపోపాయం పాపాలు చేసేవారు సమర్థించుకోటానికి.

అలా సీదంటే ఎగువకీ దిగువకీ నాల్గయిదుసార్లు తిరిగి చటుక్కున ఓ ఇంట్లోకి దూరాడు.

గొంతు సవరించుకున్నది చూచి దాహం అపురూపం దేమో ననుకుని కూజాలోంచి నీళ్లువంచి యిచ్చింది. ఆ గాజు గ్లాసులో ఆ నీళ్ళు చూచేసరికి షోకు వచ్చినా గొంతుక తడుపుకుందామని త్రాగాడు. త్రాగబోయేముందు అతని ముఖంలో తారట్లాడిన భావాలకి సిగ్గుపడిందామె.

తిరిగి గ్లాసు యిచ్చేస్తోంటే చేతివ్రేళ్లు తగిలాయి. తన కన్నా బలహీనంగా చేతులు వణకటం చూచి ఆమె నవ్వు కుంది.

“చూడండి! మీ పేరేమో తెలీదు. ఈ పేటలో వుండటంవల్ల ‘వృత్తి’ అదే అయివుంటుదన్న గమనంతో ప్రవే శించాను. నాల్గు రోజులుగా ఇదే వీధిలో తిరుగుతూవున్నా. ఏనాడూ బయటికి రాకపోవటం వల్ల కాస్త ధైర్యంతో ప్రవే శించాను. నే చెప్పబోయేది వినగలరా?”

ఏమాత్రం చలనం లేని అతని కంఠస్వరం విని నిజంగా చలించిందామె. కానీండి అన్నట్టు కనుబొమ నెగుర వేసింది.

“నేను ఎవరైనా ఓ విద్యార్థిని, జీవితంలో వసంతం ప్రవేశిస్తోంది. ఆ తాకిడికి తట్టుకోలేని లేత ప్రమాతుని నేను. నాకీ సమయంలో తృప్తి ముఖ్యం-అనుభవం కన్నా. లత సహాయం కావాలి. లత నాతో వుంటే చాలు. నాకు సుఖం అక్కర్లేదు. తృప్తి కావాలి. అదే చాలు. తాకిడికి తట్టుకో గలను. మిగతా యిళ్ళకంటే కాస్త శాంతంగా మనోజ్ఞంగా వుంటే ప్రశాంతంగా కూడా వుంటుందని ఆశించి ఇది ఎన్ను కున్నా[illegible] దీనికి మీ సహాయం సానుభూతి కావాలి

అతడు మాట్లాడేది అర్థం కాలేదు ముందుగ. కానీ ఆలోచించగ భావం చటుక్కున స్ఫురించింది. అనుభవంకంటే మించిన విద్య లేదు మరి!

ఇంకా ఏం చెవుతాడో విందామని తలెత్తి చూచింది.

"మీరు చేయవలసినదల్లా నా ప్రక్కన్నే ఇలా కుంర్చోవటం మాత్రమే మిమ్మల్ని ముట్టుకోవాలన్నా నాకు భయమే! నవ్వకండి బలహీనుణ్ణి చూచి! నిజం చెవుతున్నాను. మీకు ఎంతడబ్బు కావాలన్నా యిస్తాను. అయితే ఒక్కషరతు! మీరు నా రాకని యిబ్బందిగా అనుకోకుండా, పైగా ఎవరికీ తెలీకుండా రహస్యంగా దాచండి."

ఇంకేం చెప్పేది లేనట్టు చూచాడు.

ఆమె కిదేమీ అర్థం కాలేదు. ఏమిటీ విచిత్ర సంబంధం? ఎందుకీ షరతులు?

"మీ కేమీ యివ్వకుండా మీనుండి ఏమీ పుచ్చుకోలేను. మరీ అంత కర్కశత్వం లేదు నాలో. తోటి మానవుడి మనస్సుని అర్థం చేసుకుని ఆదరించగలిగే మేధస్సుని దయచేశాడు భగవానుడు. కరుణామయుడై నన్ను అన్నీ లేనిదానిగా చేసినా నాకు శాస్త్ర జ్ఞానం, సహనం, సానుభూతి యిచ్చాడు. మీ రేదో ఆత్మీయుడిలా కాకున్నా స్నేహితుడులాగా వస్తూ వెడుతూ వుంటానంటే నాకేమీ అభ్యంతరం లేదు. ఎవర్కైనా తెలియటానికి ఇక్క [illegible] లేరు.



వీధిలో వారికి తెలీటానికి ఆస్కారం లేకుండా, ఈ వేళలో వచ్చి వేకువనే వెడుతూ వుండండి."

నిశ్చలమైన కంఠంతో నిర్దుష్టంగా ధృఢమనస్కురాలై చెప్పింది.

అతను ఆమె సూచించిన దానికి తృప్తి చెందినా ఆమె అలా మాట్లాడినందుకు కాస్త సిగ్గిల్లాడు.

మెల్లిగా అన్నాడు.

"నన్ను అపార్థం చేసుకోకు. నవలల్లో లాగా మాట్లాడ బోకండి! నాకు భయం వేస్తుంది. మనసిచ్చి మాట్లాడండి. ఆదర్శాలని లేనిపోనివి మనస్సులో నుంచుకుని సందేహాలతో మాటాడకండి. నాకు కావలసింది మనస్సుకు తృప్తి. అది నాకు అందజేయగలిగితే చాలు."

మంచం మీద స్థిమితంగా కూర్చుంటూ నిట్టూర్చిందామె. అది జీవితంలో ఎన్నవ నిట్టూర్పో!

ఆ నిట్టూర్పుల్లో వేడికాక నిప్పు వుండివుంటే ఈ లోకం మూలమట్టంగా దహించుకొని పోయివుండేది. అలాంటి అనేక 'పతిత' స్త్రీల నిట్టూర్పులతో.

కలిగిన ఆవేదనని అణుచుకుంటూ మెల్లిగా అంది "ఇది నా జీవితంలో ఓ విచిత్రమైన సంఘటన. నేను ఇక్కడికి యింతకంటే విచిత్రమైన పరిస్థితుల్లో వచ్చినా నాకుమాత్రం యిది వినూత్నమూ విచిత్రమూ అయిన సంఘటన."

కాస్త ఆగి అంది.

"సరే! మీరు రోజు వస్తూ వెళుతూ వుండొచ్చు. కానీ మీరిక్కడ నిర్వ్యాపారంగా ఎంతసేపని యిలా కూర్చోగలరు? ఏదైనా చదువుకుంటారా? పోన్లెండి అస్తమానం ఏమిచదువు? కడవను, కట్టను కూడా పూర్తిగ యివ్వలేని చదువుల్తో విసిగెత్తిపోయి వుంటారు. మరి ఏంచేయటం?"

అతనివైపు ప్రశ్నార్థకంగా చూచింది.

"ఏమి చేయమంటారు? ఏమి చెప్పమంటారు? ఇక ముందు చదువుదామని అనుకున్నా ఈ రోజు గడవటం ఎలా? పోనీ ఏదైనా పాడగలరా? లేకపోతే చదువుకోండి ఇవేనని ఏ డిటెక్టివ్ సాహిత్యమో నాకెతిన వేస్తారా? అంతకంటే ఇంకేంవుంటాయ్ మీ వద్ద?"

ఆమె ముఖం జేవురించింది. ఈ అకారణ అవహేళనా పూర్వక తిరస్కారానికి. కాస్త తీక్షణంగా అంది.

"అయిదే మీరు పొరబడ్డారన్నమాటే! ఇక్కడ మీరు ఏవగించుకున్న సాహిత్యం - అది సాహిత్యంకూడా కాదేమో-లేనేలేదు. కావలిస్తే నలుగురూ మెచ్చే సాహిత్యమేవుంది-అయినా ఈ గుడ్డి వెలుతురులో మీరేం చదువుతారులెండి. ఏదో తోచిన మట్టుకి, నోచినమట్టుకి పాడతాను."

ఇద్దరిమధ్యనా నిశ్శబ్దం కాస్తసేపు తాండవించింది.

ఆమె, 'బహుశా "ఏం పాట పాడనా?" అని ఆలో చించుకుంటూ వుండొచ్చు.'

అతను 'ఏం పాట పాడుతుందా' అని ఎదురు చూస్తూ వుండొచ్చు.

చల్లని ఆ రాత్రివేళ —

పరిసర గృహాల్లో 'నిరీక్షణలే' వున్నప్పుడు చీకటిని చీల్చు కుంటూ, నిశ్శబ్దతని ఛేదించుకుంటూ ఆప్యాయతా ఆదర అభి మానాలతో యుహా ంచ మనస్సుతో, అనురాగం రంగరించ బడిన ఆమె కంఠ స్రోతస్విని నుండి సుధాస్రవంతులు వెలిక రాసాగాయి.

ఆమె తీయని కంఠంలోని మాధుర్యాన్ని మరో రోజు ఆస్వాదించటానికి అనువుపడదేమోనని జగమందరికే మామ-చందమామ-గబగబా బయటికి వస్తున్నాడు.

తారలు-మగడు బయటికివచ్చాడు కదా అని మరీ నిగనిగా లాడుతున్నాయ్. ఆ గానలహరిలో తేలియాడ టానికి మరోరోజు మగడు తోడుండడేమోనని అవకాశాన్ని వినియోగించు కుంటున్నాయ్.

ఊరంత నిద్రపోతున్న సమయంలో—గానానికి అనువైన ఆ వేళలో—చల్లగా వీనులవిందుగా వినిపించే ఆ గాన మాధు ర్యంలో ఓలలాడుతూ ఏవో తెలియని తీయని స్వప్న జగా ల్లోకి జారిపోతూ తన్ను తాను మరచి తనువునికూడా మరిచా డతను.

మైమరచి నిద్రపోతున్న అతన్ని చూచి గానప్రవాహా నికి అడ్డుకడితే నిద్రాభంగమవుతుందా యని చూచి పాట ఆపివేసింది. తర్వాత ఆ మాసిన దుప్పటి అతనికి కప్పి నిట్టూర్చింది. దుప్పటి కప్పినప్పుడు కాస్త కదిలినా మళ్ళీ సర్దుకుని పడుకున్నాడు.

నిట్టూరుస్తూ దీపం కాస్త దూరంగా పెట్టి ఆ పాట్టి నేలమీదే కొంగు పరుచుకుని పడుకుంది. ఆలోచనలు దోమలు చుట్టూ ముసురుకుంటున్నా అన్నిటికి జవాబులుగా నిద్రాదేవి శరణ్యంజొచ్చింది.

ఆమె కడుపులోనే కాక గడపలోకూడా ఎలికలు గొడవ చేస్తున్నాయ్.

అయినా—

కిటికీ గుండా వచ్చే కౌముదీ కాంతిలో ఆమె ముఖంపై ఎనాడూ కనిపించని తృప్తి, సంతోషమూ కనిపిస్తున్నాయ్. పెదవులపై చిఱుదరహాసం వెలుగుతోంది.

*   *   *   *   *   *

చీకటి వెళ్ళి వెలుతురు ప్రవేశించే సమయం. బహుశా తాలూకాఫీసులో నాల్గు గంటలుకొట్టి చాలాకాలమే అయి వుండొచ్చు. ఉషోదయానికి అట్టే సమయ మున్నట్టులేదు.

చల్లగాలి మెల్లమెల్లగా వీస్తోంది. ఆ గాలిలోని శైత్యానికి జనం వెఱచి ఇంకా తలుపులు తీసుకుని బయటికి రాలేదు. ఇళ్ళల్లోనే పనుల్లో మునిగి పోయినట్టున్నారు.

అప్పుడప్పుడే చుట్టుప్రక్కల యువతులు నిద్రకు దోగి నట్టుంది. ఏమాత్రం శబ్దంలేదు. పాపపంక సంకులమైన ప్రపంచం ప్రళయానంతరం ఇట్లే వుంటుందనడానికి ఏమీ సందేహం లేదు.

హఠాత్తుగా మెళుకువైందా అమ్మాయికి!

బద్ధకంగా వళ్లు విరుచుకుంటూ తడక తీసుకుని బయటికి వెళ్ళింది. తలెత్తి చూచింది. వినీల కాంతులీనుతూ, ధగధగాయమానమైన తారకా మండలంతో, నడినెత్తిన కల్వపూలాగా చంద్రుడు పశ్చిమానికి దిగజారుతూ వెన్నెలని వెదజల్లుతూ వుంటూ నేత్రపర్వంగా వుంది ఆకాశం.

వాతావాకాశంలో వాయువులు సమ్మిళితమై నీలంగా కనిపిస్తాయని శాస్త్రజ్ఞుల వాదం! నిరూపించారుకూడా!

కానీ తనకు ఆ వాదంలో నమ్మక[illegible] కుదరటంలేదు. దూరా దూరంగా ఒకదానికొకటి [illegible] అతి స్వల్పంగా కాంతితో కన్పిస్తాయనికూడా అ[illegible]

యేవో వీధు [illegible] భావనాశక్తిగల మేధావులకి అన్నీ [illegible] ల్పమైన విషయంలో అ. [illegible] మహాను

పైన రతనాలు అతికించినట్టు కనిపించే. ఈ నేత్రపర్వ ద్రుశ్యాన్ని శాస్త్రవిషయాలతో జోడించుకుని ఎందుకు వాదోపవాదాలు చేయటం. చక్కగా సంతోషించక! నెలరాజు మార్గంలో అలంకరించిన దేదీప్యమైన దివ్వెల్లాగా వున్నాయ్ తారకలు. వరసగ ఇంద్రనీలమణుల్ని వ్రేలాడదీసినట్టున్నాయ్! అదిగో ఆ నక్షత్రం మరీ మిలమిల లాడుతోంది! ఎఱుపుతో, నీలంతో, తెలుపుతో తళతళ లాడుతోంది! ఏం అందం! ఓహ్!

తల త్రిప్పింతింకో వైపు!

దేదీప్యమానంగా అలతి అలతి కాంతులతో ధగధగ లాడుతోంది శుక్రతార! ఆ కాంతిని చూడలేక తల త్రిప్పకుంది. తన అమాయకత్వానికి నవ్వుతూన్నట్లు కనిపించింది ధ్రువతారం! చేయెత్తి నమస్కారం పెట్టింది.

ఆమె జీవితంలాగే ... తెలీకుండా పయనిస్తూ వున్నాయ్ మబ్బులు. ... ణంలో అడ్డొచ్చిన చందమామ కొంచెం ... న్నాడు. మబ్బులు తబ్బిబ్బులై తమ ... టూ తొలగిపోతున్నాయ్ మబ్బ...

మా...

తల త్రిప్పుకుంది. నిట్టూర్పులు! నిట్టూర్పులు! జీవితంలో అన్నీ నిట్టూర్పులేనా? మరేమీ లేదా?

ఆలోచనలకి యిది సమయం కాదు. తెల్లవారితే – మరెవరైనా చూస్తే ఎంత ప్రమాదం?

అతన్ని నిద్ర లేపబోయింది?

ఎలా? పేరు తెలీదే పిలువటానికి?

'బాబు గారూ!'

అనటానికి తనకే సిగ్గేసి ఆగిపోయింది.

తట్టి లేపుదామని చేయిచాపి హఠాత్తుగా వెనక్కి తీసుకుని చేయిచూచుకుంది. ఆ కనిపించీ కనిపించని వెలుతుర్లో బంగారంలాగా కనిపిస్తోందా చెయ్యి. "పాపం అంటదుకదా?" అనుకున్న మనస్సుతో పాటు చేయీ వణికింది.

ఉప్పెనలా వస్తూన్న ఆలోచనల్ని ఆపుకుంటూ అతని చెక్కిలికి చెయ్యి ఆనించింది. చురుక్కునట్లు చేయి కాలింది ఆ వేడికి. చేతిని నోటితో పూపుకుంది. అతనికీ చురక వేసినట్లై ఉలికి పడ్డట్టు లేచాడు.

"ఏం? నేం చెప్పింది అర్థం కాలేదా?" కాస్త కర్కశత్వమే తొణికింది అతని కంఠస్వరంలో,

వణికిపోయింది.

"కాదు, కాదు"

నందనాన్ని అనుకుని మనసులో, వక్కసారి బయటికి అంది.

"అయితే మరేమిటి?"

ఇందులో ఇందాకటి కర్కశత్వం కనిపించటంలేదు.

కాగా ఆతురత ధ్వనిస్తోంది.

"తెల్లారవస్తోంది. మీరింటికెళ్ళొద్దా? మళ్ళీ ఎవరైనా చూస్తే?"

అప్పుడు తెలిసివచ్చిందతనికి.

ఓహ్! ఎంత మందమతి తను!

"ఔనౌను. నేను వళ్ళుమరచి నిదురపోయాను. కదూ? మీ అష్టపది 'ధీరసమీరే' చాలా బాగుంది. వెళ్ళిపోతున్నాను. మళ్ళీ రాత్రి అదే వేళకి వస్తాను. వెళ్ళాలి యిప్పుడే లేకుంటే చాలా ప్రమాదం."

అతని మాటల్లో చాలా త్వరితం కనిపించింది. ఆమెకి నవ్వు వచ్చింది. అతని ఆతురత చూస్తే!

"క్షమించండి పొరబడి అన్నందుకు. ఆ అన్నట్లు నీ పేరేమిటి?...నా పేరు ప్రసాద్.....ఏమిటి? సు...జాతా? ఓహ్! ఎంత చక్కటి పేరు! వస్తాను."

చిరాకు ఎక్కువకాగా దుప్పటిలాగిలేస్తూ 'అన్నయ్యా! అన్నయ్యా! లెయ్!. ఏంటీ పాడునిద్ర?' అంది కాస్తకోపాన్ని కూడా కంఠస్వరంలో కలుపుతూ

వంటింట్లోంచి కూడా "ఒరే! రమణా లేయరాబాబు లేయ్! నేనున్నన్ని నాళ్ళైనా కాస్త వేగంగా నిద్రలేస్తూ వుండరాబాబూ" అంది ఓ ముసలి గొంతుక సాధ్యమైనంత విసుగుని అందిలో ధ్వనిస్తోంది స్వరాన్నిబట్టి ఆ గొంతుక్కి వయస్సు సుమారు ఓ అరవై వుండొచ్చనిపిస్తుంది.

"అబ్బ చంపుతారే"

విసుగ్గా గొణుక్కుంటూ లేచి ప్రక్కన్నేవున్న కుర్చీలో కళ్ళుమూసుకుంటూ పడుకున్నాడు బద్ధకం వదలక.

ఈ ప్రపంచములో తెల్లారాకకూడ నిద్దురపోయేవాళ్ళ సంఖ్య కాస్త అధికమే!

ఆనాడు అంటె సుమారు ఒకటి రెండు శతాబ్దాలక్రితం ప్రతివ్యక్తీ వేకువనే లేస్తూవుండేవారు. సూర్యోదయం సోకుతూవుండగా పడుకుంటే 'దరిద్ర్యం' అనే భావనలో వుండేవారు. అంతేకాక కాలాన్ని సద్వినియోగ పర్చుకోవటం కూడా అవుతూవుండేది.

మన ఈ ఆచారాన్ని చూచే ఆంగ్లేయులుకూడా "త్వరగా పడుకుని త్వరగా లెయ్" అన్నారు. కానీ మన వాళ్లు మాత్రం దీన్ని ఇప్పుడు పూర్తిగ మరచిపోయారు.

ఈ కాలంలో తెల్లారాక కూడా పడుకుంటే అది తెలివిగా ప్రొద్దని, పడుకోవాలని సమర్థించుకుంటున్నారు. భావి భారత పౌరులనే విద్యార్థులు కూడా వేకువన లేవటమే లేదు. రాత్రిళ్లు సినిమాలు చూచి రెండు గంటల్దాకా నిద్రపోకపోవటం, ఉదయం ఎనిమిది గంటల వరకూ మంచాన్ని అంటిపెట్టుకోవటం ఆచారమైపోయింది.

ఆ రకానికి చెందినవాడే ఈ వ్యక్తి కూడా!

పైగా ఈలాంటి అలవాటున్న వాళ్ళని తెల్లారాకనైనా నిద్ర లేపుదామంటే వాళ్ళకి అలవిమాలిన కోపం! భరింపలేని విసుగు!

"ఛీ! ఛీ! నిద్దురపోతు" అనుకుంటూ పరుపుని చుట్టివేసి, మంచాన్ని ఎత్తి, బయట వాకిట వారగా నిలబెట్టివచ్చింది.

ఇంకా కుర్చీలో జోగుతూనే వున్నాడు రమణ. విసుక్కుంటూ అతని చేయిపట్టుకుని లాక్కునివెళ్ళింది బాత్ రూంలోకి.

"ఊ! పట్టు! పళ్ళపొడి" అంది పొట్లం తీసుకుంటూ.

"ఊ! పళ్ళపొడా? సరే!"

అలాగే కళ్లు తెరుస్తూ మూస్తూ కుడిచేయి జాచాడు.

"ఛీ! ఛీ! ఒట్టి నిద్దుర మొఖం"

ఎడమచేయి లాగి అందులో వేసిందిపాడి.

అలాగా మబ్బుగా ముఖం కడుకుని, తర్వాత సబ్బుతో తో ముఖుని టవల్ తో తుడుచుకుంటూ ఇంట్లోకి వచ్చాడు రమణ.

రెడీగా ఎదురుగ్గా కాఫీకప్పు పట్టుకుని నిల్చుంది ఆమ్మాయ్.

చెల్లెలి చేతిలోంచి పొగలు కమ్మే కాఫీ అందుకుంటూ అన్నాడు!

"విజయా! నీకెన్నిసార్లు చెప్పాలి? ఇంతప్రొద్దు క్కీ నిద్దర్లేపొద్దని?"

విజయ ఏమీ జవాబు చెప్పకుండా కోపంగా గడియారం వైపు చేయి చూపించింది.

ఎనిమిది చూపిస్తోంది'

'బాబోయ్! ఎనిమిదే?' అని మనసులో అనుకున్నా "ఆ! ఎనిమిదే తెల్సూ!" అన్నట్టు చూచాడు.

రమణమ్మగారు మాత్రం కోపంగా అంది

"అదేంట్రా బాబూ! ఎనిమిదిదాకా పడుకుంటే మార్కెట్ కి ఎవరెళతారు? పైగా వాకిలికి అడ్డుగా పడుకుని లేవకుంటే నేనెలా బయటికి వచ్చేది. నే బ్రతికున్నన్నాళ్ళైనా కాస్త

మనుగుమైలా అనేది వుండనివ్వరా యింట్లో? ఆ తర్వాత ఆ వచ్చేదాని యిష్టమూ నీ యిష్టమునూ!"

తల్లి మాటాడితే జవాబేమీ యివ్వడు రమణ. మెల్లిగా కాఫీ తాగేసి, చేతిసంచి వూపుకుంటూ బయల్దేరాడు మార్కెట్ కి.

"అన్నయ్యోయ్! మామిడికాయలూ, వంకాయలు పట్రారా!" అంది అరుస్తో విజయ.

'అలాగే' నని తలూపుతూ తిరిగి అయినా చూడకుండా చకచకా నడుచుకుంటూ ముందుకుసాగాడు.

* * * * *

తలవంచుకుని కూరగాయలేరుతోన్న దివాకర్ వీపు 'ఛెడేల్' మంది.

హఠాత్తుగా అలా దెబ్బతగలటంతో బిత్తరపోయి సరిగా లేచి నుంచుని వెనుదిరిగి చూచాడు.

ఎదురుగ్గా రమణ!

పైగా నివ్వుతున్నాడు.

"చంపుతావేరా అందర్నీ యిలా గుద్దుడూ? అంతటి బలంభీముడివైతే మిలటరీలో చేరరాదూ? శత్రువుల బెడద అయినా తొలిగిపోయేది!" అన్నాడు.

కళ్ళల్లో నీళ్లు సన్నగా తిరుగుతోన్నాయ్!

మిత్రుడి బాధకు నొచ్చుకుంటూ "సారీ! రా! బ్రదర్! కాస్త తీవ్రంగా సోకింది దెబ్బ! ఏమీ అనుకోకు." అని ఆగి

"ఆ! ఏమేం బేరం చేస్తున్నావేమిటి? మా చెల్లాయ్ బెండలూ, చిక్కుడూ కావాలని స్పెషల్ గా చెప్పిందిలే! బేగం చెయ్" అన్నాడు.

"సరే! సరే! ఇక్కడివి కానీ" అన్నాడు మామిడి కాయలు బేరం చేస్తున్న దివాకరం.

తర్వాత

"అవును గానీ రమణా! క్రొత్తకాయలు కదరా! కొంచెం మామిడి కాయలుకూడా పసందు చేయరాదూ?" అన్నాడు.

"అబ్బాయ్! అదంతా మా ఆవిడ వ్యవహారమేంటు పని. మిగ పనల్లా చెప్పినవి తీసికెళ్లటమూ, చేసింది తిని వెళ్ళటమూ అంతే! మనకింకా రుచులూ, పచులూ ఏర్పాటు లేదు"

"సరే నీ యిష్టం కానీ! అయితే నా వాటిల్లో రెండు తీసికెళ్ళటానికి అభ్యంతరమా" అన్నాడు రెండు కాయల్ని చేతిలో పుచ్చుకుని నవ్వుతో.

ఇదంతా గమనిస్తోన్న కూరగాయలమ్మి చిరునవ్వు నవ్వుతోంది!

తలగోక్కేసి నక్కింది రమణికి!

"ఛీ!ఛీ! ఏం మనిషి వీడు! మార్కెట్లో సరసాలు మరీనూ. ఎదురుగా అమ్మాయ్ నవ్వుతూన్నా సిగ్గులేదు. అందులో మరీ పదహారేళ్లన్నా లేవు ఆ అమ్మాయికి ఆమె ఎదురుగానా ఈ తతంగమంతా?"

కోపంగా ఆ కాయలు లాక్కుని పక్క వాడి దగ్గరకు వెళ్లి "అబ్బాయ్! ఓ సేరు చిక్కుడు కాయలూ, ఓ అణా చేమ కూరాకు యివ్వు" అన్నాడు.

దివాకరం ఆశ్చర్యపోతూ అన్నాడు.

"ఒరేయ్ రమణా! అదేంట్రా బెండకాయలూ చిక్కుడు కాయలని మళ్లీ చిక్కుడు కాయలూ చేమకూర అంటా వేంట్రా"

ఆ అమ్మాయ్ ఈ సారి గట్టిగా పగలబడే నవ్వింది.

రమణకే వళ్లు మండి పోయింది.

చాటుగా ఆ అమ్మాయ్‌ని వెక్కిరించాడు. అంతే! ఆమె ముఖం ముడుచుకు పోయింది.

"చూడు దివా! నా మతిమరపు సంగతి తెలిసీ అలా అడుగుతావేం? నా జ్ఞాపకం సంగతంతా ఒక్క పుస్తకాల విషయాల్లోనే! ఏవో రెండురకాలు కొను! అంతే!"

నవనవ లాడుతున్న వంకాయలలో రెండుసేర్లు బెండ కాయలలో నాలుగుసేర్లు, చిక్కుడు కాయలలో సేరు కొనుక్కొని మార్కెట్ విడిచారు.

నాలుగు వీధుల కూడలి దగ్గర విడిపోయారిద్దరు!

కాస్తదూరం వెళ్ళాక, వెనక్కి తిరిగి అరిచాడు దివాకరం.

"ఓరేయ్ రమణా సాయంత్రం కలుస్తావు కదూ ప్రసాద్ రూమ్ కిరా!"

అందరూ తనవైపు చూడటంతో సిగ్గలి !అలాగేనని ందుముకు సాగాడు రమణ

విజయా మామిడి కాయలు లేవమ్మా! చేమదుంపలా బెండ కాయలు తెచ్చాను" అన్నాడు సంచి అక్కడ వేస్తూ

పెరట్లో స్నానం చేస్తోన్న విజయ 'అలాగే!" అంది. 'వణమ్మ గారు కూడా-

ఒరేయ్ రమణా! ఆ సంచి అలాగే వేసెళ్తే ఎలారా? కాస్త గుమ్మరించి వెళ్ళరా బాబూ! మడి ముండదాన్ని ఎలా ముట్టుకోను"

అంటున్నా వినిపించుకోకుండా వెళ్లి అప్పుడే పుస్తకం చేత బట్టుకొని కూర్చున్నాడు కుర్చీలో. ఇక అతనికి బయటి ప్రపంచం కనిపించదు. వినిపించదు. వినిపించినా అతని జవాబులు 'ఆ! ఊ!' అంతే!

వాస్తవంగా 'పుస్తక ప్రపంచం' లో మునిగిన వానికి స్వాప్నిక లేదా ఊహా జగత్తేగానీ మరొకటి ఉండదు. ఆ లోచిస్తే వాళ్ళి ఈ ప్రపంచంలో వుండరాదనే నా ఉద్దేశ్యం. ఈ లోకంలో మానవుల ద్వేషాలు, ఊహాలు, ప్రేమలు వున్నవే అన్నీ అందులో ప్రతిబింబిస్తాయ్ రచయిత యొక్క శక్తి సామర్థ్యాలతో — ఈ లోకంలో వాటినన్నిటినీ అనుభవిస్తాడు మానవుడు. వాటినన్నిటినీ మానసికంగా అనుభవించటమే పఠిత చేయాల్సినపని. అనుభవించాలంటే అందులో పూర్తిగా మునిగి పోవాల్సిందే. అలా పఠితలేనం కాని నాడు రచనకు — రచయితకు — పఠితకు మధ్యన వున్న సంబంధానికి తగిన న్యాయం చేకూర్చలేడు

స్నానంముగించుకుని వస్తూ తడివొత్తుకుంటూ వచ్చింది విజయ. వాకిట్లోకి వచ్చి చేతిసంచి గ్రుమ్మరించింది. చీర చక్కగా చుట్టుకుంటూ కూర్చుంది.

అందులో రెండు మామిడి కాయలు, బెండకాయలు, చిక్కుడు కాయలు, వంకాయలూ వున్నాయ్!

విస్తుబోతూ —

"నీకు మరీ వేళాకోళంగా వుందిరా అడిగానని! తీసుకుని రమ్మంటే అన్నీ తెచ్చి మళ్లీ తేలేదంటావేం? పైగా రెండే తెచ్చావెందుకు?"

ముఖాన తేమ వొత్తుకుంటూ అంది.

తడికి ఫాలభాగంలో అంటుకునివున్న ముంగుర్లు ఓవింత సోయగాన్ని తెస్తున్నాయ్!

చక్కగా ముఖం రుద్దుకుని, తడి ఆరీఆరకుండా వుండటం వల్ల విజయ ముఖం మరీ అందంగా కనిపిస్తూవుంది. సౌందర్య సుధావాహినిలా, ముద్దకట్టిన ముగ్ధమోహన రూపంలా, సడి కలు నేర్చిన మెఱుపు తీవలా, తళతళ లాడుతూ మిరుమిట్లు గొలిపే కాంతితో దివినుండి భువికి దిగివచ్చిన తారకలా చూచేవారికి నేత్రపర్వంగా వుంది.

ఎదురుగా నిల్చుని వుంది విజయ.

ఐనా ఆమెని గమనించకుండా 'ఆ' అన్నాడు పేజీ త్రిప్పుతూ –

'ఇంకేం పలుకుతావ్ నీవు' అంది నిష్ఠూరంగా.

మెల్లిగా అంది.

'అన్నాయ్! అదేం పుస్తకంరా?

అన్నకంటే మించిపోయేది చెల్లెలు పఠనంలో

తల్లి చంపేస్తుందని ఆమె ఆసక్తి అప్పుడప్పుడూ చంపు కుంటుంది గానీ కాకపోతే అన్నని మించిపోయేది పర్ధ్యాసంలో.

రమణ జవాబివ్వక పోవటంతో విసుగా వంటింట్లోకి వెళ్ళిపోయింది.

మెషీను తిరిగినట్లు పడబోయి వాకిలి పట్టుకుని నిలద్రొక్కుకుంది.

"అబ్బబ్బా! నీకు మరీ తొందరే" అని రమణ గొణుగుతున్నా వినిపించుకోకుండా- కాలు ఇరుకు పట్టడంతో కుంటుతూ కుంటుతూనే పోయింది.

ఆమె దృష్టి అంతా-

"అన్నయ్య ఆఫీసుకి ఎప్పుడెళ్తాడా?" అనే-

ఇంకేం ఆ తర్వాత-

సాయంత్రం వరకు చక్కగా ఆ నవలని చదువుతూ హాయిగా తీయగా స్వాప్నిక జగత్తుల్లో తేలిపోతూ వుండొచ్చు-

ఆఫీసుకెళ్లి ఆఫీసులోని విసుగునంతా నెత్తిన వేసుకుని చిరాగ్గా యింటికొచ్చాడు రమణ.

వస్తూనే ఎదురుగా విజయ కనిపించింది పుస్తకంతో ఆ చిరాకుతో "ఇంకేం పనివున్నట్టు లేదే! ఇక చాల్లే విజయా" అన్నాడు కాస్త కోపంగా!

బెదిరిన లేడి పిల్లలాగా కంగారుగా పుస్తకాన్ని దాచుతూ-

"అప్పుడే అయిదయిపోయిందా?" అంటూ కాఫీ తేవటానికి వెళ్లింది.

గ్లాసుల్నిలని కాఫీ గ్లాసులుకి వంచుతూ, తలకాస్త ఎత్తి అతనివైపు చిరునవ్వుతో చూస్తో అంది

"చాలా బావుందన్నాయ్?"

ఏమిటి బావుండటం ?

గ్లాసుల్లుంచి వంచి యిస్తోన్న కాఫియా ?

ఇందాక చదువుతూ మూసిన నవలనా ?

ఎన్నెన్నో అనుమానాలున్నాయ్? కాని రమణ అడిగే స్థితిలో లేడిప్పుడు.

నిర్లిప్తంగా కళ్ళెత్తి చూచి మెల్లగా కాఫీ త్రాగడం ప్రారంభించాడు.

సరియైన సమాధానం రాకపోవటంతో గాజులు సరిచేసుకుంటూ మళ్ళీ మాటాడ బోయింది.

విజయ లాంటి మనః ప్రవృత్తిగల అమ్మాయికి అడిగిన ప్రశ్నకి సమాధానం రాకపోతే మళ్ళీ మళ్ళీ ప్రశ్నించి చివరికి చివాట్లైనా తిని అనతలికి మూతిముడుచుకుని పోవటం అంటూ వుంటుంది గానీ ప్రశ్నించటం మానుకోవడమ నేది మాత్రం వుండదు. వాళ్ళకి సమాధానం కావాలి! అంతే! నిర్లిప్తత కాదు! ఏదో ఓ జవాబు! తిట్టైనా తియ్యనైనా ? ఏదైనా ఓటి నోటి నుండి రావాల్సిందే. అలాంటి మన స్తత్వం మూర్తీ భవించిన వ్యక్తి విజయ.

చిరిగిన రవికని చిలుగు కప్పేట్టు లాక్కుంటూ అంది—

"అన్నయ్యా రవికలు చిరిగాయిరా? కొత్తవి తీసుకుని రావాలి."

ఏదో పరధ్యానంలో వున్నట్టు ఇంకా గాఫీ త్రాగుతూనే వున్నాడు. చల్లగా చల్లారి పోతోంది కాఫీ. వేసవి గాడ్పుల్లాగ వీస్తోంది ఎండ. దుర్మార్గుడైన అధికారి ఎప్పుడూ అపకారమే చేస్తాడు వాడి మంచితనం కూడా అపకారమే చేస్తుంది. లేకపోతే సాయంత్రం అయిదు దాటినా ఇంకా వేడి గాడ్పు లేమిటి? ప్రొద్దు కుంకటానికి రెండు గంటలు కాలమే వుంది. కానీ ఆరే దీపానికి అంతకు పూర్వం వెలుగెక్కువాట! ఈ 'దీపానికి' కూడా ఆరిపోవటానికి ముందు వేడి వేడి నిప్పుల్ని చేటలో పోస చెరగటం అలవాటు! ఫాల్గుణ మాసమే ఇలా వుంది! చైత్రం వైశాఖాల మాట చెప్పుకోవాల్సిన అవసరమే వుండదు.

మళ్ళీ రెట్టించిదిచం విజయ!

కాస్త చిరాకుతో 'అబ్బబ్బ'! ఆగవే! అన్నాడు. తలెత్తి చూడటంతో చెల్లెలి ముఖం చిన్నబోయి వుండటం గమనించాడు. అతని మనస్సు చివుక్కుమంది. అయ్యో! పాపం తను ఈ పరధ్యానంలో ఆమెని కసురుకున్నాడు గామాల్ను! ఛీ! ఛీ. !

కుర్చీలోంచి లేచి, చెల్లెలి భుజంపై చేయివేసి, "అదికాదు విజ్జీ! ఒకటో తేది రాందేనా? రానీ! అలాగే నీక్కావలసిన

వన్ని తెస్తాను. సరేనా? పౌడరు, స్నో కూడా అయిపోయి నట్టుంది. అవీ తెస్తాను. నీకంటే నాకు కావలసిన వారెవరున్నా రమ్మా" అన్నాడు. అతనికి చెల్లెలి మనస్సు కాస్తైనా నొప్పి పడటం సహించలేని విషయం!

అతని ముఖంలో జాలువారుతూన్న ప్రేమను చూచి ఆమె మనస్సు పొంగింది. 'తనని ఎంతగా అభిమానిస్తున్నాడు అన్నయ్యా! చాలు ఒక్కమాట చాలు ఇలా హృదయం కలిగించ గల్గింది!'

చెల్లెలు ముఖం వికసిత కమలం లా వుండటం చూచి మెల్లగా తలదించుకుంటూ, అనాలోచితంగా చేతులవైపు చూచాడు. వాటిల్లో గాజులు తక్కువగా వుండటం గమనించి అన్నాడు.

"అదేవిటమ్మా! గాజులు పగిలి పోయాయా? మళ్లీ వేయించుకోరాదూ? అయినా అలాటివి కూడా నాకు చెప్పక పోతే ఎలా తెలుస్తాయ్? అమ్మయినా నాతో హెచ్చరించి వుండాల్సింది? లక్ష్మిలా కలకలలాడుతూ తిరుగుతూ వుండా ల్సిన దానివి ఇలా వుండటం ఏమీ బావు లేదమ్మా. ఆడపిల్ల మనస్సు కంటగించుకుంటే అది పుట్టినింటికి శ్రేయస్కరముకాదు. ఏమైనా అన్నీ నీ తర్వాతే! నా సుఖమూ, దుఃఖము ,నీసుఖ దుఃఖాల తర్వాతే!"

అన్న ఆదరణకి పొంగిపోతూ గెంతుతూ వెళ్లింది విజయ 'అలాగే' నంటూ.

ఆమె వెళ్లినవేపు నిర్లిప్తతతో చూస్తూ ఓ చిఱునవ్వు నవ్వాడు. ఆ చిఱుదరహాసం ఓ గడ్డిపూవు తనపై వీచిన మందమారుతానికి కదలినట్లుంది.

దివాకరం తనున్న విషయం జ్ఞప్తికి రావటంతో మెల్లగా బయటికి వెళ్లాడు.

ఓ అరఘడియతర్వాత ముఖం తుడుచుకుంటూ బయటికి వచ్చిన విజయకి కుర్చీ బోసిగా నవ్వుతో ఆ నోటిలో పెద్ద పంటిలా తెల్లటి పుస్తకం పరిహసిస్తున్నట్లు కనబడింది. తెల్లబోతూ ఆ పుస్తకం తీసుకుని అలాగే కుర్చీలో కూలబడింది. ముఖం అలాగే తుడుచుకుని భుజంపై తువ్వాలు అలాగే వేసుకుని కూర్చుండి పోయింది.

సారస్వత లోకంలో సంగీతపు సరిగమల గమగమలతో మైమరచి మత్తిల్లి మానసోల్లాసంగా మధువును మధింపుచుంటూ మదిరా, మానినుల కంటే మత్తెక్కించే శక్తి, మాధురీ యిందులో వున్నాయ్ అన్నట్లు నిరూపించుతూ పఠనంలో మునిగిపోయింది విజయ.

రమ్మని పిలువటానికి వెళ్లిన విజయా, రమణా ఎవరూ ఎంతకీ రాకపోవటంతో రవణమ్మగారే బయటికి వచ్చింది.

ఎదురుగా చేతిలో పుస్తకంతో, భుజంపై టవలుతో చెదరి ఆడుకుంటూన్న ముంగురులతో ముగ్ధత్వం మూర్తీభవించి నల్లు నవ్వుతోన్న మల్లెపూవులాగా కనిపించింది విజయ.

నేత్ర పర్వంగా కనిపించిన కమనీయ దృశ్యానికి మురిసినా, ఆడదానికి అంతటి రసైకగ్రహణ మత్త చిత్తం వుండటం లోకం అంగీకరించి సహించలేదని గ్రహించిన స్త్రీత్వంలో నూడిన వేదనతో కూతుర్ని కేకేసింది.

తల్లి పిలుపుకి, పిడుగుపాటికి చెదరిపోయిన లేళ్ళ గుంపులో నుండి వేరుపడిన లేతకురంగిలాగా బిత్తర చూపులతో ఉలికి పాటుతో తల్లి వెంట నడచింది వంటింట్లోకి.

నీలిల ఆకాశంనుండీ, ఘనశ్యామల మేఘ పర్వత పంక్తి నుండి జారి భూమిని స్పృశించాలని పరిశుద్ధంగా నేలకు జారుతోన్న వర్షపు చినుక్కి మధ్యమార్గంలో ఏదో అడ్డుతగిలితే ఎంతగా ఘూర్ణిల్లుతుందో అలాగా, మందమంద మలయానిల సౌరభానికి మత్తిల్లి, మత్తకాశినుల శిరః ప్రధానస్థాయి శోభిల్లు కుతూహలపడి, గాలిలో నయ్యాటలాడుతూ ఆనందనాగర సంగమానికి సిద్ధపడే నునుమల్లెని ఓ అపరిపక్వ మనస్కుడు క్రూరంగా త్రుంచి వాసనజూచి నలిపివేసితే ఆ నిర్దాక్షిణ్యానికి బలియైన మల్లెలాగా, తన పుస్తక పఠనానికి కలిగిన ఆటంకానికి బాధపడుతూ వెళ్ళింది విజయ.

* * * * * *

## 3

ప్రసాద్ ఆ పట్టణానికి కాస్త కనుచూపు మరుగులో కనిపించే ఓ పల్లెకి ప్రభువు లాంటివాడు. జమిందారీతత్వం బాగా ప్రబలిపోయిన రోజుల్లో ప్రసాద్ తండ్రి రాఘవయ్య

గారు తన జీవనాన్ని శ్రమని విద్యనీ పెంచి కావలసినంత ఆస్తిని కూడ గొట్టుకున్నారు. ఎక్కడైతే ధనంవుందో అక్కడే అజ్ఞాతంగా పరువు ప్రతిష్టలుకూడా తిష్టవేస్తాయ్. అందులోనూ రాఘవయ్యగారి వంటి వ్యక్తికి – మానవత్వం మూర్తీభవించిన వ్యక్తికి – దయా దాక్షిణ్యాలకి సముద్రుడు – అతనికేం కావలసినంత అండదండలతోపాటు వద్దన్నా వచ్చే గౌరవ సత్కార ఆదరాలున్నాయ్.

దారిద్రపు ఛాయల్లోకైనా వెళ్ళాల్సి అగత్యం లేదు ప్రసాద్‌కి. అయినా అతనికి బీదరికమంటే ప్రేమ. తనకీ – సంస్కారమున్న ఏ ధనవంతుడికైనా – సామాన్య ప్రజలకీ ఏమిటి తేడా? తనకి ధనంవుంది – వాళ్ళకి లేదు. అతేనా? కేవలం ఒక్క ధనంతోనేనా అన్నీ వచ్చేది? తెగని మనస్సులతో ఆలోచనలతో అలమటిస్తూ వుంటాడు ప్రసాద్.

అతనికి మనసారా ప్రేమించే వ్యక్తులంటే ప్రాణం. 'స్నేహితమంటే ఇద్దరి వ్యక్తుల మధ్య పొఱపొచ్చాలు లేకుండటమే' అని అతని భావం. అలాంటి వారికై తన ప్రాణమైనా యిచ్చేస్తాడు. ఇక అతనికి డబ్బు ఓ లెక్కలోది కాదు.

వాళ్ళ నాన్నగారు "నాయినా! రోజూ కార్లో వెళ్ళి చదువుకున రారా" అన్నా, తనకి మిత్రులకీ మధ్య అదో పెద్ద అవరోధమని, వినకుండా అక్కడే ఓ పెద్ద మేడ వూరిచివర్న అద్దెకి తీసుకుని వుంటున్నాడు.

ప్రశాంతంగా ప్రకృతి మధ్య ప్రకృతి బిడ్డలాగా భగవంతుని 'ప్రసాదం' లాగా నివసిస్తున్నాడు.

దివాకరం ప్రసాద్ క్లాస్‌మేట్స్. రమణా దివాకరం ఆ ప్రమిత్రులు. తద్వారా రమణ పరిచయం ప్రసాద్‌కి కలిగింది.

మిత్రుల్లో రమణా ప్రసాద్‌ల స్నేహాన్ని గురించి ఓ మాట హాస్యంగా చలామణి అవుతోంది అది 'మగ దంపతుల' నే మాట. తర్వాత ఈ ముగ్గుర్నీ కలిపి 'బ్రహ్మత్రయ' మనేవారు.

రమణా దివాకరుల మధ్య పొచ్చాపొచ్చాలు లేవు. వారి స్నేహము గంగా యమునల సంగమం వంటిది. నిర్మలంగా సాఫీగా ఒడుదుడుకుల్లేకుండా సాగిపోతూ వుండే నదుల్లాగా వారి జీవితాలూ సాగి పోతున్నాయ్.

రమణా ప్రసాద్‌ల మధ్య భేదాలంటూ, అభిప్రాయాలంటూ అసల్లేవు. ఒకే అభిప్రాయం! ఒకే నిర్ణయం వారిది. ఒకగాడిలో పయనించే బండిలాగా, వారి స్నేహశకటం నిదానంగా నెమ్మదిగా సాగిపోతోంది. వీరి స్నేహం యమునా సరస్వతుల సంగమం వంటిది.

వీరి ముగ్గురిమధ్యా పొచ్చాపొచ్చాలనే మాటే పుట్టలేదు. ఇకముందూ పుట్టబోదనే వాళ్లనుకుంటూ వున్నారు. త్రివేణీ సంగమంవలె వారిస్నేహం నిర్మలమూ, నిశ్చలమూ.

వారు వ్యక్తులుగా ముగ్గురు సంపూర్ణ వ్యక్తిగా ఒక్కరు. పలువురి దృష్టిలో వారు ముగ్గురే! కానీ వారివారి దృష్టిలో వారు ఒక్కరే! వాళ్లు ముగ్గురూ ఒక్కటిగ బ్రతుకుతున్నారు. ఒక్కటిగ మాట్లాడతారు. ఒక్కరిగ పోట్లాడతారు.

వారిలో దివాకరం సుమారుగ వున్నవాడే! అతనూ ఆకాశానికి కొస్త దూరంలోవున్న ఓ పల్లెకి చెందినవాడు. విద్యాభ్యాసం నిమిత్తం వచ్చాడు.

ఇక రమణ ఒక్కడే గత్యంతరం లేక తల్లి చెల్లెళ్ళతో ఆఫీసుల్లో ఉద్యోగం వెలగబెడుతున్నాడు పొట్టకోసమై!

రమణ వెళ్ళేసరికి —

ప్రసిద్ రేడియోవింటూ 'కాఫీ' త్రాగుతోన్నాడు. దివాకరం 'ఓవోమాల్ట్' ఆస్వాదన, సంగీతం రసాస్వాదనా చేస్తోన్నాడు.

రమణ వెళ్ళేక అతని భాగం 'హార్లిక్స్' వేడిగా వచ్చింది.

హాయిగా పాటలు వినటం ముగిశాక రమణే మెల్లిగా కదిలేశాడు.

'ఓయ్' దివా! అదేమిటా పరధ్యానం? నేనో మంచి విషయం చెబుతావిను! ఒకమంచి నావెల్ని సుమారు ఓవారం రోజుల్నించి చదువుతోన్నా! భలేగా వుందనుకో! నాలోని కొన్ని గుణాలు, నీలోని కొన్ని గుణాలు, ప్రసాద్‌లోని కొన్ని గుణాలు అన్నీ కలిపి మనమేనా అనుకునేట్టు ఓ పాత్ర సృష్టించాడు. నాకు భలే నచ్చిందిరా? భలేగా వుందనుకో!
ఆ విషయం చెపుతోంటే అతని ముఖంలో ఆశ్చర్యం, సంతోషం ఒకటివెంట ఒకటి ప్రస్ఫుటమౌతున్నాయ్!

ప్రసాద్ నవ్వుతో అన్నాడు —

"ఎంతకీ 'బావుందనుకో,' అసలు మేనా? లేకపోతే ఆ బావుంటం ఏమైనా చెప్పటం వుందా?"

మిత్రుడి చమత్కారానికి గట్టిగా నవ్వాడు దివాకరం!

సిగ్గుపడుతూ అన్నాడు ప్రసాద్.

"అది కాదోయ్! నవల అంటే జీవితమే అన్నమాట. జీవితానికీ ప్రతిబింబానికీ ఆట్టే తేడా లేదు. నవల - జీవితానికి ప్రతిబింబం - జీవితమనేది యిలా వుండాలని ఎలా నిర్వచించలేమో, నవలనికూడా కొన్ని పరిధుల్ని ఏర్పరచి యిలా వుండాలని నిర్వచించలేం. కానీ జీవితం యిలా వుంటే బావుందని అనుకోగలం - ఎలా వుంటే బావుంటుందో ఊహించుకోగలం. అలాగే నవలనీ చదివాక - చదువుతూ వుండగనే నచ్చిందీ లేనిదీ - ఎలా వుంటే బావుండి వుండేదీ చెప్పగలవు - !"

దివాకరం అడ్డుతగులుతూ అన్నాడు.

"ఏకు వచ్చిందీ చెప్పరా అంటే - నవల అంటే అంటే ఏమిటి? అదిఎలా? వుండాలి? ఇదిఎలాగా చర్చించమన్నది? ఈ ఉపోద్ఘాతం ఎందుకు బాగా?"

"నీ విట్టుకేం! చాలా సంతోషించాం! చెప్పేది కాస్త శ్రద్ధగ విను! నాకు జీవితంఅంటే పెద్ద అయిడియాలు లేవు. అలాగని లేకనూ పోలేదు. అసలు జీవితమంటేనే ఓ పెద్ద జిల్ బ్రదర్. నీవు సాల్వ్ చేస్తే అదిరైటూ కావచ్చు. తప్పూ కావచ్చు! నీవు వ్రాసింది ఆ 'నిర్ణీతలు' వ్రాసిందాసితో నీకీ భవించాలి. అంతే! అది అచ్చంగా రైటూ కావల్సిన అవసరం కూడా లేదు. అంచేతే పజిల్స్‌కి కట్టి బాధ పడేదానికన్నా పజిల్స్‌నీ, ఫలితాల్నీ చూస్తూ గడపటం హాయి అనుకుంటాను."

"ఇదిగో రమణా! నీకీ పుస్తకాలతో పిచ్చెక్కేలాగుంది. లేకుంటే అసలు విషయం చెప్పరా అంటే ఏదో పజిల్స్, జీవితం గురించి చెవుతావేం?"

కోపంగా దివాకరం వేపు చూస్తూ —

"నీవు వినరా ప్రసాద్! వాడి మాటకేం గానీ. నా మటుక్కి రచన అంటే అందులో ప్రాధాన్యం యివ్వవలసి చర్చలకి కాక జవాబులకి. దేన్నో గురించి చర్చిస్తూ, ఎవ్వరికీ తెలీదనీ నీ వాక్కడివే చెప్పాలనుకోవటం కే పొరబాటు."

"జీవితం ఎలా ప్రారంభమవుతుందో, ఎలా అంత్య మవుతుందో ఎవరికీ తెలీదు. కానీ ప్రతివాడికీ తన ... అంటూ ఓ టుంటుంది. తెలీనిదాన్ని అనుభవించట ...ించేదానికి సిద్ధమవటం ఇదంతా 'డిక్టేటర్ షిప్'

దేవుడి డిక్టేటర్! ఈ మానవులందరూ - నేనుకూడ - దేవుడు చేసినే అంటారు - ఎందుకంటే అతడున్నాడన్న లేడన్నా [illegible] కొనసాగేది లేదు - జరుగుతుందని ఎవరు అనుకుంటారో వారికి దేవుడున్నాడు - పోనీలే దానివిషయం. జీవితం ప్రారంభించాక చివరి కంటూ సాగిపోతుందేగాని మధ్యన ఆగదు. అలా నవల కూడా సాగాలి.”

తర్వాత -

జీవితంలో ఓ సంఘటన తర్వాత మరో సంఘటన జరిగిపోతూ మానవుడికి ఆనందం, హాయి, దుఃఖం, చిరాకు ఎలా కల్గిస్తూ వుంటాయో రచనలోనూ అలాగే సాగిపోవాలి! రచయిత బాధ్యత అంతా తాను ఓ టేప్ రికార్డర్‌లాగా, చిత్రించే ఫిల్మ్‌లాగా పని చేయటం తప్ప మరోటి వుండకూడదు. తానొక విమర్శకుడుగ అందులో జొరబడకూడదు. ఎందుచేతంటే రచనకీ విమర్శకీ చాలా దూరం.”

“ఇక ముగింపుని గురించి ఓ పెద్ద చర్చవుంది. పాఠక లోకంలో. కొందరు విశ్వనాథ ముగింపు, మరికొందరు శరత్ ముగింపనీ మెచ్చుకొంటారు. ఇంకొ రింకోటి. కాని నేననటం జీవితమంతా ఓ నవల్లో చిత్రించటం సాధ్యం కాదు అలా చిత్రించ గల్గితే ముగింపు మాత్రం జీవితంలోలాగే విషాదమే! అందుకనే జీవితం ఇంకా మిగిలే వుంటుంది కాబట్టి ఆ మిగతా అంతా పాఠకులే - వారి ఊహాకే వదిలేసి - ఓ సంఘటనతో ముగించటం అసలైన నవలకి ముగింపు -’

ఆగాడు ఊపిరి గట్టిగా పీల్చుస్తూ.

'ఏం' అయిపోయిందా? నీ ఉపన్యాసం! విను ప్రసాద్! ఈ అభిప్రాయాలు మనతో చెప్పేవు కాని నలుగురిలో వెలి బుచ్చుతే నవ్విపోరూ? నీ అభిప్రాయాలు వాటి నిర్ధారణ ఒక్కటీ సమంజసంగా లేవు. మరీ యింత అమాయకంగా వున్నావేంరా బాబూ? ఈనాడు ఆధునిక ప్రపంచం ఎంత ఉత్కృత్తమ వేగంతో ముందుకు సాగిపోతుందో, ఏమేం జరుగ నున్నాయో ఏమైనా గమనించావా? నీ ధోరణిలో నీవు నాగుతూ, అన్నీ నీవనుకున్నట్టు సిస్టమేటిక్‌గ జరగాలంటే నిన్ను వెఱ్ఱివాడి క్రింద జమకట్టారు. ఒక్కోసారి అన్యాయం, అబద్దానికే జయంరా భాయ్, మార్కెట్‌కెళ్తే ఏం చెప్పిందీ జ్ఞప్తికి వుండదు. ఒక్క పుస్తకాలు, స్నేహితులు తప్ప ప్రపంచం లేదనుకుంటే ఎలా నెగ్గుకొస్తావ్? అయినా అన్నిచోట్లా యిలా నీస్వంత అభిప్రాయాల్ని అందరి నెత్తినా రుద్దమాక? కానీ నిన్ను ఆ ఆఫీసు ఎలా భరిస్తుందో తెలీటం లేదురా భగవాన్!"

"నీ విమర్శనా మెచ్చుకో తగ్గదే దివాకరం! నీవు నవ్వినా? నేను నవ్వినా ఇంకెవ్వరు నవ్వినా లోకంఅంతా వగులబడి విఱుగపడి నవ్వినా ఏంలాభం? తర్వాత మనమంతా విచారించాల్సి వస్తుందేమోనని నాభయం; నాచింతనూ, అతను చెప్పేదాన్లో ఆలోచిస్తే నిజం అగపడటం లేదూ?

గంభీరంగా ముఖంపెట్టి అన్నాడు.

"విజ్ఞం అల్లా వదలి నాకు ఒక్క ముక్క అయినా అర్థం అయి చస్తేనా!"

ఎవరూ దానికి సమాధానం యివ్వలేదు.

రమణ ఎటో చూస్తూ ఆలోచిస్తూ వున్నాడు.

దివాకరం కాఫీ కప్పుని గుండ్రంగా కదుపుతూ దృష్టంతా అక్కడే కేంద్రీకరించాడు.

గాస్లో నేపచెట్లు ఊగుతూ ఊగుతూ అందించే తీయటి వాసనని అనుభవిస్తూ మత్తుగా కూర్చున్నాడు ప్రసాద్. మొన్నే సంవత్సరాదికి వేపపచ్చడికి పూతని సిద్ధం చేస్తున్నానని చెపుతోన్నట్లుంది దాని గుబాళింపు!

హఠాత్తుగా 'వస్తా!' అంటూ లేచాడు దివాకరం

తను వెంటనే 'నేనూ వెళతానని' లేచాడు రమణ.

'మంచి' దన్నట్లు తలవూపాడు ప్రసాద్.

ఆ చిన్న వివాదం ఏదో తెలీని గాంభీర్యతని నిశ్శబ్దాన్నీ ప్రవేశ పెట్టింది వారిమధ్య!

ఒకర్ని ఒకరు చూసుకుంటూ విడిపోయారు.

ఏకట్లు చిక్కగా అల్లుకుంటున్నాయ్!

అలాగే చీకట్లోకి చూస్తూ కూర్చున్నాడు. ప్రసాద్ ఎనిమిది గంటలు దాటే వరకూ.

ఆకాశం నిర్మలంగా వుంది. తలలో మల్లెపూలను ధరించు కున్నట్టుగ చంద్రోదయం అయింది. పైట చెరుగుపై రత్నాలను కుట్టుకున్నట్టుగ చుక్కలుతళతళ లాడుతున్నాయ్. గగన సీమంతినీ శిరోభాగంలో! పరమ సౌందర్యవతి యైన స్త్రీ నడుస్తోంటే సౌందర్యమే కదలాడినట్లున్నట్లు పిడుద్భాసిమిసి కదలి నపుడు చుక్కలు కదలినట్టుగ నక్షత్రరాణులు వయ్యా రాలు వొలకబోస్తూ కదలిపోతున్నాయ్. చల్లగ గాలి వీస్తున్నది.

వసంతోదయ వేళ వసంతలక్ష్మికి నయగరాల నీరాజనం యిస్తోన్నట్లు ఊగిస లాడుతోంది రసాల వృక్షం! దానిపై అధి నసించిన మత్తకోకిల మంగళ తూర్యనాదాన్ని శ్రవణ మనో హరంగా వినిపించుతూ వున్నది.

కోకిలమ్మ 'కుహూ! కుహూ' నినదం ప్రసాద్ నిశ్శబ్ద తపస్సుకి భంగం కల్గించింది.

అతను చిరాకుగా కుర్చీలో అటూ యిటూ కదిలాడు. అతని మనస్సు ఎంతో వ్యధ ననుభవిస్తోంది!

ఏదో చెప్పటానికి మరచి పోయినట్లుగ చాలా బాధ పడుతున్నాడు. "చెపితే ఎలావుండేది? చెప్పియుంటే ఏమి జరి గేది? చెప్పకపోటమే మంచిదా? అందువల్ల మరేదైనా జరు

సుకొంటాం?" ఏదీ తెల్చుకోలేక సందిగ్ధావస్థలో అతని మనస్సు చాలా చికాకుని అనుభవిస్తోంది!

సైటార్పు వేసి, మెల్లగా మెట్లెంట దిగివెళ్లి తలుపు తీసి హోటలు వేపుగా వెళ్లిపోయాడు భోజనానికి.

ఆకాశంలో ఈశాన్యగా ఓ మబ్బుతునక కనిపించింది! నైరుతివ్యాన వున్న యింకో మేఘమాలిక దానిని చూచి 'తోడువస్తున్నా' నుండమంటూ సాగివచ్చింది.

వాటి ఏకాంతానికి, జంట తనాన్ని కై చేసే యత్నాన్ని చూచి 'చిఱునవ్వులు చిందిస్తున్నాయ్' అన్నట్టుగ వెలుగు రేఖల్ని వెదజల్లుతున్నాయ్ తారకామణులు. ప్రియురాలి చిఱుందిఱ హాసం చూచి ముగ్ధుడైన పతివోలె ప్రియాంగనా నాన్నిధ్యానికి వెడుతున్నాడు రాకాసుధాకరుడు!

* * * * * *

# 4

సుజాతకి ఆరోజంతా చాలా ఆనందంగా గడచింది. ఏవేవో కూనిరాగాలు తీసింది. చిన్నపిల్లలా గంతులైతే వేయ లేదు కానీ అంత ఆనందం ప్రస్ఫుటించేట్టుగ నడయాడింది.

అడవిలో ఆనందంగా పచ్చిక కొఱుకుతో చలాకిగా గంతు వేస్తూ, అడవినంతా చుట్టి రావాలనే కాంక్షతో తిరిగే

లేడిపిల్లలా చలాకీగా తిరిగింది. పిల్లగాలితో సయ్యాటలాడుతూ, సల్లాపాలాడుతూ వూగిసలాడే గడ్డిమొక్కలా వూగిపోయిందాహ్లాదంతో.

మెరపు మెరసిన సమయాన ధగధగలాడి వినీలరోచిస్సుల వెదజల్లే జ్యోత్స్న వినీలాకాశంలా సంతోషపు వెలుగులతో, ఆనందపు మెరపులతో ఆమె మనస్సూ, ముఖమూ కళకళ లాడుతూ వున్నాయ్.

ఏదో అనిర్వచనీయమైన ఆనందం పరవళ్ళుతొక్కుతో వుందామెలో. ఎవరైనా ఎందుకు? అని అడిగితే ఏం జవాబు చెప్పేదో? సర్వసామాన్యంగా ఏమానవుడిలోనైనా తనలోని వైశిష్ట్యానికి కాస్త మెప్పుదల పొందితే కలిగే భావసంచలనమే కనిపించామెలో.

*సాయంకాలం ఆరింటికే చక్కగాదువ్వుకుని, శుభ్రంగా ముఖం కడుక్కుని, మధ్యాహ్నం ఉతికి ఆరవేసుకున్న తెల్లని చీర – ఆమె నిర్మలాత్మకు సైదోడుగ – కట్టుకుని, దానిపై గగన యానం చేసే కారుమబ్బులాంటి నల్లని రవిక – ఆమె సాంద్ర సుదీర్ఘ కేశరాశికి సరిసామ్యంగా – వేసుకుంది. బంగారంలాంటి ఆమె దేహచ్ఛాయకి ఈ రెంటూ చక్కగా వొద్దిగి పుత్తడి బొమ్మకి అలంకారం చేసినట్టువుంది.

ఏనాడూ కనిపించని ఆనందం, లాలసత్వం, చలాకీతనం ఆమెలో ద్యోతకమయ్యేసరికి పక్కయిళ్ళల్లో కాస్తదుమారమే రేగింది. 'ఏమిటా' సంగతంటూ?

పైగా -

ఆమె వెనకటి రాత్రి 'లీలగా' గానం చేసిన పైకి ఎరిగున్నారామె. ఏదో తమ కందరికీ దొరకని వెన్నది ఆమెకి దొరికినట్లుగ భావించుకుని అసూయతో మాడిపోయారు. సహజంగా మూర్ఖించిన వారి నమస్త్రత్వం పై ఆ భావం చక్కగ అతికించింది.

ఈర్ష్యాళువైన ఈ సంఘంలో సహజస్థితిని దాటిన ఏ సంఘటన అయినా తప్పకుండా ద్వేషభావానికి నారుపోస్తుంది. వారిలోని జుగుప్స నీరు పోస్తుంది. ఆ మొక్క ఒక్కోసారి పెరిగి పెద్దదై ఎంతైనా కీడు కల్గించవచ్చు. లేదా ఆవ్యక్తి నిజాయితీ అనే ఆ 'తేపటి' ఎండ ఆ మొక్కని సమూలంగా నాశనం చేసి పలువురిలో ప్రశంసల నందజేస్తుంది.

బరి తెగించిన పడచు - పక్కింటి కమలఅడగనే అడి గింది "ఏం సుజీ! బండి కాస్త జోరుగా సాగుతోందా దే!"

ఆ 'కమల'కి సుమారు ముప్పదియేళ్లు దరిదాపురికి వచ్చి వుండొచ్చు! అయినా ఆ వయస్సుకే అతిభోగాల వల్ల - అతిరతి భోగాలవల్ల ఆమె యవ్వనమంతా ప్రాతఃకాలపు వేసవి ఎండకి - కరిగిపోయిన నవనీతంరా క్షీణించి మధ్యాహ్నానికే వాడిన మల్లెపూవులా వుందామె బ్రతుకు.

ఐనా 'వృత్తి' నేర్పిన విద్యవల్ల, అలవాటుపడిన గుణం వల్ల పావడా కట్టుకుని, చిన్నపైట వేసుకుందామె. ఆ నల్లని

పావడా ఆమెలోని మాలిన్యాన్ని తెలియజేస్తోవుంది. ఆపావడ చాలీచాలక ఆమె శరీరాన్ని దాచలేక తబ్బిబ్బవుతూ తెల్ల బోతూ రంగు వెలిసినట్లు కనిపిస్తూవుంది. వేసుకున్న బిగుతు రవిక ఆమె యవ్వనాన్ని కొలువలేకపోతూవుంది. ఎఱ్ఱటి రవిక ఆమె మనో కాఠిన్యాన్ని తెలియజేస్తోవుంది. ఆకుపచ్చ రంగు ఘాటన్ శిల్కుపైట చెమట నిండుకున కాస్త రంగుమార్చుకుని క్షణాక్షణానికీ జారిపోతూవుంది, ఆపైట ఆమె వృత్తికీ, ఆమె రంగులు మార్చే గుణానికీ, ఆజారిపోవటం ఆమెయవ్వన క్షీణ తకి తార్కాణంగావుంది. చేతకాని చిత్రకారుడు గీచిన చిత్రం లాగా, అశక్తుడైన రచయిత వర్ణనలా, వుందామె అలంకరణ. అచ్చం ఆ'జాతి' బ్రతుక్కి, జీవితానికి ప్రతిబింబం ఆమె! ప్రతినిధి ఆమె!

ముఖంపై ఏర్పడిన మొటిమల్ని, ముడతల్ని అంతగా దాచలేక, కప్పిపుచ్చలేక వెలావెలా బోతోంది వేసుకున్న పౌడరు, స్నో పేస్టు. రంగరించిన తాంబూలం రంగు పెదాలకి మాటిమాటికీ అద్దుకుంటూన్నా సంసార స్త్రీలకి సహజ సౌందర్యంగా వెలుగొందే తాంబూల రాగచ్ఛాయ ఆమె ముఖానికి అర్ధహీనఅలంకరణలా అసహ్యాన్నే కలిగిస్తోంది. అవును మరి! లిప్‌స్టిక్ వుండాల్సిన చోట తానెట్లా వెలుగుతుందది!

పరికించి చూస్తోన్న సుజాతకి కమల అలంకరణ అసహ్యాన్నే కలుగజేసింది. ఐనా ఒకనాడు కమలకూడా సౌందర్య రాశే నేమో? సౌదామనీ రేఖలా నిల్చున్న సుజాతసోయగం ఈర్ష్య పుట్టించింది కమలలో!

—

కాస్త పరిచయాన్ని ఆధారం చేసుకుని మళ్లీ వేసిందదే ప్రశ్నని.

'ఏమీ లేదమ్మా! ఏదో మనస్సు. కాస్త హాయిగా వున్నట్టుంది వాళ'' అంతకు మించి మరేమీ లేదనే భావం వ్యక్తమయ్యేట్టుగ సాధ్యమైనంత త్వరగ సంభాషణ ముగియాలని క్లుప్తంగా అంది.

"అంతేనా! ఇంకా ఏదేదో విశేషం వుందనుకున్నాన్లే!

అయితే లేదన్న మాటేగా!''అని మూతి మున్నాటూరు వంకర్లు తిప్పుతూ వెళ్ళింది కాస్త కుంటుతూ!

రోజూ మూసివుండే వాకిలి తెరిచి వుంది—

ఎన్నడూ వ్యక్తి ఛాయ లైనా కనిపించనిది మిగతా వారికంటే విశిష్టంగా అలంకరించుకుని వాకిట నిలబడి వుండటం—

ఈ రెండూ—

ఆ వృత్తికి అలవాటుపడిన 'అంగా' జనానికి కొంచెం చెడు బుద్ధిని పెంచి, మరికొంచెం చొరవని కలుగజేశాయ్. సహజమైన వాలుచూపుల్ని విశిరారు ఆ చొరవనాధారంగా!

ఇంకా అల్లాగే అక్కడే వుంటే మరేం ప్రమాదం ముంచుకొస్తుందోనని భయపడుతూ వాకిలి వేసుకుని వెళ్లింది లోపలికి!

పోలీసు స్టేషన్లో తొమ్మిది గంటలు కొట్టేరు- "అబ్బా! ఇంకెంత సేపో ఈ నిరీక్షణ!" నిట్టూర్చుతూ అనుకుంది.

మంచం చక్కగ దులపబడి దానిమీద తెల్లటి చీర అంచులు కనిపించకుండా పరువబడి వుంది. తలవేపున తలగడ చీర క్రిందుగ పెట్టింది- అది తన ఉనికిని తెలయజేస్తూనే వుంది. మాసిన దుప్పటి ఎంత ఉదికినా తెలుపుకాక అక్కడక్కడా రోగి చిరునవ్వులా - దుర్జనుని సహాయంలా- తెల్లబడి ఓ విధమైన అసహ్యాన్నే కలుగ జేస్తున్నది. అయినా వున్నంత మటుక్కి శుభ్రంగా, ఆహ్లాదకరంగా శోభాయమానంగా వుంది. దీపం కూడా శుభ్రం చేయబడి తెల్లని కాంతుల్ని విరజిమ్ముతోంది. దానికి కూడా ఆనందంగా వుందేమో వెలుగు రేఖల్ని విసరి విసరి వేస్తోంది!

ప్రవాహంలా వస్తూవున్న ఆలోచనల్ని అపుకుంటూ కొంచెం మేను వాల్చాలనిపించటంతో మంచం మీద పడుకోబోయింది. మనస్సులో ఏదో ఉహ మెదలటంతో మానుకుని క్రింద మరోచీర పఱచుకుని పడుకుంది.

కానీ నిర్దాక్షిణ్యమైన లోకం వలెనే, కఠినాత్ముని కరుణ వలెనే నిద్రామతల్లి కూడా ఆమెపై దయచూపలేక పోయింది. ఆలోచిస్తూ గడపడంకంటే ఆమె చేయగలిగిందీ చేయవలసింది ఏమీలేక పోయింది.

అర్థం లేకుండా ఆకాశం వేపు చూస్తూ కాలం గడిపితే

ఆగకుండా కాలం వెళ్ళినట్టు ఆమెక్కూడా కాలం సాగిపోతూ వుంది. మనోవీధిలో మనస్సుని ప్రతిబింబించుకుంటూ వుంటే! ఈ లోకంలో గమనించినా గమనించకున్నా సాగిపోయే సంఘటనల్లో కాలం గడవటం ఒకటే!

మెల్లగా తలుపు త్రోయటం విని ఉలికిపాటు చెంది చీర సర్దుకుని పైట నిండుగ కప్పుకుని లేచి నిలబడింది. కాస్త తటపటాయించి ప్రవేశించాడు ప్రసాద్.

"రండి!"

చిరునవ్వుతో (పలుకరించింది), పిలిచింది!

"ఇంతదూరం వచ్చాక, పొమ్మని నెట్టినా పోలేను సుజాతా"

నిండుగా సు-జాతా అనటం ఆమెకి ఎంతో హాయిని చేకూర్చింది.

మంచంమీద కూర్చుంటూ, 'ఈ రోజు ఎలా గడపటం' అన్నాడు చిరునవ్వుతో. ఆమె ఇంకా నిలబడి వుండటం గమనించి 'కూర్చో సుజాతా' అన్నాడు.

ఒక్క రోజుకే 'మగవాళ్ళింత చనువు తీసుకుంటారా?' అని ఆశ్చర్యపోతూ క్రింద కూర్చోబోయింది.

"ప్లీజ్! నా కండీషన్ మరచి పోయినట్లుంది. మళ్ళీ

మళ్ళీ చెప్పలేను. అదినాకు చాలా బాధ కల్గిస్తుంది ఇక్కడే కూర్చో."

కంఠస్వరంలో ఇందాక లేని గాంభీర్యం గమనించి చలించి పోయింది.

ఓ చివర కూర్చుంటూ "మీరే చెప్పండి ఎలా గడుపుదామో" అంది. ఆమె కంఠస్వరంలో అప్పుడే మాధుర్యం పరవళ్లు తొక్కుతూ వుంది. దాచాలన్నా దాగని నిధి అది.

ఆ మాధురీ స్రవంతికి, ఆ ముగ్ధత్వ ప్రతిపాలనకే మురిసి ముగ్ధుడౌతూ, 'ఓ పాట పాడు సుజీ!' అన్నాడు.

వెంటనే నాలిక కొరుక్కుని "క్షమించండి. చాలా చనువు తీసుకుంటున్నాను" అన్నాడు.

"పోనీలెండి! నేను చెప్పకుండానే గ్రహించుకో గల్గుతున్నారు. సంతోషం" అంది మెల్లిగా నవ్వుతూ.

ఏం జవాబు చెప్పగలడతడు? ఎవరైతే మాత్రం?

'పాట పాడమన్నారు? ఏం పాడను? కీర్తనలా? అన్నమయ్యనా? పురంధర దాసునా? త్యాగరాజనా? సినిమా పాటలా? ఏం పాట?'

"రికార్డుల సంగీతం వినీవినీ విసుగెత్తింది. సినిమా పాటలెందుకు? కీర్తనలే పాడండి ఎవరివైనా? చక్కని కీర్తన పాడు సుజాతా!"

ప్రతిపర్యాయం 'సుజాతా' అనటానికి కారణం మరి వేరు మార్గం లేక పోవటమే కావచ్చు ననుకుంది.

మెల్లిగా—

చాలా లో గొంతుకలో—

"నన్ను పాలింప నడచి వచ్చితివా నా ప్రాణనాథా!" 'ప్రాణనాథా! అనేప్పుడామె గొంతుక కొద్దిగా చలించింది. ఆ చలనం కూడా రాగచ్ఛాయకి అందాన్నిచ్చింది.

ఆమె గొంతుకలో వేయికిన్నెరలు మాధుర్యం తొణికిసలాడుతూ వుంది. కోకిల కొసరి కొసరి కవ్వించే రీతి, అందులోని మాధుర్యమూ, సౌకుమార్యమూ, ముద్దకట్టుకున్నాయ్. ఆ రాగాలాపనలో దివ్య గంధర్వులు ప్రాణం పోసుకున్నారు. వియచ్చరల పదనూపుర నిస్వనంలా శ్రవణ మనోజ్ఞంగా వుంది ఆ గాన మాధురి. వీణానిక్వణాలూ, వాయులీన ధ్వనులూ, మృదంగ నిస్వనాలూ, సితార్ గలగలలూ వీటిసాయం ఏమీ లేకుండానే గంధర్వలోకాన్ని సృష్టిస్తోకది. ఆ విమల గాంధర్వంలోని మూర్ఛనలు పోతున్నాడు ప్రసాద్.

తానేదో లోకంలో తేలిపోతున్నట్లు, ఈ లోకాన్ని వీడి పోతున్నట్లు కేవలం రసానందమే ఆహారంగా గల మరో లోకంలో విహరిస్తోన్నట్లు భావిస్తూ ఆ భావనలో తనను తాను మరచిపోయి నిద్రాలోకంలోకి సాగిపోయాడు.

పాట పూర్తయ్యాక చూచిన సుజాతకి అతను నిద్ర

పోతూ వుండటం కనిపించింది. ఆమెకి ఎన్నడూ కల్గని ఆనందం కలిగింది.

తనూ ఓ మూల కొంగు పరచుకుని పడుకుంది. అర గంట వరకూ నిద్రపట్టలేదు. తర్వాత ఎప్పుడు నిద్దుర పోయిందీ తెలీలేదు.

కచేరీలో పన్నెండు గంటలు కొట్టారు. త్రుళ్ళి పడి లేచింది. 'ఇక తనకి నాల్గు గంటలే నిదుర' అనుకుంది. బయటికి వెళ్ళి చందమామని చూద్దామనిపించింది. తనను జూచి ప్రక్కవాళ్ళే కాక నీలాకాశం కూడా పరిహసిస్తుందేమోనని భయపడి అలాగే నేలకి కరచుకుని పడుకుంది.

ప్రకృతంతా నిశ్శబ్దంగా వుంది.

సకల భువనాలనీ రక్షించి, కాపలా కాసేవాళ్లు ఎవరూ లేరని అష్టదిక్కులూ, గగనకాంతా శ్రద్ధ తీసుకున్నట్టు అన్నీ మేలుకుంటున్నాయ్. ఆమె వళ్లు విరుచుకుంటూ వుంటే తాల్చిన చేరపై వున్న ముత్యాలు కదిలినట్లు తారకామణులు మిలమిలా, ధగధగా, తళతళా, మంటున్నాయ్.

మనలని చూచేవాళ్లు తక్కువ కదా అని దుఃఖపడి ఓ కన్నీటి బొట్టు వదిలితే ఆ కన్నీటి చుక్కే చంద్రాతపంలో నక్షత్రంలా వెలుగుతోందా అన్నట్లు వున్నాయ్ నక్షత్రాలు.

చూచేవారు లేరనే చింత అధికంగా వున్నట్టు కోప

గించుకుని వెళ్ళిపోయే వాసన సజ్జకలా శృంగారాన్నంతా తీసి వేస్తున్నది ప్రకృతి.

'అలిగిన వేళనే చూడాలి అతివ అందం' అన్నట్టు నియ ద్యామిని సింగారమంతా యిప్పుడే తెలుస్తున్నది.

కోడికూతతో_

ఎవరో చెవి దగ్గరగా వచ్చి పిలిచినట్టు మెళుకువైంది సుజాతకి. చీర సవరించుకుని 'ఆవలిస్తూ' లేచి నిలుచుంది. తలుపు తీసుకుని బయటికి వెళ్ళింది. వేగుచుక్క బాగా ప్రకాశ వంతంగా వెల్గుతోంది. అలతి అలతి కాంతులతో శుక్రతార మిల మిల లాడుతోంది. ఆ ప్రశాంతతకీ గాంభీర్యానికీ భయమేసి ఓ నమస్కారం చేసి ఇంట్లోకి వచ్చేసింది.

"ప్రసాద్ గారూ! ప్రసాద్ గారూ!"

ఆమె పిలుపుకి ఉలిక్కి పడ్డట్టు లేచి వాచి చూచుకుని "అప్పుడే నాల్గు అయిందే! నీవు నిద్దురే పోలేదా సుజాతా?" అన్నాడు.

'ఇప్పుడే మెళుకువైందండీ' అంది నెమ్మదిగా

"సరే! ఇక నేను వస్తాను జాగ్రత్తగా తలుపేసుకో!" అని వెళ్ళిపోయాడు.

తలుపేసి లోపలికొచ్చిన సుజాతకి నవ్వొచ్చింది. 'ఈ నాటికైనా, ఒకరు నా జాగ్రత్తపై జాగ్రత్త తీసుకుంటున్నారు.

కదా!' అని. హఠాత్తుగా భయపడింది. 'తనేదైనా చేయరాని పని చేస్తున్నానా' అని.

'అయినా అన్నీ భగవంతుని యిచ్ఛమేరకు జర్గేగేద ప్పుడు తనదంటూ ఏముంది?' అనుకుంది. మెల్లగా చల్లగాలి వీస్తూండటంతో సవతి తల్లి దయలాగా నిద్ర ముంచు కొచ్చింది!

*        *        *        *        *        *

# 5

'రమణా! ఒరేయ్ రమణా!'

బయటినుంచి పిలుస్తున్నారెవరో!

వంటింట్లో వున్న విజయ తలుపుతీసి తొంగిచూచింది.

బయట రాజా!

చిరునవ్వుతో—

'రండి' అంది

"అన్నయ్యా లేడాండీ!" అన్నాడు కావాలసినంత విన యాన్ని కంఠస్వరంలో ధ్వనింపజేస్తూ!

'ఉన్నాడండీ! స్నానం చేస్తోన్నాడు. అంత వరకూ మీరట. కూర్చోండి'

మర్యాదకి మారుపేరులా వుంది విజయ ప్రవర్తన.

లోపలికి వచ్చి, అక్కడేవున్న కుర్చీలో కూర్చున్నాడు. చూడక పోవటంతో క్రిందనున్న పుస్తకం తగిలింది నుంచుని చేతిని తీసుకుని చూచాడు.

రమణ చదువుతోన్న నవల!
పేజీలు త్రిప్పాడు!

అక్కడక్కడా సన్నగా లైట్‌గ పెట్టిన పెన్సిల్ గుర్తులు కనిపించాయ్!

రమణ లైబ్రరీ పుస్తకాలు తెచ్చి చదువుతూ అక్కడక్కడా చక్కగా వున్న అభిప్రాయాల్ని వర్ణనల్ని, చెప్పే విధానాన్ని 'అధోరేఖాంకితాల్ని' చేస్తాడు. నవల పూర్తయ్యాక అన్నీ కాక చాలా బావున్న వాటిని ఎత్తి వ్రాసుకుంటాడు. తర్వాత ఆ క్రీగీతల్ని శుభ్రంగా రబ్బర్‌తో తుడిచి వేస్తాడు.

మనస్సుని కదిలించే రచన అయితే చదివేప్పుడే విమర్శ వ్రాస్తాడు. "నిజంగా విమర్శ అనేది పఠిత రచనలో నిమగ్నుడయ్యే వ్రాయాలంటాను" రమణ అభిప్రాయంతో వాళ్ళు ముగ్గురూ ఏకీభవిస్తారు. అతన్లోని ఈ గుణానికి అందరూ ముగ్ధులవుతారు.

లుంగీ చుట్టుకుని - తువ్వాలుతో ఒళ్ళు తుడుచుకుంటూ వచ్చాడు రమణ.

తలెత్తి చూచి అన్నాడు రాజా.

"అయిందా ఇంకా ఆలస్యమా?"

"ఒక్క క్షణం!"

రెండు నిమిషాల్లో గుడ్డలు వేసుకుని. చక్కగా తల దువ్వుకుని, చెప్పులు వేసుకుంటూ 'పద' అన్నాడు.

"బావున్నట్టుందే?"

కుర్చీలోంచి లేస్తూ అన్నాడు రాజా

"మరేమిటనుకున్నావ్? మనం చదివే నవలంటే అది ఎంతో బ్రహ్మాండమైనదై యుండాలి! ముఖ్యంగా మన పెన్సిల్ గుర్తులు పడాలంటే వారీను!" 'మన' అనే పదాన్ని ఒత్తి పలుకుతూ అన్నాడు.

"చాల్లేవోయ్! నీ డాబు! తర్వాత ఇస్తావా?"

"ఓ యస్! మన సొమ్మేం పోతుంది. పోయినా లైబ్రరీది కానీ. ఐనా నీకు యగ్జామ్స్ దగ్గర కొచ్చాయల్లే వుంది. అదే నా వ్యథ"

"అదేం లేదులే! బాగుంటే ఓ రోజులో చదివేస్తాను. అంత మాత్రాన నా చదువేం పాడవదు. ఒక వేళ పాడైనా ఒక్క రోజు చదువనంత మాత్రాన పాడయిపోయే చదువు పాడు కావటమే మంచిది. 'తుమ్మితే ఊడిపోయే ముక్కు ఎంత కాలమని వుంటుంది?' అంచేత ఓ మిత్రమా! మనకేట్టే దిగుల్లేదు నీవనే ఆ పరీక్షల గురించి."

డ్రమెటిక్‌గా అన్నాడు రాజా!

రమణ పగలబడి నవ్వుతూ —

"ఓరీ నీ అసాధ్యం గూల! ఎవరైనా వింటే నవ్వుతారు. మీ వాళ్లు చెవికెక్కిందంటే చదువుకి గుడ్‌బై! ఏతత్ సినిమాలు, నవలలు!"

"ఇక చాల్లే నీ ఉపన్యాసం పద" అన్నాడు రాజా!

'విజయా తలుపేసుకోమ్మా' వాకిలి దగ్గరగా లాగుతూ అన్నాడు రమణ

ఆరోజు ఆదివారం!

అందరికీ హాయి! ప్రతి ఆదివారం కొన్ని గంటలు తప్పని సరిగా రమణ తనతో తిరగాలని రాజా ఉబలాటం! ప్రతి ఆదివారం ఆరునూరైనా నూరు ఆరైనా రాజా-రమణలు బలాదూర్ తిరగాల్సిందే!

అది పబ్లిక్ పార్కు గానీ, పైరుపచ్చ గానీ ఎక్కడైనా సరే వాళ్ళిద్దరూ ఏకాంతంగా తిరిగి రావాలి! మరెవ్వరు తోడున్నా రాజా మాట్లాడడు. మాట్లాడలేడు!

మిత్రులిద్దలూ ఊరిమీదికి పడ్డారు

ప్రాతః కాలం ఇంకాసరిగా దాటకముందే ఎండ చంద్ర నిప్పులు చెరుగుతోంది. వేసవి బాగా విజృంభించుతోంది పగలంతా ఎండలు! ఇంట్లో ఉంటే ఉక్కటి! బయటయితే ఎండలు. భరించరాని విధంగా వుంది. ఇక చీకటి పడితే ఇళ్ళ

నిండా, వీధులనిండా దోమలు! ఏనుగు తుండాల్లాగా తుండాల్తో కఱచి చంపేస్తాయ్ మనుష్యుల్ని! నరకమంటే ఎక్కడుంది అని అడిగే వారికి మాగాణి పొలిమేరలు దాటాని ఊర్లో అనే జవాబు!

ఆదివారం అవటం మూలాన బస్సుల్లు ఆఫీసుకెళ్లే వాళ్ళ రద్దీ లేదు! 'ఆఫీసరుడి' "అనుగ్రహానికి" పాత్రులైన పెద్ద మనుషులు మంత్రం తిట్టుకుంటూనే ఆదివారంకూడా ఆఫీసు కెళుతున్నారు. మ్యాటినీకి వెళ్లేవాళ్లు నడిచే వెడుతున్నారు సిటీ బస్సులో కూర్చుని ఆనందం అనుభవించేంత ఎత్తుకి ఎదుగ లేదా జనం ఇంకా!

డ్రైవర్లు ఎండ వేడిమికి నిట్టూరుస్తూ నిప్పులు కక్కే యింజన్లతో కుస్తీపట్టూ చెమటలు కార్చుకుంటూ రక్తా నమ్ముకుంటూ వున్నారు జీవన భృతికై.

రమణ వెళ్లాక ఓ గంట గడిచాక దివాకరం, ప్రసాద్ వచ్చారు. వీధి తలుపు వేసివుంది.

ప్రసాద్ రమణ స్నేహానికి వయస్సు వచ్చి నా ప్రసాద్ రమణ యింటికి రావటం మాత్రం అదే ప్రథమం!

తనకథ చెప్పాలని నిశ్చయించుకుని వచ్చాడు ప్రసాద్. ఆప్తమిత్రులు, అంతా వివరించి సలహా తీసుకుని తన కార్యాచరణకి నాందీ వాక్యం పలుకుదా మనుకున్నాడు. మిత్రులు ముగ్గురూ వుండాలని ప్రసాద్ కోసం వచ్చారు కృష్ణమూర్తి, ప్రసాద్.

తలుపు తట్టారు.

'ఎవరూ' అంటూ తలుపు ఓరగా తెరిచింది విజయ.

భోజనం చేస్తూ చేస్తూ లేచి రావటంవల్ల కుడిచెయ్యి వెనక్కి పెట్టుకుని ఎడమ చేయి వాకిలికానించి తొంగి చూసింది. వేడి వేడి అన్నంతింటూ రావటంవల్ల ముఖం నిండా చెమట పోసింది. చెమటకి ఫాలభాగంలో అతుక్కుపోయిన ముంగురులు చెమట గాలి తగలి ఆరీ ఆరకుండా వుండటంవల్ల మెల్లి మెల్లిగా కదలటానికి ప్రయత్నిస్తున్నాయ్.

దివాకరం అతనివెంట మరో నూతన వ్యక్తి వుండటం చూచి, కాస్త వెనక్కి తగ్గి—

'అన్నయ్య లేడండీ! బయటికి వెళ్ళాడు' అంది.

"వచ్చి వెళ్ళామని చెప్పమ్మా! దివాకరం ప్రసాద్ వచ్చారని చెప్పమ్మా. ఇంటికి తిరిగి వస్తూనే ప్రసాద్ ఇంటికి వచ్చేయ్‌మని చెప్పమ్మా" అన్నాడు దివాకరం.

'అలాగే నండీ' అంది.

ఇద్దరూ తిరుమ్ముఖులయ్యారు.

వాళ్లు వెళ్లినవేపే చూస్తూ అతని పేరు 'ప్రసాద్' కాబోలు అనుకుంది.

వీధి మలుపు తిరికాక,

"ఎవర్రా ఆ అమ్మాయ్ రమణ చెల్లెలా?" అన్నాడు ప్రసాద్.

"అవునురా! విజయ అని రమణ చెల్లాయి. చాలా చలాకయిన పిల్లలే! అతి చురుకైన అమ్మాయి కూడా! అన్న కంటె మరికాస్త ఆసక్తి ఎక్కువ అన్నిట్లో! సాహిత్యమంటె ప్రాణం పెడుతుంది. చాలా వేగంగా చదివేస్తుంది దేన్నైనా! అర్థం చేసుకుని విమర్శించటంలో అన్నయ్యకంటే ఓ ఆకు ఎక్కువే చదివింది. మనవాడేదైనా వ్రాస్తే ఫెయిర్ చేసేది ఆవిడ!''

''ఓహో!'' అన్నాడు ప్రసాద్

* * * * * *

సుమారు ఒంటిగంట కావస్తోంది.

వైశాఖ మాసం మార్తాండుడు మండిపడుతోన్నాడు. అగ్నిశిఖలా వెలిగి పోతున్నాడు. అగ్నిజ్వాలలు వెలాగ్రుతున్నాడు అగ్ని వర్షం కురిపిస్తోన్నాడు.

పార్కులో కానుగ చెట్ల నీడలో కూర్చున్న రాజాకీ రమణికి ఆ వేడి సెగలూ ఏమీ సోకటం లేదు. మాతృచ్ఛాయలో చల్లదనంలా కానుగ నీడలు సుఖాన్ని అనుభవిస్తున్నారు.

కాని వారి మనసులు మాత్రం వేడివేడి అగ్ని జ్వాలలు రగులు కుంటున్నాయ్. ఆ వేడికి ముఖాలు కాస్త వాడి వున్నాయ్!

ఇద్దరికీ ఆలోచనా వ్యగ్రతలో కాలం కనిపించటం లేదు. తీవ్రంగా ఆలోచించటంతో ముఖాలు చెమటపట్టి వున్నాయ్. భోజనానికి ప్రొద్దు పోవటంతో ముఖాలు మరీ వాడి పోతు న్నాయ్.

రమణ ముఖంలో ఏదో వ్యగ్రమైన ఆలోచన. రాజా ముఖంలో ఏదో తీవ్రమైన ఆవేశమూ కనిపిస్తున్నాయ్.

'నేనీ పెళ్ళి చేసుకోకుండా బ్రతక లేనురా!' హఠాత్తుగా అన్నాడు రాజా.

"ఏ నిర్ణయానికైనా సమ్యక దృష్టితోడి విచారణ అవసరంరా బాబూ! ఊరకే అలా ఆవేశపడి తొందరపడితే ప్రయోజనం ఏం వుంది? నీ అంగీకారం కంటే, నిర్ణయం కంటే నీ తలిదండ్రుల అంగీకారం ముఖ్యం. నీవు కోర్తున్నావు సరే! నేనూ అంగీకరిస్తాను. అయితే నీవు యింకా నీ కాళ్ళమీద నిలిచేటంత యోగ్యత సంపాదించలేదు. నీవు వాళ్ళని కాదని వివాహం చేసుకున్నా నిన్ను నీవు పోషించుకుంటూ ఆమెని పోషించగలిగే యోగ్యత వుండాలి! అలా లేనప్పుడు ఆవేశ పడటం అవివేకం! తొందరపడి నిర్ణయాలకి రావటం మరీ అవి వేకం! ఏదో నీవు ఆ శాస్త్రా డిగ్రీ తీసుకుంటే తర్వాత ఆలోచించ వలసిన మాటలివన్నీ!" అన్నాడు రమణ.

'అంతేనంటావా?'

"కాక మరి యిదేం అంత తేలిక సమస్య అనుకున్నావా? నీ జీవితానికే సంబంధించినది. జీవితాంతం వుండేది. కాఫీ

త్రాగటం వదులుకుని మళ్ళీ మూన్నాళ్ళు పోయాక తాగాలని పిస్తున్నదోయ్! అనటం కాదు! ఇంత తీవ్రంగా చర్చించుకుని త్వరత్వరగ రావలసిన నిర్ణయాలు కావివి ఇంకా తొమ్మిది మాసాలుంది, నీ చదువు ముగియటానికి. కావలసినంత తీరిగ్గా ఆలోచించుకుని నీ నిర్ణయాల్ని మలచుకో! ఊహాల్ని పరీక్షించుకో! ఆవేశానికి కాక బాధ్యతకి కట్టుబడి వుండగల్గినట్లైతే తర్వాత ఆలోచిద్దాంలే!" అన్నాడు రమణ!

రాజా ముఖం మ్లానంగా తయారైంది!

ఆవేశ పరులకి ఆలోచనాశక్తి తక్కువ!

ఏదో తోచిన వూహని వెంటనే ఆచరణలో వుంచాలనే ఆరాటమే కాని వాని ఫలితం ఎలా వుంటుందా అనే దృష్టి వుండదు. తీసుకున్న నిర్ణయాన్ని ఎవరైనా కాదన్నా దానికేమైనా అడ్డంకి తగిలినా చెప్పరానంత బాధ పడతారు. అది సహజం! ఆ బాధ అయినా అది తాత్కాలికమే!

మెల్లిగా లేచి, కాళ్ళీడ్చుకుంటూ బయల్దేరారు. నాలుగు రోడ్ల వద్ద గడియారం రెండు గంటలకి దగ్గరగా చూపిస్తోంది కాలాన్ని!

విడిపోతూ కూడా హెచ్చరించాడు రమణ.

"తొందర పడకు రాజా!"

* * * * * *

ఇంటికొచ్చే సరికి విజయ కుర్చీలో కూర్చుని తనకోసం ఎదురు చూస్తోంది. వేసవి కాలం అందునా భోజనానంతరం

కుర్చీలు పడక! వద్దనుకున్నా నిద్దుర అలా అలా తొంగి తొంగి చూస్తూనే వుంటుంది వచ్చే నిదురని ఆపుకుంటూ ఎన్నాడనే అన్నయ్య కోసం ఎదురు చూస్తూ కనురెప్పల్ని బరువుగా మూస్తూ తెరుస్తూ వుంటే నల్లకలువపూలు అలా అలా గాలికి వూగిసలాడుతూ వున్నట్టుంది!

సుభద్రమ్మగారు చాప పరుచుకుని చెయ్యి తలగడగా పెట్టుకుని పడుకుంది! ప్రక్కన్నే కళ్ళద్దాలూ, తిరగవేసి తెరిచి మూసిన భగవద్గీతా కనిపిస్తోన్నాయ్! జీవితం మలుపు తిరికాక వేదమార్గ నిష్టమైన భారతదేశంలో మానవుడికి ఆధ్యాత్మిక చింతన వైపే దృష్టి!

మెల్లిగా తల్లికి నిద్రాభంగం కాకుండా వచ్చాడింట్లోకి!

కాళ్లు కడుక్కుని వంటింట్లోకి వెళ్లేసరికి పీటవేసి అన్నం వడ్డించింది విజయ.

చేతిలో నీళ్లు వంచుకుని అపుపోసనం పడుతూ చెల్లెలి వేపు చూచాడు.

మాగాయ కలుపుతూ వుంటే నెయ్యి వడ్డిస్తూ అంది విజయ.

"అన్నయ్యా దివాకరం, ప్రసాద్‌గారు వచ్చి వెళ్ళారు! నిన్ను ప్రసాద్‌గారి యింటికి వెంటనే రమ్మన్నారు. భోజనం అవుతూనే వెళతావా?"

కాస్త అలసిన శరీర భావనతో కొద్దికొద్దిగా విసుగుని జోడించి—

"సరేలే యిప్పుడేం చేతకావటం లేదు. సాయంకాలం చూద్దాం" అన్నాడు.

భోజనంచేస్తూ ఎదురుగ్గా కూర్చున్న విజయ ముఖం లోకి చూచాడు. అన్నయ్య కళ్ళలోకి సూటిగా చూస్తూంటే అర్థంకాక తల తిప్పుకుంది. ఏనాడూ కనిపించనంత విస్పష్టంగా కనబడింది అతనికి చెల్లెలి సౌందర్యం అంత సౌందర్య వంతు రాలు గుణవంతురాలు విజ్ఞరాలు విధేయురాలు తన చెల్లెలు కావటం తన అదృష్టంగా పూర్వజన్మ సుకృతంగా ఏదో పుణ్య విశేషంగా భావించాడు.

భోజనం ముగించుకుని అలాగే మెత్తగా కుర్చీలో పడు కుని ఓ క్షణంలో నిద్రాదేవి వలపు కౌగిలిలోకి జారిపోయాడు.

* * * * * *

# 6

"సుజాతా!"

పార్కు ప్రక్కన ఫుట్‌పాత్ వెంట మౌనంగా తల వంచుకుని నడుస్తూన్న సుజాతకి ఆ మూడక్షరాలూ, వాటి ఉచ్చారణ మూడు పిడుగులు పడ్డట్టూ వాని వెంటనే కర్ణపుట భేధనాదక్షమైన శబ్దత్రయం వినబడ్డట్టూ అనిపించింది.

ఆ పిలుపుకి నవనాడులూ జలదరించగా, ఉలిక్కిపడి వెనుదిరిగి చూచింది.

ఎదురుగా బాబుల్!

వణికిపోయింది!

ఆరడుగుల ఎత్తూ; ఎత్తుకి తగ్గ లావు, కండలు తిరిగిన చేతులూ, చింత నిప్పుల్లా సర్వదా సారాపాన మత్తతతో ఎఱ్ఱబడ్డ కళ్లూ, రేగిన జుత్తూ క్రూరమైన చూపు! బాబుల్ క్రూరంగా నవ్వుతూ ఎదురుగా కనిపిస్తే పసిపిల్లలు జడుసుకుంటారు! భయస్థులు వణికిపోతారు!! పెద్దవారు ప్రైదొలగి నిశ్చబ్దంగా పోతారు!!

మడమలు త్రొక్కుకున్నట్లైంది సుజాతకి!

నిలువలేక నిలువలేక కాలు నిలువ ద్రొక్కుకుని అంది "ఏం"

"ఆహా! నాతో 'ఏంపని' అని అడిగేవరకూ వచ్చిందా కథ? అంతగా మారిపోయావా? ఈ పదిహేను రోజుల్లోనే ఇంత కథానాయకురాలి వయ్యావా? కొన్నాళ్లు పోతే అసలు నేను గుర్తుకి రాక 'ఎవర్నీవు' అని అడిగినా అడుగుతావేమో కదూ? అది సరే పార్కులోకి పద!"

పర్జన్య గర్జన సదృశమైన పలుకులకి బెదరి పోయింది. బాబుల్ తో పార్కుకా? ఇంకేమైనా వుందా?

బయటికి వచ్చేవరకూ తన ప్రాణాలమీద తనకి అధికారం లేదు. నమ్మకమూ వుండదు.

అవును! అనుభవం నేర్పిన పాఠం అది!

"ఎందుకు?" అని ప్రశ్నించబోయి భయమేసి ఆగింది. బాబుల్ దూరమైన రోజుల్లో అతని పేరు తల్చుకుని తల్చుకుంటే గుండెల్లు జలదరింపు బయలుదేరి ఆ రోజంతా నిద్ర పట్టక అల్లాడిపోయిన రోజులున్నాయ్!

ఇక ఆలోచిస్తూ నిలబడితే మరేమైన సంభవించవచ్చనే భయంతో పార్కులోనికి మళ్ళింది.

దూరంగా ఎవ్వరూ లేని స్థలానికి వెళ్ళి గడ్డిలో చదికిల బడుతూ అన్నాడు.

"మరీ నువ్వేం అంత పతివ్రతవు కాదులె నేను కూర్చుంటే నీవు నిలువబడటానికి అలా కూలబడు."
అతని కంఠంలోని కర్కశత్వానికి చెట్లు కదలాడిపోయాయ్! ఆ మాటల్లోని వేడి శరీరాన్ని మాడ్చివేస్తోంది! పార్కులో దీపాలు వెలిగాయ్!

ఉలిక్కిపడింది!

"ఏం భయపడుతున్నావా?" వికటంగా నవ్వుతూ అన్నాడు.

బరువుగా కళ్ళెత్తి చూచి తల దించుకుంది! ఆ కళ్ళల్లో చూడగలిగితే పులిని చూచిన లేడిపిల్ల బెదరే భయం, తల్లిని చంపిన దుష్టమృగంపై అమాయకమైన జంతువుకి వుండే అసహ్యతా అంతా కనపిస్తోంది. కానీ వాటిని చూడగల్గే నేర్పు, చదువు గలిగే కుశాగ్ర బుద్ధీ రెండూ లేవు బాబుల్‌కి.

"ఏం! నేనేదైనా అడిగి భయపెటతాననుకుంటు న్నావా? నువ్వేలా పోయినా నాకక్కర లేదు. కానీ కవుల కళ్ళల్లోనే కారం జల్ల గలిగేంత నేర్పునెలా సంపాదించావా అనే ఆశ్చర్య పడుతున్నాను. ఇంతకీ నీవు పట్టిన ఆ బంగారు పిట్ట ఎవరని?"

అతని కంఠస్వరంలో ప్రతిబింబించే క్రౌర్యానికి ఆమె గజగజ వణికి పోయింది.

"ఏమిటి మీరంటున్నది? ఎవరి సంగతి అడుగు తున్నారు? ఎవరు చప్పారు మీకు?" భయపడుతూ మరణా వస్థ అంత్యదశలో మానవుడు పలికినట్లు అస్పష్టంగా అడిగింది.

"చూడు మరీ అంత అమాయకత్వం మేల్లేదు సుమా! అదే ఎవరో ప్రతిరోజూ అర్ధరాత్రి వస్తాడంట గదా నీ ఇంటికి? మళ్ళీ మసక చీకటిలోనే వెళ్ళిపోతాడట గదనే? ఎవడే వాడు?"

ఆ కంఠంలో నిర్ణయానికి నిశ్చయానికి మాటల్లో ధ్వనించే కర్కశత్వానికి ఎవరైనా అట్టే నేలకూలి పోగలరు! ధైర్యం తెచ్చుకుని అంది సుజాత!

"ఎవరో నాకు తెలీదు. కానీ పదిహేను రోజులుగా ఎవరూ చూడకుండా రాత్రిళ్లు వస్తున్నమాట నిజమే! ఇందులో కారం జల్లటానికేముంది?"

"తనలో కాలుష్యం లేదు! తను తప్పు చేయటం లేదు! అతన్లో దోషం లేదు! కేవలం మిత్రుడుగా వస్తూ పోతూ

వున్నాడు! తనున్న వాతావరణాన్ని బట్టి అతడు భయపడాలి. అంతేకాని లేకపోతే ఎవరికీ ఎందుకూ భయపడి బెదరవలసిని అవసరం లేదు" మనసులో అనుకుంది.

పళ్లు పటపట కొరుకుతూ మండిపడ్డాడు బాబుల్.

"ఓసి రాస్కెల్! ఎంత మాయమాటలు నేర్చావే ఈ నాలుగు నెలల్లో! చెప్పు వాడేమాత్రం ముట్ట చెప్పతున్నాడు రోజూ! బాగా గిట్టుబాటయ్యే బేరమేనా? ఇదేం రహస్య వ్యాపారం కాదులే! పెట్టుబడి లేదు, సేల్సుటాక్సు లేదు, ఇన్‌కం టాక్సూ లేదు! అంతా లాభమే! ఊ! చెప్పు ఎంతమాత్రం ముడుతోందో! నాకు చెప్పితే ఏం ఫరవాలేదు! నిన్ను ఎక్కువగా ఏమీ అడగను! ఏదో నా దేహం ఖర్చుకి దాహం ఖర్చుకి యిస్తే చాలు. ఏం? ఏమంటావు?"

అతని ధైర్యానికి, మాటల్లో అగుపించే అసహ్యానికి ఏవగించుకుని అంది!

"ఇదేం వ్యాపారం కాదు! నీవు అనుకునేంత నీచురాల్ని కాదు. జీవితానికి నాకొకడే భర్త! ఆయన నాకేమీ యివ్వటం లేదు! నేను అడగటంకూడా లేదు. ఏ సంబంధంతో అతన్ని నేను డబ్బడగటం? అలాంటప్పుడు నా దగ్గర డబ్బు ఎలా వస్తుంది? ఎలా వుంటుంది." ధైర్యంగానే జవాబిచ్చింది.

మానవంతురాలైన స్త్రీకి తన సౌశీల్యంపై మచ్చపడబోతే మండిపడుతుంది. ఎంత బేల అయినా బాల అయినా

అలాంటి సమయంలో పులిగా మారుతుంది. ఎదుటి వాడు రావణుడైనా సరే, కీచకుడైనా సరియే! నిర్భయంగా నిర్మొఖ మాటంగా నిశ్చలంగా నిజాన్ని చెపుతుంది. అప్పుడే స్త్రీలో ప్రళయ స్వరూపిణి ప్రత్యక్షమౌతుంది.

ఆకాశం రంగు బాగా ధూసరము కుంటున్నది. పార్కు లోని లైట్లు కాంతిని మరీ పుంజుకుంటున్నాయ్. ఆకాశంలో దుర్మార్గుని ఊహల్లో మబ్బులు గుమిగూడు తున్నాయ్. మంచి వాడి మనసులోని మధురుహాల్లో చుక్కలు మిలమిల లాడు తున్నాయ్. కానీ మంచివాడి యత్నాల్ని భంగపరచి అధ ర్మాన్ని విస్తరింపజేసే యత్నంలో వుండే మ్లేచ్ఛభావ దూషితు డైన దుర్మార్గుడిలా మబ్బులు ఆ మిలమిల కాంతులకి అడ్డొస్తున్నాయ్.

పార్కులో లైట్లు చక్కగా వెలుగుతున్నా ఆకాశం లోని మబ్బులవల్లా, పార్కులో ఎత్తుగా. దగ్గరిగా పెరిగిన వృక్షాలవల్ల పార్కు కాంతివంతం కాలేక పోతున్నది.

ఎవరో ఇద్దరు యువకులు ఆ ప్రక్కగా సాగిపోయారు. సుజాత లాంటి అందమైన అమ్మాయి అలాంటి కర్కశుని ప్రక్కగా అంత చక్కని సాయం సమయంలో పార్కు కొచ్చి, రాత్రివేళ అయినా ఇంకా కదలక పోవటంలో అసమంజ సత్వాన్ని గురించి ఆలోచించి అలాగే దూరం వెళ్ళి తిరిగి తిరిగి చూస్తూ వెళుతున్నారు.

బహుశా తాను కంతకీ పరిచయస్థుడైన బాబుల్

ప్రక్కనే ఆ అందమైన అమ్మాయి అలా భయపడుతూ భయ పడుతూ నిశ్శబ్దంగా కూర్చోనటం చూచి ఆశ్చర్యపడి యుండ వచ్చు!

కానీ అలాగే చూస్తు చూస్తు నిల్చుండటం బావుండ దని సభ్యతకై ముందుకి సాగిపోయారు.

అంతా గమనిస్తున్న సుజాత ప్రాణం చచ్చినట్లైంది.

"సరే! నీ దొంగ మాటల కేమొచ్చె! ఈ రోజు నేనో వూరు వెడుతున్నాను. మరి నాల్గయిదు రోజుల్లో తిరిగి రావచ్చు. ఆనాటికంతా నీ వద్ద ఎంతుందో – తెలిసిందా – అం దులో సగం ఖచ్చితంగా సగం తీసి వుంచు. నీ వెక్కడున్నా నీ చహరా మాత్రం నేను తీసుకోగల్గుతాను. నన్ను తప్పిం చుక పోలేవు. పోయినా బ్రతక నివ్వను.

నీవు కూశావే దమ్మిడే లేదని! – అదే నిజమైతే ఆ వచ్చే వాడెవడో వాడినే ఓ పాతికో పరకో సర్దుమను. నీ లాంటి అందమైన అమ్మాయి దొరకటమే వాడికి స్వర్గం – నీ కోసం ఏమైనా చేస్తాడు. గుర్తుంచుకో!

పద పొద్దు పోయింది. మరచిపోమాక! మరచి పోయావ మన చేతి రుచి చూస్తావు – జాగ్రత్త!

పిడుగుల వర్షం మీదుగా కురిసి నట్లనిపించింది సుజా తకి –

బీడి ముట్టించుకుని లేచాడు –

మెల్లిగా తన భాగ్యాన్ని నిందించుకుంటూ ఆమెకూడా లేచింది.

పార్కు దాటి బయటికి వచ్చారు. ఎవరో దూరాన్నుంచి తమ యిద్దర్నీ గమనించి ఆగిపోవటం చూచింది. ఆ వ్యక్తి తననే నిర్ధుష్టంగా చూస్తున్నారు. ఛీ! ఛీ! అండతప్పిన ఆడదాని బ్రతుకెంత హీనం!

బాబుల్ వంటి కర్కశ హృదయునితో, మర్యాద హీనునితో అలాంటి వేళ అలా పార్కునుండి బయటపడటం తల కొట్టేసి నట్లయింది ఆమెకి! తనున్న పరిస్థితులలో ఏ ఆడది వున్నా ఆమె సౌశీల్యానికి తీరని మచ్చే!

తనలో తను చచ్చిపోతూ, వుబికివచ్చే ఆలోచనలని అణుచుకుంటూ తలనిండుగా ముసుగు కప్పుకుని చకచకా ఎదురు వీధిగుండా సాగిపోయింది.

ఆమె వెళ్లినవేపే దుష్టత్వమంతా రూపుకట్టేట్టు చూచి పెదాల చివర ఓ నవ్వుని వెలిగించి—తల అలా ఎగిరేసి ఏదో నిర్ణయానికి వచ్చిన వాడల్లే గబగబా అంజలు వేసుకుంటూ తన దారంట సాగిపోయాడు. అంత వరకూ యిద్దర్ణీ పరీక్షిస్తూ నిలబడిన వ్యక్తి ఆమె సాగిపోయిన తర్వాత బాబుల్‌ని పలుకరించి, "ఆమె ఎవరో? కథ ఏమిటో?" అడుగాలి అనుకుని ధైర్యం చాలక ఊహల్ని తనలోనే అణుచుకుని, అతడు వెళ్ళిపోవటంతో నిశ్చేష్టుడై కొస్త సేపు ఆగిపోయి తర్వాత తన దారిని తను వెళ్లాడు—

*   *   *   *   *   *

# 7

ఏనాడూ ఎవరింటికీ ఎందుకూ వెళ్ళని ప్రసాద్ ఓ రోజు హఠాత్తుగ ఉప్పెనలా వచ్చాడు రమణ ఇంటికి.

వచ్చేసరికి రమణ నవలా పఠనంలో నిమగ్నుడయ్యాడు. ఈ లోకంలో లేడు! పాత్రుల కష్టపరంపరలలో, సుఖానంభూతిలో హేలా సంభాషణారతిలో పాలు పంచుకుంటూ మనో దుఃఖాన్ని, సంతోషాన్ని, హాస్యానుభూతిని పొందుతున్నాడు.

"ఓ రేయ్!"

ప్రసాద్ పిలిచిన పిలుపికి ఉలికి పడ్డట్టు ఈ లోకంలోకి వస్తూ అతని రాకకి ఆశ్చర్యపోతూ లేచి నిల్చుని "రా! రా!" అన్నాడు.

వస్తూనే "ఏం నవల బాబూ అది! అంతగా మునిగి పోయావు" అన్నాడు నవ్వుతూ.

"ఏం నవలో ఏమోగానీ! ముందు కూర్చో! తర్వాత మాట్లాడుదాం" అన్నాడు మిత్రుడు కూర్చోకుండా నిలబడి వుండటాన్ని గమనించి.

ప్రసాద్ వంటి మిత్రుడు ఏనాడూ ఎవరింటికీ రానివాడు తనయింటికి రావటానికి ఆశ్చర్యాన్ని ఆనందాన్ని అనుభవిస్తున్నాడు.

"కూర్చోవటానికి రాలేదు. త్వరగా తయారవ్వు. చాలా చాలా అర్జంటు పనులున్నాయ్! ఆలా బయటికి వెళ దాం రా"

ప్రసాద్ మాటలకి మరీ ఆశ్చర్యపోతూ

"అదేమిటి ప్రసాద్. అంత త్వరపెడుతున్నావ్. కాస్సేపు కూచో. కనీసం కాఫీ అయినా తీసుకుందువుగాని. అదేమీ లేకుండా వాకిటిలోంచి వాకిటిలోనే వెళ్ళిపోతా నంటావేం" అన్నాడు.

అతనికి ప్రసాద్ రాక పూరి గుడిసెపై గంగా భవాని ప్రవహించి నట్లుంది.

అతని ఆదరణకి అభిమానానికి అవధుల్లేని ఆనందాన్ని పొందుతూ—.

"ఈ వేసంగిలో నట్టనడి మధ్యాహ్నం సమయంలో కాఫీ ఏమిట్రా బ్రదర్ చచ్చిపోతాను. లోన వేడిమికి, పై వేడిమికి ప్రక్కల వేడిమికీ సతమత మవుతూవుంటే మళ్ళీ వేడిమిని లోపలికి సరఫరా చేస్తానంటావేం? కావాలంటే ఆతిధ్యానికి మారుపేరుగా ఈ వైశాఖంలో మంచినీళ్లివ్వటం నేర్చుకో చల్లని మంచినీళ్లిచ్చావా స్వర్గ సౌఖ్యాని అరచేతిలో నుంచి నట్టే అనుకో! ఇక వెంటనే కానీ నీ డ్రెస్సింగ్ పోనీ ఇవి చాల్లే మళ్ళ డ్రెస్ మార్చుకోవటం ఎందుకు? అనవసరంగా. చాలా అర్జంటు కదలు మరి."

అతని వాగ్ధోరిణికి,ఆ త్వంతానికి అందులోఏనాడూ తొం దరపడటమంటే ఎరుగని ప్రసాద్ అలా త్వరపడుతున్నా డేమిటి చెప్మా అని – ఆశ్చర్య పోతున్నాడు. ఇంతగా ప్రసాద్ మారటానికి – అందునా ఇంత త్వరగా మారటానికి – కారణం ఏమైఉంటుందా అనుకున్నాడు.

అతనికి ఆ సమయాన గుర్తు రాలేదు కానీ ఆతనికే తెలుసు.

"ప్రపంచంలో ఏ మానవుడైనా ఎలాంటి పరిస్థితుల కైనా మారటానికి కారణం రెండే రెండని – అవి కామినీ, కాంచనం అనీను"

అతని మౌనాన్ని గమనించి అన్నాడు ప్రసాద్.

"ఏం నాయనా! ఆలోచిస్తూ కూర్చున్నావా? ఇక అయి నట్లే! నీ ఆలోచనా ప్రపంచం అప్పుడే ముగియదు–ముగించరు బాబూ త్వరగా– ఓరే రమణా చంపకురా బాబూ త్వరగా తెములు"

అప్పుడే మౌనంగా రెండుగ్లాసుల్తో చల్లని నీరు తెచ్చి పెట్టింది విజయ.

ప్రసాద్ గ్లాసు అందుకుని త్రాగేశాడు. చల్లని నీరు. కొద్దిగా పంచదారకలిపి లేత నిమ్మరసాన్ని కలిపారు. ఎండలో వచ్చిన ప్రసాద్ పాలిటికి ఆ చన్నీరు అమృతాస్వాదనా సుఖానుభూతిని యిచ్చింది. అతని ముఖాన తృప్తి వెలిసింది.

అతను అలా మెడిమలు త్రొక్కుకోవటం చూచి ఇక ఆలస్యంచేస్తే లాక్కెళతాడని గబగబా ఆ గ్లాసెడు మంచి నీళ్లూ గుటగుటా త్రాగి "పద" అంటూ బయటికి కదలాడు మిత్రునితో సహా!

విజయకి రమణ మిత్రుల్తో నేరుగా ఎవ్వరితోనూ పరిచయం లేకున్నా వారి గుణగణాలు, అభిరుచులూ అన్నీ చక్కగా తెలుసు— రమణ చెల్లితో ఏ ఒక్క విషయమూ దాచడు. సర్వం ఉన్నది ఉన్నట్లుగా విడమరచి విశదీకరించి చెపుతాడు.

పైగా ఒక్కోసారి ఇలా వాళ్లు రావటం అలాంటి సందర్భాల్లో వారివారి ప్రవర్తన కళ్లార చూడటం ద్వారా ఆమెకి అతని మిత్రులందరి గుణాలూ పరిచయమే. వాళ్ల మిత్ర బృందంలో ఒక్కొక్కరు ఒక్కోనది వంటి వారు. అయినా విచిత్రమైన ప్రకృతి స్నేహమనే ఒక్క గుణంతో అందర్నీ కలిసి కట్టగా చేసింది అందునా రమణా ప్రసాద్ దివాకరు స్నేహితం నిజంగా త్రివేణీ సంగమమే!

వాళ్లు వెళ్లాక తలుపు చేరవేస్తూ నవ్వుకుంది విజయ ప్రసాద్ ప్రవర్తనకి. తలుపు దిరుగుతూ వెనక్కి తిరిగిచూచిన ప్రసాద్‌కి విజయ నవ్వుముఖం కనిపించింది. హఠాత్తుగా ఏదో చలనం కలిగింది అతనిలో!

*    *    *    *    *    *

నాల్గురోడ్ల వద్దకి వచ్చారు!

ఇంటినుంచి అంత తీవ్రం చేసి లాక్కొచ్చిన ప్రసాద్ నాల్గురోడ్ల వద్దకి చేచ్చేవరకూ ఏమీ మాట్లాడక పోవటం అతనికి ఆశ్చర్యం కలిగించి. అతనికి ప్రసాద్ మౌనం భరింపరానిదిగ వుంది. ఇక ఆగలేక పోయాడు.

నాల్గురోడ్లు చీలేచోట ఆగిపోయి-

"ఏమిటి విషయం చెప్పరా" అన్నాడు నిలేసి.

అక్కడే తనూ ఆగుతూ గంభీరమైన ఆలోచనలోకి జారి పోయాడు.

అతను విషయాన్ని ఎలా ప్రస్తావించటమా అని మథన పడుతున్నాడు ఎలా చెప్పాలి? ఏమిటి చెప్పాలి? ఎంత వరకి చెప్పాలి?

విషయం అంతా విడమరచి చెప్పాలా? లేక

ఎంతవరకు అవసరమో అంతవరకే చెప్పాలా? లేక

ఇప్పటికి అవసరమైంది చెపితే చాలా?

ఏదీ తేల్చుకోలేక కృత్యాద్యవస్థలో కవిలాగ మథన పడుతున్నాడు.

రమణ మళ్లీ రెట్టించి అడిగాడు.

"ఏమిటి నీ ఆలోచన? అవసరం అని, అర్జంటనీ అంత తొందర జేసి లాక్కొచ్చావే? అదేదో చెప్పెయ్యరాదూ?"

హఠాత్తుగా అన్నాడు ప్రసాద్ "నన్ను నమ్ముతావు కదా నీవు?"

మిత్రుడు నుంచి ఆశించిన సమాధానానికి ఆశించని ప్రశ్న రావటంతో బిత్తర పోయాడు.

అంతలో కాస్త తేరుకుని 'అదేమిటిరా?' అన్నాడు.

తన ధోరిణిలో యిలా అన్నాడు ప్రసాద్

ఏమిటి అనేది కాదు ప్రశ్న? ఎట్లా అనేది యిప్పటి ప్రశ్న?

నీకీవిషయం విడమరచి చెప్పటం ఎలా అని ఆలోచిస్తూ తెగకచస్తున్నాను-

నా వ్యక్తిత్వం మీద నమ్మకం వుంది కదూ నీకు?- ఆ మాత్రం చాలు-

పద అలా కాఫీ హోటల్లోకి వెళదాం - అంతా చెప్తాను.

ఒక్కో మాట అంటూ అది రమణ ముఖంలో తెచ్చే మార్పుని గమనిస్తూ అతని భావాన్ని ప్రస్ఫుటంగా చదువుతూ అన్నాడు ప్రసాద్.

మౌనంగా అనుసరించాడు మిత్రుడిని.

హోటల్లో ఎవరూ రద్దీగా లేని ఓ మూల కుర్చీల్లో కూర్చున్నాక తమకి ఏకాంతం చిక్కి నందుకు సంతోషించారు.

వచ్చిన సర్వర్‌తో టిఫిన్‌కి ఆర్డరిచ్చి, తెచ్చాక ఇద్దరూ నిధానంగా తింటూంటే ప్రసాద్ అందుకున్నాడు.

"ఓరే రమణా! ఒక అమ్మాయ్ ఆపదలో వుంది. ఆమెని రక్షించటం నా కర్తవ్యం. కర్తవ్యం కాదంటే అది నా బాధ్యత అనాల్సొస్తుందేమో? ఆమెకి యిప్పుడుండే పరిస్థితేమీ క్షేమకరం కాదు. చాలా ఆపదల్లో చిక్కుకోవచ్చు. సమయానికి మన సహాయం అందకపోతే తక్షణం ఒకటి రెండు రోజుల్లోగా తప్పని సరిగా ఆమెను ఆ యింటినుండి మార్చాలి. ఎక్కడైనా ప్రశాంతంగా ఏకాంతానికి భంగం రాకుండా వుండేయిల్లు చూడాలి. అదేనబ్బాయ్ ప్రస్తుతానికి నువ్వు చేయాల్సిన సహాయం"—

వేసవిలో మిట్టమధ్యాహ్న వేళ చెట్టూచేమ లేని దారి వెంట వెళ్లేవాడి నెత్తిన హఠాత్తుగా దబదబా వడగళ్లవాన కురిస్తే అతని మనసు ఎలా వుంటుందో రమణ మనస్సు అలా అయింది.

అతని ప్రశ్నకి ఏమీ జవాబు చెప్పక సర్వర్ తెచ్చిన డ్రింక్ మెల్ల మెల్లగా సేవిస్తున్నాడు.

మిత్రుడి నుండి ఏ విధమైన సమాధానమూ రాకపోవటంతో ప్రసాద్‌లో ఆలోచనా వ్యగ్రత అధికమైంది.

మానవుడికి కర్తవ్యతో మూఢత ప్రాప్తించినపుడు అతని ఆలోచనలు పలువిధాలుగా ప్రసరిస్తూ వుంటాయ్.

రమణ నుండి సమాధానం రాకపోయే సరికి—

"కొంపదీసి వీడు నన్ను అపార్థం చేసుకోవటం లేదు కదా" అనుకున్నాడు.

కానీ—

ప్రపంచంలో నిజంగా ప్రసాద్‌ని పూర్ణంగా అర్థం చేసుకున్న వ్యక్తి ఎవరైనా వున్నారంటే—అతడు - రమణ ఒక్కడే-

రమణ మౌనాన్ని చూచి భయపడ్డాడు ప్రసాద్.

మిత్రుడిలోని మంచితనం సుస్నేహతా సౌహార్దం తననేమైనా దండిస్తుందేమోనని.

ఏమీ జవాబు చెప్పకుండా బెల్లంకొట్టిన రాయిలా నిశ్చలంగా చూస్తూ డ్రింక్ సేవిస్తోన్న రమణని చూస్తుంటే ప్రసాద్ భయంతో విహ్వాలుడయ్యాడు.

అతని భయం మూడింతలైంది.

ఏదైనా చెప్పాల్సొస్తే, అందునా తప్పు చేసినట్టనుమానం పడితే ప్రసాద్‌కి రమణ గజగజ వణికి పోతాడనుకుంటారు మిత్రబృందం.

కానీ అది పైకి మాత్రమే.

ఎందునా ప్రసాదే రమణకి వణికి పోతాడు అంతర్యంలో ఇక అట్టే కాలయాపన చేస్తే మరీ పిచ్చిఎక్కి పోతుందేమో

నసే భయంతో మెల్లగా అన్నాడు.

"రమణా!"

ఇంతసేపూ తా మిద్దరూ అలా డ్రింక్స్ కాక గంభీర్యాన్ని తాగుతూ వుండటంతో రమణకి నవ్వొచ్చి నవ్వాలనిపించి గట్టిగా నవ్వేశాడు.

గట్టిదా నవ్వుతూన్న రమణని చూచి ప్రసాద్ నిజంగా బిత్తర పోయాడు. కొంపదీసి రమణ నిజంగా తనని అపార్థం చేసుకుని తేలిగ్గా నవ్వేయటం లేదు కదా. అని ఇంకా స్తసేపు అలాగే నవ్వితే ప్రసాద్ అపార్థం చేసుకుని అవకాశం వుందని నవ్వు నాపుకుంటూ అన్నాడు

"ప్రసాద్! నీకీ తరుణంలో నా సలహా కంటే సహాయం అవసరం. అదే తీసుకో! ఓ వ్యక్తిని అందునా జీవ మరణాల సమస్య మధ్యనున్న వారికి సహాయం చేయటమంటూ జీవితంలో ఓ అవకాశం కల్గితే ఆ అవకాశాన్ని వదలుకోరాదు సద్వినియోగం చేసుకోవాలి! మానవత్వం చచ్చిపోని వ్యక్తి ఎన్నడూ ఆపదల్లో వున్న వారిని చూచి ఉపేక్ష చేయరాదు. కర్తవ్యం తెలిసిన వాడిని నీకేం చెప్పాలి అలాగే వెదుకుతాను. లే! గది చాలా! ఇల్లు కావాలా?"

మిత్రుడినుండి వచ్చిన ప్రోత్సాహానికి ఉత్సాహపడుతూ అన్నాడు "ఓ చిన్న యిల్లు అయితే మంచిది. దొరక్క పోతే కనీసం రెండు గదులైనా వుండాలి"

కాఫీ హోటలు దాటి బయటికి వచ్చాక ఇక విడిపోదామన్న ఉద్దేశ్యంతో అన్నాడు రమణ.

"సరే! వస్తాను! సాయంత్రం అలా యింటివేపు వస్తాను. అప్పటికల్లా బహుశా పని ముగిస్తానేమో! వీలైతే యింటి వద్దకి దివాకరాన్ని కూడా రమ్మను."

మిత్రుడిని వదలలేక ప్రసాద్ రమణ వెంట నల్లరోడ్ల కూడలి దాకా వచ్చి అక్కడ విడిపోతూ స్నేహపూర్వకమైన కృతజ్ఞతా భావం అంతా కనుల్లో వెల్లి విరిసేట్టు చూసి [అతని భుజంమీద చేయివేసి కృతజ్ఞతా పూర్వకమైన భావం ప్రస్ఫుటమయ్యేట్టు] భుజాన్ని మెల్లిగా నొక్కి సెలవు తీసుకున్నాడు.

అతని ఆ అల్ప సంతోషానికి ఆనందంతో ఆహ్లాదపూర్వకంగా నవ్వుకున్నాడు రమణ.

* * * * * *

# 8

"అదీ సంగతి- అతడెవరో చెప్పటం లేదు. బెదిరిస్తూ వున్నాడని అంటుంది. అక్కడే వుంటే తనకీ నాకు యిద్దరికీ మిక్కిలి ప్రమాదం అంటుంది. ఆ ప్రమాదం ఏమిటో! ఎందుకో! ఏమీ విడమరచి చెప్పదు."

ఆగాడు ప్రశాద్.

ఉత్కంఠతతో దివాకరం, రమణా కుర్చీల్లో ముందుకి వంగారు అతడు గొంతు సవరించుకుని మళ్ళీ చెప్పసాగాడు.

"అతన్ని ఆమెతో సహా మొన్న సాయంకాలం పార్కు దగ్గరగా చూచాను. అప్పుడే బెదిరించాడట. అతన్ని అప్పు డప్పుడూ సినిమా థియేటర్ల వద్ద చూచినట్లు జ్ఞాపకం. బహుశా నేల టిక్కెట్లు బ్లాకులో అమ్ముతూ వుండి వుండొచ్చు. మనకి అవసరం లేదు కాబట్టి పరిచయమూ లేదు."

రమణ అందుకుంటూ అన్నాడు.

"చెప్పాను గదు ప్రసాద్! నా చేతనైనంత వరకూ వెదికాను. ప్రశాంతం మాట దేవుడెఱుగు ఏకాంతంగా వుండేవైనా దొరకలేదు కనీసం. ఆలోచిస్తే నీ రాకపోకలకి అభ్యంతరం లేనివిగా వుండాలి గదా! పోనీ ఆ స్థలము మీకు అన్నివిధాలా అనుకూలంగా వుంటుంది గదా మరే స్థలం కన్నానూ—వేరే చోటయితే ఎన్నెన్నో యిబ్బంధులు క్రొత్తవి తలెత్తొచ్చు— ఆ యిక్కట్లు బాపుకుంటె సరిపోతుందేమో. అయిన అతడడిగినట్లు ఓ పదిరాళ్లు పారేస్తే పీడ శాశ్వతంగా వదుల్తుందేమో ఆలోచించావా!"

"అలాంటి అవకాశమే లేదు రమణా! ఉంటే ఇంత చిక్కేందుకు. రుచి మరిగిన కుక్క అంటుంది అతన్ని. ఒకసారి యిచ్చామా అసలు చూసుకుని అతను చేసే దౌర్జన్యాలని భరించుకోలేమని కూడా అంది. ఇకపోతే అక్కడే కాపురం వుండే విషయం మరచి పోవాల్సిందే."

దివాకరం ఓ మాట అనకుండా మౌనంగా వింటూ వుండటం చూచి అడిగాడు ప్రసాద్.

"నీవేం చెబుతావు దివా! ఆమెని అలా నిస్సహాయంగా వదిలేస్తే ఎలా? ఆమెకి రక్షణ కలిగించాలి. అది తప్పదు ఇళ్ళెక్కడా దొరకటం లేదు. ఆలోచనకి అందటం లేదు పరిస్థితి. నా కంతా ఏదో అయోమయంగా వుంది. ఆలోచన తెగక చచ్చిపోతే బాగుండునని పిస్తోవుంది."

నిట్టూర్చాడు.
నవ్వుతూ అన్నాడు దివాకరం.

"చూడు ప్రసాద్! నాకో చిత్రమైన ఊహ వస్తూవుంటుంది అప్పుడప్పుడూ! మనిషి కోరుకున్నపుడు చనిపోతూ, తల్చుకున్నపుడల్లా తిరిగి బ్రతికేట్లయితే ఏల వుంటుందా? అని. లోకంలో మానవుడిని కష్టాలు కావలించుకున్నపుడల్లా వాటి కర్కశ కరాళ దంష్ట్రాలకి, కౌగిలికి అందకుండా పారిపోవటం అంటే నాలాంటి వారికి చనిపోవటమే ఉత్తమ మార్గం కదా? ఆ కష్ట సమయంలో చనిపోయి - ఆ దారిద్ర్య దేవత విలయ తాండవం ముగిశాక, జ్యేష్టాదేవి అనుగ్రహం తగ్గాక తిరిగి బ్రతికితే యిక కష్టాలంటూ ఎవరికీ వుండవను కుంటాను."

దివాకరం చెపుతూంటే రమణకి నవ్వొచ్చింది.

మధ్యలో అందుకుని అన్నాడు.

"చాలా బాగా చెప్పావు దివాకరం! నాలాంటి

నాలుగో తరగతి గుమాస్తాలకి ఫైళ్ళు ఎక్కువైనప్పుడు సెలవు పెట్టి పారిపోవాలనిపిస్తోంది. ఆ సమయంలో ఎవరో వచ్చి ఆ భాధ్యత నంతా స్వీకరించి నెత్తిన వేసుకుని ఈది మనల్ని తరిస్తారనుకుంటాము. కానీ చివరికి లాభనష్టాలు బేరీజు వేసుకుంటే చివరికి సెలవు నష్టం తప్ప మరేమీ మిగ ల్దేమో."

"అలా కాకుండా చనిపోయే వరముంటే ఈ యిబ్బంది అంటూ వుండదు కదా? అయినా దివాకరం ఈలాంటి ఆలోచనలు నాలాటి వాడికి రావాలి కానీ నీకెలా వచ్చిందా అనేది నాకిపుడు చిత్రంగా వుంది."

కార్యవ్యగ్రతతో ప్రసాద్‌కి చిరాకేసింది.

"చావు బ్రతుకులకి అవకాశం యిస్తూ ఆలోచించటం కష్టం. అంతకంటె కాలాన్ని అవకాశాలకి వినియోగించటం ఉత్తమమైన సద్వినియోగం. నిజంగా పరిస్థితులకి పారిపోవాలనుకునే వాడిని నేను. మీరే ధైర్యాంగా పరిస్థితులను ఎదుర్కొనే వాళ్లు. మీరే యిలా చావుబ్రతుకుల 'పచ్చీసు' ఆట ఆడదామంటే నలాటి వాడి గతేమిటా అని భయమేస్తోంది."

చిరాకుని హాస్యంతో జోడించి అన్నాడు ప్రసాద్.

జవాబుగా అన్నాడు దివాకరం.

"కానీ ప్రసాద్ అంతర్యాల్ని శోధిస్తే మేమే నీకంటే చాలా పిరికి వాళ్ళం! నీవు చెప్పే విషయాలు వింటూంటే నీ

అంత నిబ్బరం ఆలోచనా శక్తి మాకు లేదనిపిస్తోంది. అనిపించుట మేమిటి? నిజమే! నీ పరిస్థితుల్లో నేనే వుంటే హాయిగా పారిపోయే వాడిని. పిచ్చి కాకపోతే పారిపోవటంలో హాయి వుందనుకోవటం ఏమిటి? మనల్ని మనం ప్రతారించుకోవటం కాకపోతే! ఆలోచిస్తే అంతకంటె ఘోరం లేదు. అంతకంటే రంపపుకోతా లేదు.''

రమణా వాళ్ళిద్దరి ఉపాసోపాన సర్గారోహనకి గేటు వేస్తూ అన్నాడు.

"మనమంతా కర్తవ్యాన్ని మరచి కాలానికి దాసుల మవుతున్నాం! ఇలాగే జరిగితే బందీలం కూడా అవుతామేమో! మనకిప్పుడు కావలసింది చర్చలు కాదు. మన సమస్యకి జవాబు దాన్ని కాదని చర్చిస్తే ఎంతకైనా ఫలితం శూన్యమె.''

కల్పించుకుంటూ అన్నాడు దివాకరం.

"ఆలోచనలూ అవకాశాలూ అవన్నీ అనవసరం నేనో మాట చెవుతా వింటావా? ప్రసాద్.''

ఏమిటన్నట్టు ముందుకి వంగాడు ప్రసాద్.

కుతూహలంగా వింటున్నాడు రమణ.

"మరేమీలేదు ఆమెని మీ యింటికి తెచ్చెయ్. పై గదిలోనో క్రింది గదిలోనో ఓ దానిలో వుంచు. అంతకంటే ప్రస్తుతానికి మరో మార్గం లేదు.''

ప్రసాద్ రమణా ఇద్దరూ స్తబ్ధులయ్యారు.

"ఏమిటి దివాకరం నీగ్గానీ మతి పోయిందా? ఇక్కడికి ఆమెని తేవటం ఎలా? తెస్తే ఎలా? అసలు రావటం చూస్తే వీధి వీధి అంతా గుప్పు మనదా? ఇక యిక్కడే వుంటుందంటే మనం బ్రతకలేం" తేరుకుని అన్నాడు రమణ.

ఇంతేనా నీ సమస్య అన్నట్టు తేలిగ్గా నవ్వేస్తూ అన్నాడు దివాకరం.

"అదిటయ్యా నీ చింత! పేద్ద నవలా రచయిత నంటావే ఇదేనా నీ ఆలోచన? చెపుతా విను. ఆమెని చూస్తే గుప్పు మంటుందన్నావ్? అసలు చూడకుండా చేస్తేనో: ఇప్పుడు అక్కడికి ప్రసాద్ ఎలా రహస్యంగా వెడుతున్నాడో అలాగే ఆమెని రహస్యంగా తెచ్చేసేది. ఈ రాత్రో లేదా రేపు రాత్రో అంతే! ఇక ఇక్కడే వుంటే ఎట్లా అనేది ప్రశ్నే కాదు. రోజూ కారియర్ తెప్పించుకుని భోంచేస్తే ఎన్ని ఏండ్లైనా ఈ యింట్లో ఎందరుండేదీ. ఏమి చేస్తుండేదీ కనుక్కోలేరు. ఒక్కరు కాదు ఇద్దరు కాదు అలా నలుగురు వుండొచ్చు! తేలిగ్గా!"

"ఏమిటి? బావుందా?" అన్నట్టు చూచాడు రమణ ప్రసాద్ వేపు.

అతనేమీ అనలేదు.

త నే

"ఇప్పట్లో అంతకంటే మరోమంచి మార్గం కనిపించటం లేదు పోనీ అలాగే చేసెయ్యరాదూ" అన్నాడు.

ఇక వెళ్ళిపోదాం అనే ఉద్దేశంతో లేచాడు దివాకరం.

"ఇక వస్తాం ప్రసాద్! నాకు మట్టుకి ఇదే బాగున్నట్టు అనిపించి చెప్పాను. పోనీ యిష్టం లేకపోతే – బాగు లేకపోతే నీ మనసుకి తోచినట్టు చెయ్."

రమణ కూడా తనూ వెళ్తానన్నట్టు లేచాడు.

ఇద్దర్నీ సాగనంపుతూ అన్నాడు ప్రసాద్.

"మళ్లీ ఎప్పుడు కలుస్తారు? తీరిక వుంటుందా రేపు రావటానికి! పోనీ యిద్దరూ ఎల్లుండి? వచ్చేస్తారా?"

"సరే"

ఇద్దరూ కదిలారు.

కాస్త దూరం వెళ్లాక "ఆగరా కాస్త" అని రమణ వెనక్కి వచ్చాడు.

"చూడు ప్రసాద్ ఈ రోజే అతను చెప్పినట్టు చేసెయ్. రోజులు గడిచే కొద్దీ ప్రమాదం హెచ్చే అవకాశం వుంది. పోనీ ఆమెకీరోజు ఈ విషయం అంతా చెప్పి, కాస్తసామాను ఈ రోజు నువ్వే మోసుకునిరా! మిగతా సామాను మీరిద్దరూ రేపు పట్టుకుని వచ్చెయ్యండి ఆపైన ఆమెకి ఎద్దైతే అవసరం వుంటుందో అంటే – ఆమెకి చెందుతుంతో – అది

మాత్రం తెండి - రిక్షా వాళ్లకి కూడా ఈ విషయం తెలియ నీయటం అంత మంచిది కాదు. మీరే స్వయంగా ఎంతో జాగ్రత్తగా ఎవరికీ అనుమానం కలక్కుండా రాత్రి ఒంటిగంట ఆ ప్రాంతంలో వచ్చెయ్యండి. ఎవరైనా చూచినా ఎవరో రైల్లు వచ్చిన బంధువను కుంటారు" అన్నాడు.

"సరే! మీరింతగా ఆలోచించి చెప్పినపుడు నేను చేయక పోవటంలో అర్థం లేదు. నా కంటే మీ తెలివి మీదా ఆలోచనల మీదా నాకు నమ్మకం ఎక్కువ" అన్నాడు ప్రసాద్ క్లుప్తంగా.

దూరంగా మిత్రులిద్దర్నీ వదలి నిలబడలేక కేక వేశాడు దివాకరం.

"వస్తానోయ్" సెలవు తీసుకున్నాడు రమణ.

మిత్రుడు కలుసుకున్నాక నాలుగడుగులు వేసి అన్నాడు దివాకరం.

"ఏమిటోయ్ అది"

"ఆ ఏమిందీ. నీవు చెప్పినట్టే తక్షణం చేసేస్తే బావుం టుందని చెప్పి వచ్చాను. అతనూ సరే నన్నాడు."

"పోనీ అతని కేవిధంగానైనా మనశ్శాంతి దొరికితే అంతకంటే మనకి కావలసింది ఏముంది?"

ఇద్దరూ విడిపోబోయే ముందు అన్నాడు రమణ.

"దివా రేపు అలా మా యింటివేపు రారాదూ! నేనో క్రొత్త నవల ప్రారంభించాను మళ్లీ! ప్రారంభం ఎలావుందో, పాత్ర చిత్రణ ఎలావుందో చూద్దువు గానీ"

"మళ్ళీనా? దీన్నైనా త్వరగా ముగించేద్దు. పాపం అవి ప్రాణం పూర్తిగా లేక, రాక అల్లాడుతూ వుంటాయ్." అన్నాడు దివాకరం నవ్వుతూ గంభీరంగా.

"నిజమే దివాకరం! ఆ అసంపూర్తి పాత్రనే నన్ను శపిస్తూ నాకు మనశ్శాంతి లేకుండా చేస్తున్నాయ్. వీలైతే నా జీవితం మిగిసేలుగా వాటికి జీవం పోస్తాను'' అన్నాడు బాధతో. మిత్రుడు బాధపడటం చూచి నొచ్చుకున్నాడు దివాకరం.

''పోనీలే రమణా! బాధపడకు చూడు మనమంతా అసంపూర్తి మనుషులం కాదూ! మనవన్నీ పూర్తికాని పాత్రలు కాదూ ఏదో లోటులేంది ఇలా వుంటామా చేంకాని రచయిత రచించినట్టు బ్రహ్మ ఏదో అస్తవ్యస్త వేళ మనల్ని సృష్టించాడేమో- అయినా వాటిని నీవు ఏనాటికైనా పూర్తి చెయ్యాలి. సగం సగం మనుషులుగా కాక పూర్తి మానవత్వం వున్న వక్తులుగా తీర్చిదిద్దు. నీలాంటి రచయిత దేశానికి ఎంతైనా అవసరం!"

దివాకరం ఆవేశానికి అభిమానానికి సంతోషించాడు రమణ.

గాంభీర్యం యిద్దర్నీ విడదీసింది.

మెల్లగా భారంగా అడుగులు వేసుకుంటూ సాగిపోయా రిద్దరూ!

*   *   *   *   *   *

# 9

"రమణా!"

...   ...   ...

"రమణా!"

...   ...   ...

"రమణా!"

తలుపు తెరిచింది విజయ.

ఎదురుగా రాజా!

తొందరగా సిగ్గుపడుతూ అంది.

'అన్నయ్య మార్కెట్‌కి వెళ్లాడండి ఇప్పుడే వస్తాడు. రండి కూర్చుందురు గాని'

తలుపు పూర్తిగా తెరచింది.

లోపలికి వస్తూ అన్నాడు రాజా!

"ఎంత సేపయిందమ్మా వెళ్లి? తో డెవరయినా వెళ్లారా? ఇప్పుడిప్పుడే తిరిగొచ్చే సూచన్లేమయినా ఉన్నాయా?"

అతని మాటలకి నవ్వింది విజయ.

అతను కూడా జతకలుపుతూ మళ్ళీ అన్నాడు.

"నిజమమ్మా! వెంట ఎవరూ లేకపోతే అతని పరధ్యానంలో అతడు పడ్డాడా ఇక అంతే! మనమిలా కూర్చోవలసిందే!"

"ఎవరూ వెళ్ళలేదండి! త్వరగా రావచ్చేమో! ఎవరూ మధ్యలో అడ్డు పడకపోతే త్వరలోనే వచ్చేస్తాడు. అలా కూర్చోండి కాఫీ తెస్తాను."

కూర్చుంటూ అన్నాడు.

"అక్కర్లేదమ్మా ఇప్పుడే త్రాగి వచ్చాను అలా హోటల్లో"

నవ్వుతూ అంది విజయ.

"ఓస్ హోటల్లోనేగా త్రాగింది. ఎక్కడయినా ఫ్రెండ్స్ యింట్లోనేమో అనుకున్నానేండి అయితే బంగారం లాగా త్రాగొచ్చు. హోటల్లో కాఫీ ఓ కాఫీ నాండి! అందులో కల్తీ లేంది ఓ పంచదారే నండి! అయినా యిప్పుడు దాని మీద కూడా నమ్మకం పోతూంది లెండీ! మా యింట్లో త్రాగండి. ఏనాటికీ మర్చిపోలేరు మళ్ళీ మళ్ళీ కాఫీ వేళకి హాజరు కావాలి"

ఆమె చమత్కారానికి అతిగా సంతోషిస్తూ అన్నాడు

"మీరు చాలా చమత్కారంగా మాట్లాడతారే! చమత్కారానికి మీ అన్నయ్యకంటే మీరే నయం!"

గట్టిగా నవ్వుతూ "మా అన్నయ్యాండి! అతన్ని గురించి అర్థం చేసుకోవటం చాలా కష్టం సుమాండి! అతనికి ఏమీ తెలీదండి! ఎలా బ్రతుకుతాడో! ఎప్పుడూ పుస్తక ప్రపంచంలో తప్ప మరో ప్రపంచం సంగతి పట్టించుకోడు. నా కప్పుడప్పుడూ అనిపిస్తూ వుంటుంది......" అని ఆగింది విజయ కాస్త సిగ్గుపడుతూ కుతూహలంగా అడిగాడు.

"ఏమనేమిటి?"

"నేను మగాడిగా పుట్టి, మా అన్నయ్య ఆడపిల్లై వుంటే ఎంతో బావుండేదని. అలా అయితే మా అమ్మ కాస్త సుఖపడుండేది" అంది సిగ్గుపడుతూ.

"అంతే! అంతే" అన్నాడు మరేమీ తోచక హాఠాత్తుగా స్ఫురించగా.

"అయ్యో! కాఫీ తెస్తానని మిమ్మల్ని అలాగే కూచోపెట్టాను నా తెలివికాలా" అంటూ నొచ్చుకుంది.

చిన్నగా నవ్వుతూ ఆమెవేపే చూస్తున్నాడతను.

అతడు తనవేపే చూస్తుండటం గమనించి సిగ్గుపడుతూ యింట్లోకి వెళ్ళింది విజయ.

వాళ్ల ప్రకృతిని గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు రమణ.

రాజా, విజయా ఇద్దరూ అందమైన వాళ్ళే!
ఇద్దరూ అతిలోక ప్రతిభావంతులే!
చాలా చిత్రమైన వారిద్దరునూ!

ఒకరికి విజ్ఞానము పొంగులు వారుతున్నా, లౌకికజ్ఞానమున్నా నలుగుర్లో కలిసిపోవటం తెలీదు.

మరొకరికి అందం చందం విజ్ఞానం హాస్యం లౌకికం అన్నిటితో పాటు మర్యాదా మన్ననలూ అన్నీ తెలుసు!

అలా సాగేదే ఆలోచనా పరంపర—

కానీ—

పరధ్యానంగా చేతిలో సంచిని వూపుకుంటూ యింట్లోకి ప్రవేశించాడు రమణ

హఠాత్తుగా రాజా కనిపించేసరికి కాస్త బిత్తరపోయి—"ఏరా! ప్రొద్దున్నే యిలా బయల్దేరావ్! ఏమిటి విశేషం" అన్నాడు రమణ

తాపీగా కుర్చీలో వాల్తూ అన్నాడు "మరేం లేదురా! నీతో కాస్త పనుంది. అలా వెడదాం బయల్దేరు."

"ఆ! ఆ! అలాగే ఇదుగో ఈ కూరగాయల సంచి కాస్త యింట్లో పడేసి వస్తా" అన్నాడు రమణ లోపలికి వెడుతూ.

కాఫీ తీసుక వస్తూన్న విజయ ఎదురైంది.

ఏమనాలో తెలీక-

"అన్నయ్యా, కాఫీ" అంది మాటలు వెతుక్కుంటూ.

"ఇలా యివ్వమ్మా! నేనిచ్చి వస్తాను" సాధ్యమైనంత క్లుప్తంగా అన్నాడు.

అతని చేతికి కప్పు అందించి, చేతిలో కూరగాయల సంచి అందుకుంది.

మళ్ళీ యింకో కప్పు కాఫీ తీసుకుని వచ్చింది.

రమణ అందుకుని త్రాగుతో నుంచున్నాడు.

వాళ్ళిద్దరూ త్రాగుతూ వుంటే అలాగే ఎదురుగా నుంచుంది విజయ.

త్వరత్వరగా కాఫీ త్రాగేసి 'తీసికెళ్లు' అన్నాడు కప్పు నందిస్తూ.

తను కూడా ముగిస్తూ కప్పుకింద పెట్టి 'ఇక వెడదామా' అన్నాడు రాజా!

"ఓ నిరభ్యంతంగా"

వాకిలి చేరవేసి యిద్దరూ బయల్దేరారు.

మలుపు తిరుగుతూ చూచిన రాజాకి ఎవరూ కనిపించ లేదు. ఆశాభంగ మైంది!

అయినా మిత్రుడితో వేగంగా నడక సాగించాడు.

ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు.

కాస్త దూరం సాగాక అన్నాడు రమణ.

"ఏమిటి విశేషం!"

"ఏముందీ మామూలే! మళ్ళీ మా నాన్నగారు ఓ సంబంధం తెచ్చారు. అమ్మాయిది కాకినాడ. వెళ్ళి రమ్మంటున్నారు. అడ్డం చెప్పటానికి వీల్లేదు. వెళ్ళక పోతే చావు. ఎంత మందినని యిలా మోసగించనురా! చస్తున్నాననుకో ఈ పెళ్ళి చూపుల్తో."

ఏడుపు ముఖంతో అన్నాడు రాజా!

రాజా చెప్పే ధోరణికి నవ్వు వచ్చింది రమణకి!

"అలా ఏడవకపోతే ఏదో ఓ కుంటిసాకు చెప్పలేక పోయావా? పరీక్షలు దగ్గర కొస్తున్నాయనో - వళ్ళు నెమ్మదిగా లేదనో- ధైర్యం వుంటె ఇప్పుడే పెళ్ళి అక్కర లేదనో- మరీ ధైర్యస్తుడవైతే నీ కిష్టం లేదనో-......"

రమణ ధోరణికి చిరాకెత్తి అన్నాడు రాజా!

"నవ్వరా బాబూ! నవ్వు! నీకేం కులాసాగే వుంటుంది. నా స్థితిలో నీవే వుంటే తెలిసొచ్చేది అబ్బాయికి అవస్థ."

మిత్రుడు బుంగమూతి పెడుతూ అన్నదానికి

"అరే అంతలోనే అంత కోపమేమిటిరా బాబూ! వెళ్లలా నాయనా చల్లగా వెళ్లిరా! నాన్నగారి పుణ్యమాని. అమ్మాయి అదృష్టమూ అని హాయిగా కాకినాడ వెళ్ళి ఓ రోజుండి సముద్ర స్నానం చేసిరా! ఏనాటివైనా పాపాలంటూ వుంటే శుభ్రంగా కడిగేసు కున్నట్టవుతుంది. శుభం. వెళ్లు" అన్నాడు తాపీగా నవ్వుతూ.

"అంతే నంటావా?"

"ఊఁ!"

"కానీ చూస్తే రమణా! మా నాన్నగారికి విసుగొచ్చి నట్టుందిరా! చిరాకుతో" ఈ సారైనా నచ్చేట్టు చూసుకోరా నాయనా 'అన్నాడు' విషాదంగా ముఖభంగిమ పెడుతూ అన్నాడు రాజా!

"కాకపోతే ఏమిట్రా!"

బిత్తర పోయాడు రాజా అతని కంఠంలో కటువుకి.

"నీ లాంటి చవటని, ఒడుద్దాయిని కన్నందుకు ఆయనకి చిరాకెత్తే వుంటుంది."

"అరే చెవలాయ్! నాకు ఆఫీసు టయమైంది."

"నా గతి యింతే నట్రా!"

"ఏమో నీ కర్మ. నేను వెళ్ళాలి!"

'ఏదో ఒకటి చెప్పరా!'

"ఏం చెప్పను. ఏదో పనుంది అర్జంటు అంటే యేమో అనుకున్నాను—"

"ఇది అర్జంటు కాదట్రా"

నీ మొగం! మామూలు పాటే కదరా! ఇక నీ యిష్టం వచ్చిన పాత ప్లేటే తిరిగెయ్.'

"ఓరేయ్......"

చకచకా నాగిపోతూన్న రమణకేసి చిరాకుతో చూస్తూ పిలిచాడు.

తిరిగి కూడా చూడకుండ చెయ్యి వూపుతూ వెళ్ళాడు రమణ!

బిక్క మొగం వేసుకుని

"సరేలే! నే చస్తే మీకు సంతోషం" అని తన దారిన తను వెళ్ళాడు.—

*   *   *   *   *   *

# 10

కాలచక్రం గిఱ్ఱున తిరుగుతోంది.

రోజులు చాలా త్వరగా గడిచి పోతున్నయ్.

ఇష్టమైతే—

ఒక్క సూర్యుడితోనే పగలు పండ్రెండు గంటలూ నడిపి, రాత్రి అనేది లేకుండా చంద్రుడికి అవకాశం యివ్వకుండా సూర్యుడికే మరో రెండు గంటలు విశ్రాంతి నిచ్చి మళ్ళీ పగలు ప్రారంభించేట్టు వున్నాడు కాలపురుషుడు.

ఇక కాలం వెంట తిరిగే పురుషుడు.

ఆ రెండు గంటల సంధ్యా కాలంలోనూ విశ్రాంతి లేకుండా పని చేసుక ప్రగతి సాధిద్దామని అనుకుంటున్నాడు.

కానీ కాలమే పురుషుడికి అవకాశం యివ్వటంలా—

కాలపురుషుని కఠోర కర్కశ కరాళ బాహువుల్లో పడి నలిగి పోతున్నది మానవుడి యవ్వనమూ, విజ్ఞానమూ, సర్వస్వమును.

కానీ రక్షించుకోవటానికి కనీసం ప్రయత్నమైనా చెయ్యటం లేదు బలహీనుడైన మానవుడు.

కేవలం నిర్లిప్తతతో నిరాశతో కాలాన్ని వెళ్ళబుచ్చుతున్నాడు సగం మానవుడు.

ప్రగతితో జగతిని పునరుద్ధరిద్దామని ప్రయత్నిస్తే ప్రయత్నాల ప్రణాళికలలో పడి నలిగి పోతున్నాడు పాతిక మానవుడు.

చేజిక్కిన సంపదని ప్రజాకార్యాల పేరిట తన స్వార్థానికి యుపయోగించి నశిస్తున్నాడా మిగిలిన పాతిక మానవుడు.

ఎవరికీ ఎవరూ ఎందునా ఎందుకూ.ఎదురవ్వటం లేదు.

సుమారు నెల రోజుల తర్వాత దివాకరం, రమణా ఇద్దరూ అనుకోకుండా ప్రసాద్ యింటి ముంగిట కలుసుకున్నారు ఇద్దరూ కలవటంతో ఆశ్చర్యపోయి నవ్వుకుని తేరుకుని- 'చాలా రోజులయింది కదూ' అనుకున్నారు యిద్దరునూ,

"నీవు కూడా రావటం లేదా రమణా" అడిగాడు దివాకరం.

"ఆఫీసు పనితో తీరికే చిక్కటం లేదు. అయితే దివా నీవు కూడా ఈ నెల రోజుల్నించీ యిటు రావటం లేదన్న మాటేగా" అన్నాడు ముందుకు సాగుతూ.

"ఏదో కాలేజిలో కలియటం తప్ప మళ్ళీ యిక్కడికి రావటం లేదు. కాలేజిలోనైనా ఏదో గ్రీట్ చేసుకోవటమే కాని తీరిగ్గా మాట్లాడు కున్నదీ లేదు."

కాస్త ఆగి అనాడు దివాకరం.

"ఎంచేతో నాకు జీవితంమీద విసుగు పుట్టుతుందోయ్. జీవితం మీద అనేకంటే కాలేజి జీవితం మీద అంటే మరీ సరీగా వుంటుందేమో."

అందుకు చిరునవ్వు నవ్వుతూ-

"చూశావా! దివా! సృష్టిలో విచిత్రం యిదే! మీకేమో కాలేజీ మీదా, కాలేజీ చదువుల మీదా విసుగు. నాకేమో కాలేజి జీవితం మీద భ్రమ అది దక్కలేదని పిచా

రం, కాకపోతే యింతటి వైవిధ్యంగల చిత్తవృత్తుల్తో మన మంతా ఎలా కలసి వుంటున్నామా అనేదే ప్రశ్న" అన్నాడు రమణ.

ఇద్దరూ యింట్లోకి ప్రవేశించారు.

దివాకరం అన్నాడు—

"నీవు కూడా కాలేజీలో ప్రవేశించి వుంటే సరిగ్గా నీ స్థితి యిలాగే అయ్యేది. ఏదో అంటారే 'దూరపు కొండలు నునుపు' అని. అలాగే వుంటుంది. 'దగ్గర కెడితే రాళ్లూ, గుండ్లూ' అన్నట్లే వుంది మన స్థితి. కాకపోతే నీ కందులో భ్రమ. మాకు మరో దాన్లో. అంతే తేడా. మార్గాలు వేరు కాని అనుభూతులూ అనుభవాలూ ఒకటే!"

దివాకరం అన్నమాటలకి మౌనంగా నవ్వుకున్నాడు రమణ.

ఈ నాడు కాలేజిల్లో చదివే ప్రతివారూ ఆ విద్యని, ఆ విద్యా విధానాన్ని ఏవగించు కుంటున్నారు. ఎవరో కేవలం కాలేజి పుస్తకాలు తప్ప మరో ప్రపంచం లేని వాళ్లే మంచి అంటున్నారు గానీ కాస్త మనిషికి ఆహ్లాదం కలిగించే ఇతర వ్యాపకుల్లో అంటే సంగీతం – సాహిత్యం – క్రీడలు వీటిలో పరిచయం కల్గించుకోవాలని మనిషీ మేధా సమాన ప్రతిపత్తితో పెరగాలని ఆశించేవారి చేతికి డిగ్రీ అందకుండా అల్లరి చేస్తోంది విశ్వనాధ వారన్నట్లు "డిగ్రీలు లేని పాండిత్యమ్ము వన్నె కెక్కని పాడుకాలన పుట్టి" ఎందరో మేధావంతులు అణగారి పోతున్నారు.

ఆలోచిస్తూ ఇంట్లోకి వెళ్ళారు.

లోపల్నుండి—

చక్కగా తీయగా మధురాతి మధురంగా మంద్రస్థాయిలో 'నగుమోము గనలేని' వినిపిస్తోంది. సుధామధుమైన సంగీత సాహిత్యములో పరస్పర పెనవేసుకుని ఉన్నాయ్. శ్రావ్యత ఒడ్డులొరసి ప్రవహిస్తోంది.

ఒక్క క్షణం వాళ్ళా మాధుర్యంలో సొక్కిపోయారు.

పాట ఆగిపోయింది.

"ఎవర్రా పాడుతోంది. మనం పొరపడలేదు కదా? కాకపోతే ప్రసాద్ యిల్లు ఖాళీ చేశాడా? ఏమిటో సంగతి" అన్నాడు దివాకరం.

ఒక్క క్షణం ఆలోచించి అన్నాడు రమణ.

"అలా అయివుండదు. నేననుకోవటం. బహుశా ప్రసాద్ మనమాట ప్రకారం ఆవిడని— 'సుజాతని' యిక్కడికి తీసుకుని వచ్చేసినట్లుంది. ఆవిడ బాగా పాడుతుందన్నాడు కదా! అయినా సందేహ మెందుకు పిలుద్దాం."

అలా అంటుండగనే వాకిట్లో అలికిడై సుజాత వాకిటిలోకి తొంగి చూసింది.

ఎదురుగా వాళ్ళిద్దరూ కనిపించారు.

నమస్కరిస్తూ అంది.

"ప్రసాద్ గారు మేడమీద వున్నారండి"

ఆ కంఠస్వరాన వేణు వీణియలు మీటి నట్టయింది రమణకి.

ఆ వినయానికి వినమ్రతకి మర్యాదకి ముగ్ధులవుతూ యిద్దరూ మేడమీదకి వెళ్లారు.

ప్రసాద్ నిశ్శబ్దంగా ఏదో చదువుతున్నాడు.

వాళ్ళిద్దరూ రావటం చూచి కుర్చీలోంచి లేస్తూ అన్నాడు.

"ఏమయ్యా! మీరిద్దరికీ ఏం శిక్ష విధించాలి! నెలనాళ్లు! అయ్య బాబోయ్ ముప్పయ్ రోజులు! తప్పం విధించాల్సిందే శిక్ష! ఉ రోజుకో శిక్ష! కోరుకోండి."

నవ్వారిద్దరూ!

"ఒక కాఫీ! వీలైతే టిఫిన్ జతగా" అన్నాడు రమణ సన్నగా నవ్వుతూ!

"వీలైతే స్ట్రాంగ్ టిఫిన్" వంత పాడాడు దివాకరం.

"ఓ యెస్! అలాగే" అంటూ 'సుజాతా! టిఫిన్ తో సహా పైకి వచ్చేయ్. క్విక్ శిక్షితులు తొందరించెస్తున్నారు. సత్యాగ్రహం చేయకముందే శిక్షిద్దాం. ఊ" అన్నాడు

అతన్లో వికసించిన చమత్కార కుసుమాన్నాఘ్రాణించి వాళ్లు సంతుష్టు లవుతున్నారు.

ఓ పది నిమిషాలు నిశ్శబ్దంలో దొర్లిపోయాయ్. ఎందుకో తెలీకుండా నిశ్శబ్దం పరిపాలనలోకి వచ్చింది. దాన్ని బేధించటానికి ఎవ్వరూ సాహసించటం లేదు.

వాళ్లందరికీ-

అప్పుడే క్రొత్తగా కలుసుకున్న నూతన మిత్రులు 'ఏం మాట్లాడాలా? ఏం మాట్లాడితే ఎదుర్వాళ్లు ఏమను కుంటారా' అని ఆలోచిస్తున్నట్లు వుంది

మాటలు వెతుక్కుని తూచుకుని మాట్లాడి పరిస్థితిని తేలిక చేసెయ్యాలని ప్రతి వారికీ అనిపిస్తోంది.

కానీ - మాటలే అనిపించటం లేదు.

ఫ్లాస్కులో కాఫీ - టిఫిన్ పొట్లాలు పట్టుకుని పైకి వచ్చేసింది సుజాత-

వాళ్లు మౌనంగా గమనిస్తోన్నారు.

మెల్లిగా శబ్దం కాకుండా ఓ టేబిల్ జరిపి, దానిచుట్టూ నాల్గు కుర్చీలు వేసింది.

అల్మారా తెరచి నాల్గు ప్లేట్లు, నాల్గు గ్లాలూ తెచ్చింది ప్లేట్లలో వేడి వేడి పకోడీలు సర్దింది. నాల్గు గ్లాసులో చల్లని

మంచీళ్లు కూజాలోంచి వంచింది.

మళ్లీ అల్మారా తెరచి నాలుగు కప్పులూ, సాసర్లూ తెచ్చిపెట్టి కాఫీ ఫ్లాస్కు టేబిల్ మీద పెట్టింది.

తలెత్తి వాళ్ళ వేపు చూసింది.

నిశ్శబ్దతని ఛేదిస్తూ అన్నాడు ప్రసాద్.

"రెడియా! శిక్షకి"

నవ్వుకుని నలుగురూ టిఫిన్ కి కూర్చున్నారు. మౌనంగా పకోడీలు ఒక్కొక్కటే ముగిస్తున్నారు. ఎవ్వరూ మాటలాడ సాహసించటం లేదు.

రమణ తింటూ తింటూ దొంగతనంగా ఆమె వైపు చూస్తున్నాడు

ఆమె అందం అతన్లో విచిత్ర సంచలనం కల్గించింది

అతడు చూచిన స్త్రీలకీ ఈమెకి ఎంతో విలక్షణం కని పిస్తోంది.

ప్రపంచంలోని సౌందర్యం అంతా ముద్ద కట్టుకుని మూర్తీభవించి నట్లుంది అనుకుని. అతిశయోక్తి అనుకు న్నాడు మళ్ళీ. అలాంటి వాళ్ళల్లో ఒకతె అనుకుని సహజాం అనుకున్నాడు.

తలకి పోసుకుంటున్నది. వెంటుకలన్నీ ఊరకే దువ్వి అలాగే వదిలేసింది.

పొడి పొడిగా వున్న కురులన్నీ వీపుమీదా భుజాల మీదా నాట్యం చేస్తున్నాయ్.

కొన్ని అల్లరిగా ముందుకి తొంగి తొంగి చూస్తున్నాయ్. ఆమె విడుపాటి కేశ సౌందర్యాన్ని సౌభాగ్యాన్ని చూచి ఆనందం కలిగింది అతనికి!

సౌందర్య పరీక్షలో పలహారాలు ముగిశాయ్.

మెల్లిగా ఫ్లాస్కులోని కాఫీ కప్పుల్లోకి వంచుతూంటే రమణ కలుగజేసుకుని అన్నాడు.

"చాలా రుచిగా వున్నాయండీ పకోడీలు. బహుశా మీ చేయి అంతటి రుచి యిచ్చేసింది కాబోలు!"

చిరునవ్వు నవ్వి అంది!

"పొరబడ్డారండీ! ఇవి నా చేయి తగిలి రుచి తెచ్చుకోలేదు! ఇదంతా హోటలు సరుకే! ఆయన ఎక్కువగా తెప్పిస్తారని తెలుసు కదూ! మీరు వచ్చి పాలుపంచుకోవటంతో సరిపోయింది గానీ లేపోతే మళ్ళీ ఇంకోసారి మేమే తినాల్సొచ్చేది."

"అయితే హోటలువాడి ధర్మమన్న మాట" దివాకరం కలుగ జేసుకుంటూ అన్నాడు.

"ఆ! డబ్బిస్తే చేసిన ధర్మం" సుజాత నవ్వుతూ అంది.

ప్రసాద్ ఏమీ పల్కకుండా మౌనంగా సుజాతని గమనిస్తోన్నాడు.

"ఆ నాటి సుజాతకి ఈ నాటి సుజాతకీ ఎంత తేడా! ఆ నాటి సుజాతలో కేవలం నిర్లిప్తత, స్తబ్దత గూడు కట్టుకుని వుండేవి.

ఈ నాటి సుజాతలో చురుకుదనం, చమత్కారం పొంగి ప్రవహిస్తోన్నాయ్.

పరిసరాలు మానవుడిని ఎంత మారుస్తాయ్ అనుకున్నాడు. తనేమీ మాట్లాడకుండా వుంటే వాళ్లు అపార్థం చేసుకుంటారేమోనని చెప్పటానికి ప్రారంభించాడు.

"ఆ నాడు మీరంతా చెప్పారు కదా ఈ మెని ఇక్కడికి తీసుకు రావటమే శ్రేయస్కరమని! ఎంత ఆలోచించినా నా కంతకంటే మంచి ఉపాయం, మార్గం తోచలేదు సరే మీకంటే నాకేం ఎక్కువ తెలుసు లెమ్మని మీరు చెప్పిందే చెయ్యటానికి నిశ్చయించుకుని ఆ రాత్రే వెళ్ళి చెప్పాను."

అతను ఆగాడు.

సుజాత తల వంచుకుని మౌనంగా చీర చెంగు మెలి పెట్టుతోంది.

"ముందు రానంది, తర్వాత రాలేనంది. కారణం అడగ్గా అడగ్గా నా వల్ల మీకిబ్బంది కాదా? అంది. తర్వాత మీ కీర్తి ప్రతిష్ఠలకి భంగం కాదా? అంది. నాకో కోపం వచ్చేసి సరే అల్లాగయ్యేట్టయితే ఇక నీ తోవ నీదే నా తోవ నాది అని వచ్చెయ్యబోయాను. అందుకు, కాస్త ఆలోచించండి. ఆవేశం కూడ దిందులో అంది. ఆ మాటల్లో మొండితనం కాక అర్థం గోచరించటంతో నిలబడి పోయాను. అయినా మీ కంటే ఆలోచించగలనా? అనుకుని నీ అభ్యంతరం మేమిటి అన్నాను.

అతను మళ్ళీ ఆగాడు.

సుజాత తలెత్తి చూచింది.

సరిగా చెపుతున్నానా అన్నట్లు చూసి, నవ్వి మళ్ళీ సాగించాడు.

ఆమె మౌనంగా ముఖం తిప్పుకుని కిటికీగుండా నీల జలదాల జలతారు పరదాల చాటున దోబూచులాడే చందమామ అందాన్ని తిలకిస్తోంది

"నే వస్తే నా తిండి తీర్థ కథ ఏమిటి." అంది నవ్వుతూ. అదే ఆమె అభ్యంతరమైతే మరేం ఫరవాలేదని మన ప్లాను చెప్పాను. ఒప్పేసుకుంది ఆ తొందర్లో. పాపం ఆమెకి అప్పుడు ఆ పరిస్థితుల్లో రావటం తప్ప మరేమీ తోచలేదు. రెండో రాత్రే యిక్కడికి వచ్చేసింది. ఒక్క రోజు గడిచిందో లేదో యిక చూడు భగవాన్ అన్నాడు వచ్చే నవ్వుని అపుకుంటూ.

ఎందుకు నవ్వబోతున్నాడో. ఆ అద్భుత హాస్యరసాన్ని సృష్టించే ఘట్టమేమిటో ఏమీ అర్థం కాలేదు వాళ్ళిద్దరికీ.

సుజాత సిగ్గుతో అవమానంతో కుంచించుకపోతూ మెల్లగా అంది.

"తెలియని తనానికి అంతగా నవ్వాలేమిటి?"

వాళ్ళ మాటలతీరూ, ప్రవర్తించే విధానం అంతా భార్యాభర్తల్లా అనిపించింది. దివాకరానికి క్రొత్త దంపతుల్లా వున్నారు అనుకున్నాడు.

"ఏమిటో చెప్పరా బాబూ" అన్నాడు రమణ.

"ఆ ఏముందీ స్నానం చేయటం మొదలుకుని పడుకోవటం వరకూ అన్నీ ఇబ్బందులే! అన్నీ ఆటంకాలే. తర్వాత ఓ రెండు రోజుల్లో ఇల్లంతా మారిపోయిందనుకో! మన మకాం పైకి మారింది పూర్తిగా. క్రింద ఒక్క వస్తువూ లేదు. క్రిందంతా ఆమెదే" అన్నాడు.

రమణకి వాళ్ళిద్దరి ప్రవర్తనా మాట్లాడుకోవటం అదీ చూస్తే మనసులో పచ్చిదనం ఆరని నూతన ప్రాణస్నేహితుల్లా వున్నారని పించింది.

అతను మళ్ళీ చెప్పసాగాడు.

"తర్వాత చూడు రమణా! రాత్రిళ్లు ఈవిడని ఒక గంటసేపు యిలా కూర్చుని పొమ్మంటానా? అదేమిటండీ పగలంతా

వున్నాగా అనిరాదు. క్రిందికి నేనే వెళ్ళి బ్రతిమాలితే ఓ అర గంట గడిచాక ఇంకేం యిక్కడే గడిపాం కదా చాలదా! అంటుంది. తర్వాత నాముఖం చూచి నిశ్శబ్దంగా లేచి పైకి వచ్చి అదో ఆకుర్చీలో కూర్చుని ఓ పాట పాడుతుంది. అచ్చం అది జోల పాటలాగా పని చేసి మనసుని మత్తిల్ల చేస్తుంది. అంతే తర్వాత చడీ చప్పుడు లేకుండా క్రిందికి వెళ్ళి పోతుంది" అతను చెప్పటం అయ్యి పోయిందన్నట్టు ఆగాడు.

సుజాత లేచివెళ్ళి కిటికీ వద్ద నుల్చుని తోటలోకి చూస్తుంది.

మేడ నానుకునే పెద్ద పెద్ద నారింజ తోటలూ, అరటి తోటలూ ఉన్నాయ్. సాయంత్రం నుండి తెల్లారే వరకూ ఆహ్లాద కరమైన గాలి సంగీతం పాడుతూ వుంటుంది. నారింజ తోటమీదుగా నాట్యం చేస్తు వచ్చే పిల్లగాలిని పీల్చటం అదో తెలియరాని హాయి

ఏమీతోచక "వెళ్ళొస్తాం" అని లేచారిద్దరూ.

ఇద్దరికీ నమస్కారం చేసింది.

ప్రతి నమస్కారం చేశారు.

"రోజూ రండిరా" అన్నాడు ప్రసాద్.

"ఏమి జవాబు రాక పోవటంతో" మీా కిబ్బందిగా వుందా" అంది సుజాత.

"అదేం కాదులేండి తప్పక వస్తాం" అన్నాడు రమణ.

మెల్లగా వెళ్ళిపోయారిద్దరూ!

*    *    *    *    *    *

# 11

సూర్యోదయం—

సూర్యాస్తమయం—

మళ్ళీ సూర్యోదయం—

మళ్లీ సూర్యాస్తమయం—

చక్ర నేమి క్రమంలో కాలచక్రం తిరుగుతుంది.

సామాన్య ప్రజానీకాని ఇంతే తెలిసేది.

కానీ—

వెదాంతులకి—

విజ్ఞాన పంతులకి—

"క్షణశః కణశశ్చైవ విద్యాం అర్థంచ సాధయేత్" అన్నారు కొందరు.

"అనంత మైన కాల ప్రవాహానికి నిలకడ లేదు. ఆ అనంతమైనీ కాలగణితంలో కూడికలే గాని తీసి వేతల్లేవు" అన్నారు ఇంకో కొందరు.

విలువైనదీ విలువ మైన మరుక్షణాన్నే తన విలువని తెలియ జేసేది కాలం గడిచాక కానీ దాని విలువ తెలీదు.

విలువ తెలిశాక దాన్ని ఉపయోగించుకోవటానికి రాదు. అప్పుడు తెలిసి వ్యర్థమే అవుతున్నది. ఇదంతా చక్రబంధనం కాలపురుషుడు మానవుల జీవితాలనే మీనాల్ని ఆకర్షించి బంధించాలని విసరిన గాలయుక్తమైన వల.

కాలాన్ని కాలం తీరుని చదివిన మహర్షులు సైతం అందుకి దాసులు కాక తప్పలేదు.

పూర్వర్షుల్ని అన్నిటీ లెక్కించని నవనాగరకులు సైతం కాలానికి కళ్లెం వేసి ప్రగతి పథంలో పయనిద్దాం అని అనటమే కానీ యత్నమంతా కించిత్తైనా ఫలోన్ముఖం కావటం లేదు.

ఒక్క రచయితనే కాలం అంతగా కబళించ లేకపోతోంది. ప్రతి సామాన్య రచయితా కూడా సామాన్య మానవుడి కంటే అధికుడే అందులో.

కాలం కళ్ళెం విసరితే అదేదాన్ని కళ్ళెంగా ఉపయోగించుకుని కాలంపై స్వారీ చేయగలుగుతాడు రచయిత.

అందుకే కాలం విధాకూడ బలుక్కుని రచయితల్ని వంచించాయ్. మానవుడికే సుఖోపాధియైన ధనాన్ని ఏ విధంగా కూడా అతని దరి జేరకుండా ఎన్నో మార్గాల నిరోధిస్తూ అతిడిని మానసికంగా శారీరకంగా బాధించ యత్నిస్తూ అతని చెక్కు చెదరని మనోధైర్యం ముందు బలాదూరై పోయి క్రూరంగా అతన్ని వీక్షిస్తోంది.

కానీ—

రచయితా మానవుడే. వానికే క్షుత్పిపాసలున్నాయ్.

వానికీ మృత్యువుంది. సంసార బంధముంది—

అదే—

కాలానికి రచయితని గ్రహించటానికి అవకాశాన్ని యిస్తోంది. ఒక్క భౌతిక రూపాన్ని గ్రహించినంత మాత్రాన తృప్తి చెందకుండా అతని సాహితీ రూపాన్ని కూడా, చిన్నా భిన్నం చేయటానికి యత్నిస్తుంది అక్కడే సామాన్యంగా ఓడి పోవటం జరుగుతోంది.

కవులేరి?

అంటుంది కాలం?

కాలన లేకున్నా కవితలే లేరా అంటుంది సాహిత్య!

కవనాన కలకాలం నిలుస్తాడా! అంటుంది కాలం.

కవి జీవితం కవన జీవితం నిగ్గయిస్తుందంది

ఒక్కోసారి కవులకే కాక కాలాన్ని కాదనే శక్తి కళా కారులకే అబ్బుతోంది కానీ అల్పసంఖ్య ప్రశ్న కాలానికి జయం చేకూరుస్తోంది. మ్లేచ్ఛశక్తి విజృంభిస్తే కవులకీ కళా కారులకీ చెడు ప్రాప్తిస్తే కాలం కర్కషంగా నవ్వుతోంది.

కానీ—

కాలం అందరిచేత నిందింప బడుతోంది.

కాలం – ఛీ-ఛీ – పాడుకాలం.
తాడితన్నె వాడిని తలదన్నే వాడున్నాడు.
కాలం ఎటు సాగుతుందో?

కాలం తన ప్రభావం ఎంతగా చూపిస్తున్నా ఒకో-చోట అది సాగిపోవటంలో సామాన్యులపై సాగకుండా వుంది.

రోజులు లోకానికికంతా ఎలా గడుస్తున్నాయో గమనించటం కష్టం.

కానీ రమణా–ప్రసాద్–సుజాతా–దివాకరం వీళ్ళ నలుగురికీ చక్కగా లోకమంతా మల్లెబాటలో గులాబీ తోటలో పూల బాలల్తో ఆటలాడుతూ పాటపాడుతూ సాగిపోతోన్నట్టు అగుపిస్తోంది.

ప్రతి సాయంకాలం వాళ్ళిద్దరూ వస్తారు.
కాఫీ ఫలహారాలు!
ప్రసాద్ సుజాతలతో చక్కని చర్చలు.

చక్కగా సంభాషణలు సాగిపోతూ ఆహ్లాదకరంగా వుంటోంది. వాళ్ళతో ఏ మాత్రం బిడియం లేకుండా వ్యవహరించేది ఆమె.

ఆమెకి రమణతో చక్కని స్నేహం కుదిరింది.

అయితే దీన్ని గురించి వాళ్ళలో ఏమీ పొరపొచ్చాలు రాలేదు అలాంటి చినచిన్న విషయాలకే దూరంగా పోయే వారు కారు వాళ్ళు.

గాఢమైన స్నేహభావంతో సహృదయంతో సంగీత సాహిత్యాల్ని గురించి గట్టిగా వాదించుకునేవారు. విషయాల నిగ్గు తేల్చేవారు. నవలా రచయితా, విజ్ఞాని అయిన రమణ, సంగీత సాహితీ వేత్తలైన ప్రసాద్ దివాకరులూ, సంగీత విధి కాకున్నా చక్కగా పాడే సుజాతా, వాళ్ళ కలయిక సంగీత సాహిత్య రూపం కలిసి జీవించే సరస్వతీ రూపానికి ప్రతిరూపంగా వుండేది వాళ్ళ గృహం.

ఓ నాడు హఠాత్తుగా మాటలు సందర్భంలో అనంద ర్భంగా అడిగాడు ప్రసాద్.

"చూడు సుజాతా! ఆ నాడు పార్కులో అగుపించి నతను ఎవ్వరంటావ్? అడగాలని ఎన్ని మార్లనుకున్నా సమయానికి మాత్రం గుర్తుకు రాలేదు. ఎప్పుడో వచ్చినా మరేదో అడ్డమేది. అయినా ఒక్క సందేహం అతడెవరైనా కానీ అతనికి అంతగా భరింప రానంతగా భయపడాల్సిన అవసరమేమిటి?

నిశ్శబ్దంగా నిద్రపోతుంటే ఎక్కడో తుపాకి పేల్తే ఏమిటో లెమ్మనని అనుకున్న వ్యక్తికి ఊహించనైనా ఊహించని వ్యక్తికి అదే తుపాకి తూటా తనకి తగిలి దూసుకపోతే ఎంతగా బిత్తర పోతాడో ఎలా చలనం లేకుండా నిలుక్కుని పోతాడో అలా అయింది సుజాత!

కాస్సేపు నిర్జీవంగా అలాగే కూర్చుని జవాబు ఏమీ యివ్వకుండా త్వర త్వరగా క్రిందికి దిగిపోయింది. హఠాత్తుగా అలా జరిగే సరికి బిత్తర పోయారు ముగ్గురూను.

ఓ గడియ కాలం అందరూ నిశ్చేరపోతూ అలాగే వుండిపోయారు. ఎవ్వరికీ ఏమీ చేయటానికి తోచ లేదు.

ప్రసాద్ చిరాకుగా గదంతా పచార్లు చేస్తున్నాడు తల వంచుకుని ఆలోచనా పూర్వకంగా రౌండ్ టేబిల్ మీద టకటక లాడిస్తున్నాడు వేళ్ళని.

రమణ రెండు చేతులా తలపట్టుకుని కూర్చున్నాడు. అతనికి ఏమీ ఆలోచన పాలుపోవటం లేదు. అతనికి 'ఆమె ఎందుకు అంత త్వరపడిందా?' అని ఆలోచిస్తున్నాడు అర్థం కాక.

చివరికి—

ఏదో నిర్ణయానికి వచ్చిన వాడిలా "క్రిందికి వెళ్ళి సంగతేమిటో కనుక్కుని వస్తా ప్రసాద్" అన్నాడు కుర్చీలోంచి లేస్తూ.

'సరే నీ యిష్టం' అన్నాడు ప్రసాద్.

అందులో ఏ భావమూ వ్యక్తం కా లేదు.

క్రిందికి వెళ్ళేసరికి తలగడపై తల ఆన్చుకుని నిశ్శబ్దంగా శూన్యంలోకి చూస్తోంది

రమణ వచ్చిన అలికిడికి తలతిప్పి చూచింది.

హఠాత్తుగా అతడు గదిలోకి వచ్చేసరికి బిత్తరపోతూ లేచి చీర కుచ్చెళ్ళు సవరించుకుని మంచం దిగింది

ఆమె చెక్కిళ్ళపై కన్నీటి చారల మరకలు సుస్పష్టంగా కనిపిస్తున్నాయ్.

ఓ గంట కాలం గడిచింది.

పైన వాళ్ళిద్దరూ నిశ్శబ్దంతో పేచీలు పెడుతున్నారు. క్రింద ఏం జరుగుతుందో తెలీక.

మెట్లమీద చప్పుడు కావటంతో అటుచూచారు.

రమణ చకచకా పైకివచ్చి – తిరిగి దివాకరం చేయి పట్టుకుని "పద దివా– వస్తాంరా ప్రసాద్. రేపు వచ్చి విశదంగా చెపుతాన్లేను. ఆమెనేమీ ప్రశ్నించకు – అంతా మామూలుగా సజావుగా సాగనీ." అన్నాడు క్రిందికి దిగిపోతూ

ప్రసాద్‌కి ఆ క్షణాన ఏమీ తోచక నివ్వెర పోయాడు.

*  *  *  *  *  *

# 12

కమల తమ్మ నములుతూ నిల్చుంది. నిద్రవచ్చే సూచనలు కనిపించినప్పుడూ, విశ్రాంతి అవసరం అయిన సమయంలో విశ్రాంతికి ప్రతిగా, తమ్మ నములుతుంది కమల. అది ఏ నాలుగో పర్యాయమో ఆ రోజు!

సినిమా రెండవ ఆట ఇంకా వదల్లేదు. జనం పల్చగా తిరుగుతున్నారు. తిరుగు బోతులూ, తాగు బోతులూ పని లేక

రాత్రి సంచారం చేసే ప్రబుద్ధులూ, నటులూ, విటులూ తిరు గాడు తున్నారు.

సరియైన వాళ్ళెవరూ కనిపించక పోవటంతో బద్ధకంగా వళ్లు విరుచుకుంటూ పేలవంగా నవ్వుతూ నిలబడివుంది కమల

జాకీస్ వద్ద వెలిగే దీపం కాంతిలో ఎవరో యిటుగా వస్తున్నట్లు అగుపించి ఆశగా చూస్తోంది అతన్నే గమని స్తోంది యిటే వస్తున్నాడు. దగ్గరగా రానిచ్చి మెల్లిగా అంది "వస్తావా" అని

అతను ముందు బిత్తరపోయాడు ఏమిటా ఈ ఆయా చిత ఆహ్వానమని. తర్వాత "ఎందుకేమిటని?" ప్రశ్నించాడు.

బిగ్గరగా నవ్వింది కమల.

ఆ నవ్వు నిర్జీవంగా పేలవంగా వుంది

"ఎందుకేమిటి...హి...హి...హి..."

అతనికా జవాబులో ఏదో గోచరించనట్లయి "ఇంట్లో ఉన్నారా? బయటికి పిలు" అన్నాడు

అతడి ప్రశ్న అర్థం కాక "ఎవరు?" అంది నివ్వెరపోతూ

అతడూ ఆమె ప్రశ్నకి ఆశ్చర్యపోతూ "ఎవరూ?... అమ్మాయిలు..." అన్నాడు.

"అమ్మాయిలా?... ఎవరూ లేరు... నేనే..."

"అమ్మాయిల్లేరా? అయితే మరెందుకు పిలిచావ్?...
ఛీ! ఛీ! నీవా?..."

మరేం మాట్లాడకుండా అసహ్యంగా చూస్తూ ముందుకి సాగాడు.

కమలకి తనపై అసహ్యం చూసి వెళుతున్న అతన్ని చూసి ఆగ్రహం మితిమీరింది.

సరాసరి అతని దగ్గరిగా వెళ్ళి చేయి పట్టుకుని ఆపి అంది. "ఏమిటి? నాతోనైతే ఛీ! ఛీ...నా? ఏం? ఎందుకు?"

సిగ్గులేని ఆ ఆడదాన్ని చూసి అతడికి నవనాడులూ కృంగిపోయాయ్

"ఏయ్.. ఏమిటది? మర్యాద తెలీదూ? నీ కా్క వలసింది డబ్బే అయితే యిదుగో తీసుకుని నన్ను వదిలెయ్" జేబులోంచి రెండు రూపాయల కాగితం విసరికొడుతూ అసహ్యంగా అన్నాడు.

తిట్లకీ చివాట్లకీ చేవాట్లకీ అలవాటుపడిన శరీరం కాబట్టి వాటిని సహించుకుని గాలికి యింకా ముందుకి సాగిపోతున్న నోటుని అందుకోవటానికి అతడి చేయి వదలిపెట్టి ముందుకు పోయింది.

అతను ఆదే అదనునుకుని త్వరత్వరగా పారిపోయినట్టుగా నడుస్తూ వెళ్ళాడు,

అతడి పిరికి తనానికి నవ్వుకుని రెండు రూపాయలు తీసుకుంది కానీ అతని ముఖంలో కనిపించిన అహ్యాభావానికి ఆమె మనస్సు చుర్రున కాలి నట్లయింది

"సర్వీసునుండి రిటైర్ పో" అన్నట్లుంది అతడి చర్య.

మనసు కుమలుతున్నట్టయి నిలువలేక అక్కడే కానుగ చెట్టు మొదట్లో కూలబడింది.

ఎదురుగా తాలుకాఫీసులో పండ్రెండు గంటలు కొట్టారు. వీధిలో ఎవ్వరూ తిరగడం లేదు ఆకాశం నిర్మలంగా వుంది. చుక్కల్ని పలకరించుకుంటూ రేరాజు ముందుకి సాగి పోతున్నాడు. మగడు పలకరిస్తే చెక్కిళ్ళలో కెంపురంగు ప్రతిబింబించినట్లు ఒక్కొక్క నక్షత్రం వింత సోయగాన్ని విను వీధిలో విరజల్లుతూ విరాజిల్లుతూ వింతవింత రంగుల కాంతుల్ని వెదజల్లుతోంది.

తన్ను చూచి ఈర్ష్యపడే వారికన్నా ఆశ్చర్యపోతున్న వారిని చూస్తూ ముందుకి సాగుతున్నాడు దక్షిణ నాయకుడిలా.

అందరూ వదిలేసినా నాథుడిని వదలనని రోహిణీ నక్షత్రం మాత్రం వెంటనే వెళుతోంది.

అయితే ఆమెకి ఆతని స్పర్శన సుఖం లేదు.

ఎపుడూ దూరంగా అంటి పెట్టుకుని గూఢచారిలా వెంబడిస్తూ సూడవలసిందే కానీ మరేసుఖము ఆవిడ పొందటం లేదు.

మరీ పూర్వ పుణ్యాంగన కాబట్టి మగడి వెను వెనుక నడవటమే బ్రహ్మాండమైన అదృష్టంగా భావించుకుని సాగిపోతున్నది రోహిణీదేవి.

ఆ వీధిని నిశ్శబ్దం రాజ్యం చేస్తోంది!

కమలకి ఆ అవమానం జరగటంతో మనసులో ఆనందం కుద్దాలించి వేసినట్టయింది.

నిరీక్షణలో ఉన్న ఆనందాన్నంతా కోల్పోయి ఇక యింట్లోకి వెళ్ళిపోదామనుకుని నిశ్శబ్దంగా లేచి నిల్చుంది కమల నిరాశతో.

ఇంటి వేపు మళ్ళీ పోబోతున్న కమలకి దూరంగా "టక్ టక్" మంటూ కర్రల చప్పుడు వినిపించింది. ఎవరో కుంటి వాడు కాస్త వేగంగా వస్తున్నట్టుంది

ఆ శబ్దాన్ని బట్టి వచ్చేవాడు ఉద్ధృతంగా వస్తున్నట్టు గమనించి ఆగిపోయింది కమల. వ్యభిచారాచారానికి కుంటి గుడ్డి ముసలి మూగ ఇత్యాది తరతమ బేధాల్లేవు హోటళ్ళలోకి 'కుష్టురోగులు రాకూడదు' అన్న బోర్డు ఉంటుంది కాని "మాంసనీ మాన విక్రయశాల" లలో మాత్రం అలాంటి నిషిద్ధాలు లేవు

కమలలో జవసత్త్వాలు ఉడిగి పోబోతున్నాయ్. తన యవ్వనం మీద తనకే నమ్మకం లేకుండా వుండేది. ఇన్నాటి వరకూ. తనకీ ఈ వీధికీ యింత దూరమే అవుతుందా అనుకు

నేది. మూడు సంవత్సరాలుగా రేయిబవళ్లు రక్తాన్ని యవ్వనాన్ని ధారపోసినా తను ఏనాటికానాటికి తిండెంత సంపాదించు కుందే కాని నిలువ జేసుకునేటంత అదృష్టానికి నోచుకోలేదు. దౌర్భాగ్యురాండ్రయిన స్త్రీలు దురాశా వ్యామోహితూరాండ్రై విలాసాలకి వినోదాలకి ఆలవాలమనుకుని ఏదో పెన్నిధి సంపాదించవచ్చనుకుని ఈ రంగంలోకి జొరబడు తున్నారు. కానీ తన అనుభవంలో అవన్నీ మిధ్యాబింబాలూ, మృగతృష్ణలూ మాత్రమే నని ఋజువు చేసుకుంది.

యమ మహిషగళ శోభిత ఘంటా నినదాలు తనకి దూర దూరాన వినిపిస్తున్నట్టుంది. అనారోగ్యం యింతవరకూ తన్నంటకున్నా ఇకముందు వ్యాధులు ప్రకోపించవచ్చు. ఆ నాటి బ్రతుకు ఊహించుకుంటె నే వొళ్ళంత జల్దరులు పాకినట్ట యింది.

ప్రయత్న పూర్వకంగా ఆ ఆలోచనా సంచనాల్ని దూరంగా పారద్రోలింది.

అజ్ఞాతంగా ఉన్న ఊహలని రేకెత్తించిన ఆ అనామకుడిని మనసారా తిట్టుకుంది. చేతిలోని రెండు రూపాయల కాగితాన్ని చించివేద్దమా అనేటంత కోపం వచ్చింది అతని మీద. కానీ అతనిపై ఆగ్రహాన్ని ఆ కాగితం మీద చూపితే కలిగే ఫలితమంటుంచి – దాని విలువ తెలుసు కాబట్టి ఊరుకుంది.

కళ్లల చప్పుడు దగ్గర కావటంతో ఆలోచనల్ని బలవంతంగా పారద్రోలి ఎదుటి వ్యక్తిని పరీక్షగా చూచింది, కానీ అతని రూపం ఆమెకు ఆ మసక చీకటిలో అంతు చిక్కటం లేదు.

ఎదుటి వ్యక్తి ఏమీ మాట్లాడకుండా నిర్లిప్తంగా ఆమెవైపు అతన్ని తేరిపార జూచింది. ఎక్కడో స్మృతి గట్టిగా కొట్టి నట్లయింది. హఠాత్తుగా నిద్రలో అర్ధాంతరంగా మేలుకని విపరీత పరిణామం చూచిన వ్యక్తిలా నిరుత్తరయై బిత్తర పోయింది

"బాబుల్ ... బాబుల్ ... బాబుల్"

గొణుక్కుంది

ఎదుటనున్న స్త్రీ ఏమీ అనకుండా మౌనంగా నిల్చుని తేరిపార చూడటం తనలో తను ఏదో గొణిగినట్లు అనుకోవ టం చూచి ఆ వ్యక్తి కొంచెం సందేహపడి "ఎవరూ...... ఊ......" అన్నాడు.

కమలలో కనుగొనలేనంత మార్పు కనబడుతోంది.

"నేను... నేను... బాబుల్..." అంది.

కమల స్వరూపం మారిపోయినా కంఠస్వరం మార లేదు. చిరపరిచితుడైన బాబుల్ గుర్తించాడు.

"ఓ... కమల... కమలా... ఇదేమిటి కమలా యిం తగా మారిపోయావ్. అసలు నిన్ను గుర్తుపట్టటమే కష్టమై పోయిందే. రూపం మారింది. వేషం మారింది. ఆనాటి పావడా లేదు పరికిణీ లేదు. చక్కని ముత్తైదువలా చీర సింగారించావ్. రవిక తీరుకూడా మార్చేశావు. ఓహో ముఖంలో కుంకుమ బొట్టు కూడా దిద్ది తీర్చావే! చాలా మారి పోయావ్."

అతని మాటలు విని నవ్వుకుంది కమల.

"అబ్బ! ఎన్నాళ్లకి వచ్చావు బాబుల్! చాలా చిత్రంగా మారిపోయావా. అవున్లే! లోకమే చిత్రంగా మారిపోతోంది. రాజకీయాల్లోనే కాక సామాన్య మానవ జీవితంలో ఇంత మార్పు వచ్చిందని అనుకోలేకుండా ఉన్నాం. ప్రజలంతా మారిపోయారనుకో. వ్యభిచారాన్ని మంచితనంగా మార్చాలని పెద్దపెద్ద వాళ్లు మా దగ్గరికి వచ్చి బతిమాలి బంగపోతూ భంగపడనట్టు నటిస్తున్నారు. ఎన్నో వేషధారణయినా అచ్చు కుల స్త్రీలా వుంటే బావుంటుందన్నారు. సరే యిదో ఆకర్షణ లెమ్మనుకుని మార్చేశాం" అంది బలవంతంగా వస్తున్న నవ్వుని ఆపుకుంటూ గతరాత్రి ఓ పిల్ల రచయిత చెప్పిన మాటలు నెమరు వేసుకుంటూ.

అతడు ఆశ్చర్యపోయి అన్నాడు.

"చాలా పెద్దపెద్ద మాటలు మాట్లాడుతున్నావే ... అవునుగానీ కమలా. ఇంకా ఇక్కడే నుల్చున్నావేం లాభం లేదు. అలా కూర్చుందాం పద... నేనెక్కువసేపు యిలా నిల్చోలేను."

తన అవివేకానికి సిగ్గుపడుతున్నట్టుగా నటిస్తూ నాలిక్కొరుకుని "చూడు! చూడు! నేనెంత తెలివిమాలినదాన్నో నిన్ను ఇందాకట్నించీ నిలబెట్టే మాట్లాడుతున్నా! అలా కూర్చుందాం రా" అంది ఇంటి ముందున్న బండమీదే చతికిలబడ్డారిద్దరూ! అతన్ని యింట్లోకి తీసికెళ్ళటం యిష్టం లేదు ఆమెకి!

"ఓ యబ్బో! వాడే యింట్లో చూస్తే యింకేమైనా వుందా" అనుకుంది. బాబుల్ కి కాస్త దగ్గరిగా జరుగుతూ అడిగింది.

"అవును గానీ బాబుల్! నీ ఈ అవతారమేమిటి?

అసలు నీ కాళ్లు ఎలా విరిగిపోయాయ్? చెప్పనే లేదు?..." నిట్టూరిస్తూ ఆకాశంలోకి శూన్యాంగా చూస్తూ అన్నాడు.

"అదంతా ఓ పెద్ద కథలే! కమలా! ... చెప్పాలంటే చాలా రాత్రి అవుతుంది..."

తాలూకాఫీసులో ఒంటిగంట కొట్టారు.

"అబ్బ అప్పుడే ఒంటిగంట అయిందే!"

స్వగతం లాగా అనుకుంది కమల.

బాబుల్ వేపు చూస్తూ నిష్ఠూరంగా అంది,

"పోనీ అంతగా చెప్పటం యిష్టం లేకపోతే మానెయ్! కానీ యిన్నాళ్ళ బట్టి ఎక్కడున్నావో? ఏం చేస్తుండినావో? చెప్పాదూ?"

ఏదో చెప్పటానికి నాందిలా ప్రారంభించి అన్నాడు బాబుల్. అతనికి కమలతో చాలా అవసరం వుంది. అది తీరే వరకూ ఆమెని కాస్త దువ్వాలి! లేకుంటే అది నిష్ఠూరంగా మారిపోతే అతని పని సున్నా అవుతుంది.

"ఎక్కడో ఎక్కడ! విజయవాడలోనే వుండిన్నాను. అక్కడే జరిగిందిలే యిదంతా!" నెమరు వేసుకుంటున్నట్టుగా చెప్పసాగాడు.

మనసులో ఏదో లెక్క వేసుకుని

"నేను యిక్కడనుంచి వెళ్ళిపోయి రెండు నెలలు దాటింది కదా?" అన్నాడు.

"ఊఁ..."

"ఇక్కడి నుంచి నేరుగా గుంటూరెళ్ళాను. అక్కడేమీ గిట్టుబాటు అయ్యేట్టు లేక పోయింది మన బేంలో! ఏదో ఓ వారం రోజులున్నా తిండికే కనాకష్టంగా జరిగింది. పైగా వూరికి క్రొత్తేమో ఎవడిని పలుకరించినా ఉద్యోగానికి సర్వీస్ లేకుంటే ఎలా పనికి రాదంటారో అలా చూచి చేయి విదిలించేవారు. మన అనుభవం వాళ్ళకేం తెలుసు" నవ్వింది కమల.

"నవ్వుతావేం కమలా! సరే! అక్కడి నుంచి విజయవాడ వెళ్ళాను. భుక్తి కోసమై పగలంతా అమ్మవారి గుడిదగ్గర గడవటం రాత్రిళ్లు వీథులెంట తిరగటం! యిదేపని! సినిమా హాళ్ళ చుట్టూ తిరగటం! పని సరి చేసుకోవటం! అక్కడ బాగానే గిట్టుబాటు అవుతుండేది."

ఏమిటన్నట్టు చూచింది కమల.

"ఏమీ లేదులే! ఓ రోజు – చాలా దురదృష్టకరమైన

రోజు_" లీలామహల్ వేపు వెళ్లాను. నేల టికెట్లు యిచ్చేచోట ఎవరో పెద్ద టికెట్లు కొంటూవుంది. నన్ను చూచి నవ్వింది. నిజానికి నిన్నుచూచి కాదులే! నా వెనక ఎవడో దాని వాడు వుండినాన్నాడు. పిట్ట పలుకుతోన్నట్టుందే అనుకుని దగ్గరగా వెళ్ళాను అలా అలా తిరిగి. దగ్గరికి వెళుతూనే కొరక్కొగ చూచినట్టు చూచింది.

నాకు వళ్లు మండింది. ఎలా శాస్తి చేయాలా అనుకుని తేరిపార చూస్తే మెడంతా ధగధగ లాడుతోంది నెక్లెస్‌తో. ఎలా కొట్టెయ్యాలి? చుట్టూ జనం చాలా వున్నారు. ఎలా? ఎలా? అనుకుని ఎలాగైతేనేం నెలలో ఎక్కడ కూచున్నదీ చూచి గుర్తు పెట్టుకుని బయటికి వచ్చాను.

దగ్గర్లోనే ఓ గుడిసెలో ఓ చిన్నది వుండిందిలె! దాంతో మచ్చిక అయింది. అక్కడికి వెళ్ళి చీర కట్టుకుని ఆడదాన్లా సింగారించుకుని-

మధ్యలో అడ్డొస్తూ అంది కమల.

"ఎలా అయ్యావ్. చీర, రవిక సరే! జుత్తు ..అదీ..." నవ్వాడు బాబుల్.

"అవన్నీ ఆడవాళ్ళ దగ్గర వుంటాయిలే! ఎవడైనా దగ్గరున్నప్పుడు మామగారు దాడిచేస్తే ఆడవేషం వేసి రక్షిస్తారు. ఆ! అదిపోనీ... టికెట్టు తీసుకుని హాల్లోకి వెళ్ళి దాని పక్కనే కూచున్నాను. యింటర్వెల్ వదుల్తారనగా నెక్లెస్ కత్తిరించుకుని లేవబోతోంటే కనుక్కొని కేక వేసి, చేయి

గట్టిగా పట్టుకుంది. తప్పించుకుందామని పరిగెత్తి పారిపోదామని ఎంత ప్రయత్నించినా మళయాళ స్త్రీలా నాగనిచ్చింది కాదు. పైగా చుట్టుపక్కల ఆడవాళ్లు తలాఒక వేటు వేస్తూ కదల నివ్వలేదు. ఇంకేముంది అంతలో ఎవరో పోలీసుల్ని పిలిచారు. పట్టించారు. తన్నుకుంటూ, తిట్టుకుంటూ, చేసిన పనిలోని చాతుర్యానికి మెచ్చుకుంటూ గోడ్డంట లాక్కుని వెళుతూంటే అదను చూచుకుని ఓ పోలీసుని గట్టిగా తన్ని పారిపోయాను. పదిగజాలు వెళ్ళనో లేదో మళ్లీ వాళ్ల చేతికే చిక్కాను కర్మకొద్దీ. స్టేషన్లో వేసి కచ్చ తీరేదాకా చావదన్నారు. తన్నటంలో ఈ కాలి ఎముక విరిగి, కుళ్ళిపోతే ఆపరేషను చేసి తీసివేశారు. అప్పట్నుంచీ జైల్లోనే వుండి నాల్గు రోజుల క్రిందట విడుదల చేస్తే యిట్లా వచ్చాను."

కథకు హఠాత్తుగా ఫుల్‌స్టాఫ్ పెట్టి అడిగాడు.

"అదేదీ?"

"ఎవరూ?" అంది అర్థం కాక కమల

కొంచం కర్కశంగా అసహ్యంగా అన్నాడు.

"అదే సు...జా...తా..."

"ఇంకెక్కడి సుజాత"

"ఏం చచ్చిందా తెగులులిగి" ఆనందంలో అడిగాడు.

"ఛీ! ఛీ! ఎవడివెంటో లేచి వెళ్ళింది. ఇక్కడే వుందట. నేను చూల్లేదనుకో. అయినా అలా అనుకుంటున్నారు" కాండ్రించి ఉమ్మేతూ గుడిసెవేపు వెళ్ళబోయాడు.

"ఆగవయ్యా బాబూ! అక్కడ ఎవరూ లేరనుకున్నావేమో? ఆ కడా యింట్లో వుండే సుశీలవుంది. అదే రోజుకు పావలా అద్దె యిస్తోంది ఆ కొంపలో వున్నందుకు" అంది కమల.

నిశ్శబ్దంగా ఆగిపోయాడు.

సినిమా వదిలారు.

తాలుకాఫీసులో రెండు గంటలు కొట్టారు.

జనం గుంపులు గుంపులుగా వస్తున్నారు.

ఆ జనంలో కలిసి పోయాడు బూబుల్.

ఏ నాడూ సిగ్గుపడని కమల — అతన్ని పిలవాలనుకుని-పిలవటానికి సిగ్గుపడింది.

*　　*　　*　　*　　*　　*

బాబుల్‌కి ఇప్పుడొక సమస్య ఎదురైంది!

ఇంతటి పట్టణంలో అదెక్కడుందని కనుక్కోవటమని! ఏమీ పాలుపోవటం లేదతనికి!

ఆలోచించగా ఆలోచించగా అతడికొక చక్కని ఉపాయం తట్టింది. "తను ఎలాగూ కుంటివాడు. పని చేసుకుని బ్రతకాలంటే చాలా కష్టం. అడుక్కుని తింటే సరి! ఎవరికైనా కుంటివాడని దయ కలుగుతుంది. అడుక్కుంటూ పోతే ఏ ఇంట్లో వున్నా తను కనుక్కోగలడు.. అదేమంత కష్టం కాదు. భలే ఉపాయం" అనుకున్నాడు.

రోజుకి ఆరు వీధులు.

ఉదయం రెండు! మధ్యాహ్నం రెండు!! సాయంత్రం రెండు!!!

రాత్రి ఎనిమిది తొమ్మిది గంటల వరకూ తిరిగేవాడు. ఎలాగూ తిండికి జరిగిపోతూ వుండటంతో పెద్ద యిబ్బందేమీ కలగటం లేదు. పైగా ఒక్కోసారి ఒక్కో పెద్దమనిషి కాస్త డబ్బులు కూడా యిచ్చేవారు. పై ఖర్చుకి వచ్చేవి.

కానీ అస్తమానం అలా తిరగటంతో కాళ్లు నొప్పి పెట్టేవి. శరీరం అలసిపోయేది.

అయినా అతను శ్రమను లెక్కచేయటం లేదు.

ఎలాగైనా సుజాతను కనుక్కోవాలి? అది అతడి ధ్యేయం.

కనుక్కొని?... ఏం చేయాలి??

అది అతడప్పుడే నిర్ణయించుకోలేదు......

ముందు కనుక్కోవాలి?

తర్వాత?... తర్వాత... ఏం చేయాలో

కొద్ది రోజులకి వీధులన్నీ అయిపోయాయి.

కానీ సుజాత అడుగుజాడలు మాత్రం కనిపించటం లేదు ఇక ఒకేఒక్క వీధి మాత్రం మిగిలింది.

ఊరిబయట ఇండ్లన్నీ తిరిగాడు. మిగిలిందల్లా ప్రసాద్ ఉంటోన్న మేడ!

"ఖచ్చితంగా ఆ యింట్లోనే వుండాలి!" అనుకున్నాడు. అందరూ యువకులే వున్నారు. అంతా జల్సారాయుళ్ళ లాగే వున్నారు. తప్పకుండా వుంటుందిలే అనుకున్నాడు.

రమణని, ప్రసాద్‌ని, దివాకరాన్ని చూచాక అతడికి మరీ ధృవ పడింది!

ఆ సంఘటన జరిగాక వాళ్లు నలుగురూ ఏకమై కలిసి పోయారు.

ఉన్న ఆరలూ పొరలూ అన్నీ మాసిపోయాయి.

రమణ రాకపోకలు ఎక్కువయ్యాయ్.

ఆ యింటి ఎదురుగ్గానే మకాం వేశాడు. ఎన్ని రోజులైనా దీని అంతు తేల్చుకోవాల్సిందే అనుకుని!

చాలా రోజులు నిష్ఫలంగా గడిచి పోయాయ్.

అయితే బాబుల్ లాటి వాడికి నిరాశా నిస్పృహాలు లేవు.

పని సాధించాలి!

అదీ ముఖ్యం!

దినం గడిచేసరికి అతడిలో వున్న ప్రతీక్ష ఎక్కువవు తోంది! ఒక్కోరోజు కాలచక్రంలో కలిసి తిరిగేసరికి పట్టుదల రెట్టింపవుతోంది! ఒక్కసారి సూర్యుడు తూర్పునుంచి పశ్చిమా నికి చేరేసరికి నిశ్చయ సాధనకి ధృఢ నిశ్చయం ఏర్పడుతోంది!

ఒకరోజు దివాకరం, ప్రసాద్, రమణా తలుపువేసి తాళం వేసుకుని సినిమాకి బయల్దేరారు.

ఎన్నడూ తాళం వేయగా చూడంది ఆ రోజు చూచాడు బాబుల్. పగలంతా తాళం వేసేవున్నా వాడికి అనుమానం రాలేదు ఎందుకో.

"నిజంగా లేదేమో?......"

అనుమానం వచ్చింది.

అయినా ఆశ పోవటం లేదు.

ఇక్కడ లేకపోతే మరెక్కడికి వెళ్ళినట్టు?

వాడికి చెప్పేవారెవరు?

అయినా వాడి మనస్సుకి తప్పకుండా సుజాత ఇక్కడే ఈ మేడలోనే వుంది అనిపించింది.

మరయితే యిదేమిటి?

అలాగే చూస్తూ ఆలోచిస్తూ కూర్చుని ఉన్నాడు. హఠాత్తుగా తలెత్తి మళ్ళీ ఓ సారి మేడవైపు చూచాడు. తళతళా మెరిసిపోతూ ఓ లైటు వెలుతోంది ఇంట్లో.

'అరే!' అనుకుని ఆశ్చర్యపోయాడు.

మళ్ళీ ఆలోచించాడు

'ఒకవేళ తను పొరబాటు పడలేదు కదా ఏమైనా' అనుకున్నాడు.

"వాళ్ళీ లైటు వేసి వెళ్ళారేమో?"

నిశ్చయం కుదరటంలేదు.

తదేక ధ్యానంతో నిరీక్షించ సాగాడు. వాడి నిరీక్షణ ఫలించిందా రోజుతో!

'మళ్ళీ లైటు ఆరిపోయింది.'

"ఆ చిక్కిందిరా పిట్ట!" అనుకున్నాడు.

"ఎవరో ఇంట్లో ఉన్నారు అనే నిశ్చయానికి వచ్చి, పరీక్ష చేద్దాం అనుకుని లేచాడు.

మెల్లిగా కట్టెలు చంక నెత్తుకుని కదిలాడు ఇంటి ముందుకి వచ్చి.

"అమ్మా ... భిక్షం ... తల్లీ!" దయసేయండమ్మా అన్నాడు. ఎవరూ పలక లేదు.

అయినా వదలకుండా మళ్ళీ పిలిచాడు. మళ్ళీ పిలిచాడు. మళ్ళీ పిలిచాడు. పిలుస్తూనే ఉన్నాడు.

చివరకి తలుపు తట్టుతూ పిలిచాడు.

లోపలున్న సుజాతకి వినుగేసింది.

ఎన్నడూ ఎవరూ భిక్షానికి రారాయింటికి. ఎవరో క్రొత్త బిచ్చగాడు, గుడ్డివాడో. కుంటివాడో లేకపోతే చెవిటి వాడో అనుకుని

"వెళ్ళిరా అబ్బీ! ఇక్కడేం లేదు" అంది

అదే తొలిసారి లోకంతో ఆమె మాట్లాడటం – ఆ యింట్లోంచి – ఇంకేం తేలిపోయింది.

ఖచ్చితంగా "సుజాత... సుజాత..."

తను సుజాత గొంతుక గుర్తు పట్టగలడు ఎన్నేళ్ళయినా ఎక్కడైనా...

త్వరత్వరగా చప్పుడు చేసుకుంటూ వెళ్ళాడు.

చాలా దూరం వరకూ "టక్...టక్..." వినిపిస్తూనే వుంది.

*   *   *   *   *   *

# 13

నలుగురూ మేడమీద కూర్చున్నారు

రౌండు టేబిల్‌కి చుట్టూ రావున్న కుర్చీల్లో సుజాతా

ప్రసాద్ ఎదురెదురుగు కూర్చున్నారు. సుజాతకి కుడివై పున దివాకరం ఎడం వేపున రమణా కూర్చున్నారు.

నలుగురూ చతుర్భుజం భుజల్లా వున్నారు.

నలుగురూ మంటపానికి స్థంబల్లా వున్నారు.

వాళ్లు నలుగురూ ఆరోజు చాలా ఆనందంగా వున్నారు.

ఆనందానికి ప్రతినిధుల్లాగా, సంతోష మంటపానికి స్తంబల్లా కూర్చుని వున్నారు.

ఆ నలుగురూ కూర్చున్న ఆ మంటపంలో – కూర్చిని మంటపంలో – సంతోషానికీ సౌఖ్యానికీ పెళ్ళవుతున్నది.

సుజాత అడిగింది దివాకరాన్ని.

"ఏమిటండీ! మీరు ఎక్కువగా మాట్లాడనే మాటాడరు. కారణం ఏమిటి?"

జవాబుగా చిన్నగా నవ్వుతూ అన్నాడు దివాకరం.

"అదేం పెద్ద విషయం కాదులెండి. నా కెందుకో కాస్త బెరుకుగా వుంటుంది నా అభిప్రాయాల్ని తెలిబుచ్చటానికి. ఎవరైనా ఎబ్బెట్టుగా వున్నాయంటారనో, అపార్థం చేసుకుంటారనో భయం. అదీ కాక నేను మాట్లాడి సంతోషం పొందేదానికన్నా ఇతర్లు మాట్లాడుతూ వుంటే నాకు సంతృప్తీ సంతోషమూను. నేను మాట్లాడి నలుగురికి విజ్ఞానం వినోదం అంద

జేమ లేమోనని నా స్వశక్తి మీదే నాకు నమ్మకం లేదు. అంచేత ఎవరైనా మాటాడుతూ వుంటే వింటూ అందులోని విజ్ఞానాన్నీ వినోదాన్నీ బాగా ఆస్వాదించగలను. నాకదే యిష్టం కూడా!"

అతడాగాడు తన మాటల్ని విని ఎవరైనా ఏమైనా అంటారేమోనని!

ప్రసాద్ అందుకుంటూ అన్నాడు.

"నిజం దివా! నాకుకూడా ఎక్కువగా మాట్లాడటం మీద ఆట్టే గురిలేదు. ఎక్కువగా మాట్లాడుతూంటే అదే అలవాటవుతుంది. ఆ అలవాటు తర్వాత మాన్పుకోవటం చాలా కష్టం. ఒక్కోసారి ఎవరితోనైనా మాటాడుతోంటే అది అతిగా అవతలి వాళ్లకి అనిపిస్తే మనల్ని గురించి దురభిప్రాయ పడతారు. పైగా ఎక్కువగా మాట్లాడటంతో మన అభిప్రాయాలు ఎక్కువగా వెలిబుచ్చుతాం దానివల్ల ఎక్కువగా మిత్రులు శత్రువులూ ఏర్పడే అవకాశం వుంది. మిత్రుల వల్ల కలిగే లాభం కంటే శత్రువులవల్ల కలిగే నష్టం ఎక్కువైతేనే కష్టం."

రమణ కుర్చీలో అటూ యిటూ కదిలాడు ఏదో చెప్పబోయేట్టుగా వుంది అతని వైఖరి.

దివాకరం ఏదో మాట్లాడ బోవటంతో ప్రసాద్ అడ్డు తగుల్తూ "కాస్తాగు దివా! అతనేదో చెప్పబోతున్నాడల్లే వుంది. అన్నాడు.

అయిష్టంగా కదులుతూ అన్నాడు రమణ

"అదేం లేమలే ప్రసాద్. అతన్ని చెప్పనివ్వండి!"

రమణ వేపు ఒక్కసారి చూసి అన్నాడు దివాకరం.

"నిజానికి చెప్పాలంటే ప్రసాద్... అతిగా మాట్లాడటం ఆరోగ్యకరం కాదు. అతిగా మాట్లాడాలంటే ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఎక్కువగా జరుగుతాయ్. తద్వారా ఆయుక్షీణం అవుతుంది. ఇదీ మన ఆరోగ్య శాస్త్రం చెపుతున్న విషయం"

రమణ అందుకున్నాడు.

"కావచ్చు దివా! అతిగా మాట్లాడుతూ ఆయుక్షీణం చేసికోవటం నేరం కావచ్చు. అయితే ఏమీ మాటాడకుండా ఆయుష్షుని సేకరించటంలో ఆనందం లేదంటాను. బ్రతికే నాల్గు రోజులూ హాయిగా బ్రతకగలిగితే చాలు. నేను కోరేది జీవితంలోని సుఖాల్ని చంపుకుంటూ ఆయుష్షుని పెంచుకున్నందు వల్ల కలిగే లాభమేమిటో నా కర్థం కాదు. అభిమన్యుడిలా బ్రతికేది నాలుగు రోజులే అయినా కీర్తి నిలవాలి. అలా కాకుండా కాకిలా ఎన్నేళ్లు బ్రతికితే ఏం లాభం."

రమణ ఆగాడు విశ్రాంతి తీసుకునే వాడిలా!

సుజాత వైపు చూశారు అందరూ!

సుజాత కుర్చీలోంచి ముందుకు వంగుతూ "కానివ్వండి రమణా!" అంది.

"నిజమే ఎక్కువగా మాట్లాడే వానికి మిత్రులు, శత్రువులూ ఎక్కువే. ఎక్కువ మాట్లాడటంలో నిజం మాట్లాడవలసి వస్తుంది ఒక్కోసారి. అసలు మాట్లాడకుండా వుంటే మన మనస్సులోని అయిష్టతనీ అసూయనీ పెంచుకుంటూ వున్నామన్నమాట. నీకు సరిపోనిది వాలిబుచ్చితే నలుగురూ మెచ్చుకోరని, దాచితో వాళ్ళతో స్నేహం నిలుస్తుందని. కానీ నీలో ఆ అయిష్టత కూడా నిలుస్తుందది. నీకు నచ్చని విషయం ఏదో ఆ నలుగురి ఎదుటా అనే సెయ్యాలి ఫలితం మంచి కానీ, చెడు కానీ—"

కొంచెం ఆగేడు రమణ మళ్ళీ.

సమయమని దివాకరం అందుకుని అన్నాడు.

అతని ముఖంలో కొంచెం కోపం కూడా కనిపిస్తూవుంది.

"అయితే రమణా! మౌనం మంచిది కాదంటావా? వాగ్వ్యాపారం అందులో అతిగా – మంచిదంటావా?"

"నా మాటల్ని అర్థం చేసుకోకుండా అలా కోపం తెచ్చుకుంటే నేనేం చేయను! నేను ఎవర్నీ అభిప్రాయాల్ని మార్చుకోమనను. కానీ అది నా అభిప్రాయమని గుర్తించమని కోరుతాను. నిజానికి చెప్పాల్సొస్తే మాటల్ని దాచుకుని మౌనం పెంచుకుని దానంతోపాటు కోపాన్నికూడా పెంచుకోవటం కంటే నాలుగు మాటలు ఎక్కువగా మాట్లాడి వీలైతే కోపాన్ని చంపుకోవటం చాలా మేలంటాను" అన్నాడు రమణ జవాబుగా.

అయిష్టంగా కుర్చీలో కదులుతూ అన్నాడు ప్రసాద్.

"పోనీవయ్యా! ఈ వాగ్వాదం ఎందుకు? దీనివల్ల లాభమేమిటి? అనవసరపు వాగ్వాదాలు. అయితే గియితే దీనివల్ల అపార్థాలు పెరుగుతాయ్. అందుకే నే వద్దనేది?"

మళ్ళీ అలాగే అంటావేం ప్రసాద్. ఇలా మాట్లాడుకుంటేనే మన అంతర్యాలు బయట పడతాయ్ మనిషి బాహ్యరూపం చూచి కాక ఆంతరంగిక రూపంచూచి గౌరవించాలి. అభిమానించాలి. అంతర్యాన్ని దాచుకునే వాళ్ళని నే సహించలేను" అన్నాడు రమణ ప్రతిగా.

దివాకరం ఏమీ మాట్లాడకుండా ముసిముసిగా నవ్వుతున్నాడు.

"పోనీలేవయ్యా బాబూ! నీలాగే ముక్కుకి సూటిగా నడవాలంటే అందరికీ చేతవుతుందా. ఏమైనా వ్రాస్తున్నావా? గేయాలు కానీ పద్యాలు కానీ గుర్తుంటే చదువు. అన్నట్టు అదేదో క్రొత్త నవల మొదలు పెట్టానన్నావ్. అదేనా ఆ షైలు"

సుజాత సంతోషించింది. ప్రసాద్ విషయాన్ని మారుస్తున్నందుకు.

ఆమెకి యిష్టం లేదు యిలా వాదించుకోవటం.

ఆమెకి తెల్సు రమణ మాటల్లో నిజముందని.

ఆమె పూర్తిగ ఏకీభవిస్తుంది అతనితో.

అయితే అదేమాట బయిటికి అంటే కొంప లంటుకుంటాయి.

అందుకే ఆమె దివాకరం మాటలకి కూడ విలువయిస్తుంది. అదే సమయంలో.

కానీ అందులో ఆత్మద్రోహం వుంటుందేమో ననుకుంటుంది.

రమణ పలకకపోవటంతో మళ్ళీ రెట్టించింది.

రమణ ప్రశ్నార్థకంగా చూచాడు. దివాకరం వేపు. స్నేహం అంతటితో సహజమైగా రమణ సాహిత్యవిషయాలు దివాకరంతో చర్చిస్తాడు. ప్రకాష్‌తో చర్చించడు. ఊరికే చెపుతాడు.

దివాకరం ముఖంలో ఏ భావమూ కనిపించక పోవటంతో సుజాతవైపు చూచాడు.

"చెప్పండి రమణగారు! ఈ లోపల మీరేదైనా గేయాలూ, పద్యాలూ వ్రాశారా? దృష్టికి వుంటె చదవండి" అంది సుజాత సంతోషాన్ని వెలిబుచ్చుతూ.

జవాబుగా అన్నాడు రమణ.

"ఈలోపల ఏమీ వ్రాయలేదండీ. వ్రాసివున్నా జ్ఞప్తికి వుండవులెండి. అసలు నాకు వీళ్ళలాగా జ్ఞప్తికి వుండవు అన్నీను. ఏదో కొన్ని మాత్రం జ్ఞప్తికి వుంటాయ్. గేయంమాట అలా వుంచి ఈ లోపల ఓ నవల ప్రారంభిం చాను. అయితే అదో పదిపేజీలు సాగి ఆగిపోయింది. నాలోవున్న బలహీనతే అది ప్రసాద్. ఏదో ఆవేశంలో ఒక కథో నవలో ప్రారంభించేస్తాను. ఆ ఆవేశం చల్లారక ముందే ఓ అరగంట రచన చేస్తాను దాంతో వ్రాయటానికి కష్టం వేసి ఆపేస్తాను. అయితే ఆ అరగంటలో ఏదో వింత ఊహో, వింతరచనో దొర్లుతుంది. నా రచనలు పూర్తిగా వుండవు. అంచేతే ఒక్కోసారి అనిపిస్తుంది, ఎవరైనా రాసేవాళ్ళుంటే ప్లాటూ ప్లాటుతో పాటు ఆ పదిపేజీలు అప్పగిస్తే వాళ్ళే చక్కని నవల వ్రాసుకుంటారని. కానీ నాకు భయం, బిడియం, అధికం.

సుజాత అందుకుంటూ అంది

"అయితే రమణగారూ! మరి మీరిప్పుడు వ్రాసే నవల్లో ఏదో వింత సంఘటన వ్రాశానన్నారే అదేదో చదువుతారా?"

రమణ కాస్త సిగ్గు పడ్డాడు.

మెల్లగా నవ్వుతూ అన్నాడు

"ఎందుకు లెండి! మీరంతా నవ్వుతారు"

"అరే! అలాగంటావేం రమణా! చదువు అలేదో. నీతో ఏకీభవించలేకన్నా నీ గేయలూ అవీ చదివి ఆనందించి అందులో ఉన్న వైచిత్ర్యాన్ని మెచ్చుకోవటంలేదూ! ఎందుకు గేలి చేస్తాం? అదేం మాట" అన్నాడు దివాకరం.

'మరీ వింతగా చూస్తారేమోనని భయం ప్రసా... కాకుంటే మీకు చెప్పక ఎవరికి చెప్పుకోగలను?"

రమణకి ఆనందం ఎక్కువైతే ప్రసాద్‌ని ప్రసా అంటాడు.

"అసలు వింత వింత అంటూ వింతగా చూస్తారంటా వేమిటోయ్. వింతైంది వింతైనదేమిటి?" అన్నాడు ప్రసాద్.

ఇక తప్పదనుకొని యిలా అన్నాడు రమణ.

"సరే మీరు వదలరని నాకు ముందే తెలుసు. కాని మానవ యత్నం.

నాకు ప్రత్యేకమైన రచనా విధానం యిష్టమని మీకు తెల్సుగదూ. ఈ నవల ప్రారంభిస్తూంటే ఎందుకో దేవుడంటే ఎలా వుంటాడా? అనిపించింది.

సరే ప్రారంభించి యిలా వ్రాశాను...వ్రాశాననా? ... అదే వ్రాయబడిందో?"

ఆగి ఫైలు తెరచి చదవ సాగాడు.

"ఆంధ్రదేశంలో ప్రఖ్యాతిగాంచిన ఓ పట్టణంలో ఒకసారి ఓ వింత జరిగింది. అదేమిటంటే ఆ పట్టణానికి కొత్తగా ఓ వ్యక్తి వచ్చాడు. అయితే అతను సామాన్య మానవుడిలా లేడు. ఇంత వరకు ఈ ప్రపంచంలో వున్న, వుంటున్న, వుండబోతున్న మానవుల్లో ఎవరికీ పోలిక లేదు. వుండదు. వుండబోదు. ఏ మానవుడిని చూచినా అతని కంటె ఓ విశిష్టలక్షణం ఈ వ్యక్తిలో కనిపిస్తుంది. ప్రతి వానికి అతన్లో ఓ విశేషం, ఓ విలక్షణం, ఓ గొప్పదనం, ఓ వింత శక్తి చూస్తూనే నమస్కరించాలనే ఊహ కల్గుతుండేది. శారీరకంగా కూడా అతను ఏ వ్యక్తికీ పోలటం లేదు.

ఇలా అతన్ని గురించి రకరకాలుగా ప్రచారాలు సాగాయి. ఎవ్వరూ అతని దగ్గర చేరటానికి గానీ, మాట్లాడటానికి గానీ యత్నించడం లేదు.

ఓ రోజున అంటే ఆ పదిహేను అయిదారు రోజులు పూర్తికాకముందే ... ... ఆంధ్ర దేశంలో వింతలు వ్యాపించడం చాలా తొందర కదూ ... మూలానవున్న ఓ మహానగరంనుంచి ఓ రచయిత వచ్చాడు ఈయన్ని చూట్టానికి. సరాసరి రావటం రావటం ఆ వింత వ్యక్తి దగ్గరకే వెళ్ళాడు. వెళుతూనే ఎగాదిగా చూస్తూ ప్రశ్నించాడు.

"నమస్తే! మీరెవ్వరు? ... దయచేసి చెప్పండి."

నిజానికి అతనితో మాటాడిన తొలివ్యక్తి ఆ మహారచయిత.

ఆయన కూడా యితన్ని పరీక్షగా చూచి నవ్వి అన్నాడు.

"నీ వెవ్వరయ్యా!"

ఆ పలుకదనం విలక్షణంగా వుంది.

ఉచ్చారణ ఆంధ్రుల ఉచ్చారణకి దగ్గరగా ఉంది రాయలసీమ ప్రాంతం వ్యక్తి బదులు పలికి నట్లుంది. కానీ కోయిల కూసినటుంది. అచ్చంగా కోయిల పలకటం నేర్చితే అలా పలికేదేమో ననిపిస్తుంది.

రచయిత దుడుకుగా అన్నాడు

"అయితే మీరు రాయలసీమ ప్రాంతం ఆంధ్రులన్న మాట" బదులుగా కొంటెగా నవ్వుతూ అన్నాడా వ్యక్తి.

"అని నేనన్నానా? ఏ భాషలు మాటాడితే ఆభాషకి. చెందిన తెగవాడై వుంటాడని అర్థమా? అందునా పలికే తీరుచూచి ప్రాంతనిర్ణయం కూడానా?"

బిత్తరపోతూ అన్నాడు రచయిత.

"సరే నేనో రచయితని. దయచేసి మీరెవ్వరో చెప్పండి"

" నేను ఓ మానవుడిని"

" అది తెలుస్తూనే వుంది...ఎక్కడనుంచి వస్తున్నారు"

"నేను ఎక్కడనుంచి రావడమేమిటయ్యా నేనిక్కడే వున్నాను. నీవే అక్కడో ఆ మహానగరంనుంచి వచ్చావు"

ఆ రచయితకి అతని చమత్కారం ముందు ఆగటం కష్టమనిపించింది.

"నిజమేలెండి! నేను అక్కడినుంచి ఇక్కడికి వచ్చాను. మీరు ఎక్కడనుంచి యిక్కడికి వస్తున్నారని నేను అడుగుతున్నాను' మీరు మనసు విప్పి మాట్లాడండి ప్లీజ్"

" ఛీ! ఛీ! ఆ భాష అక్కర్లేదు..."

రచయిత నొచ్చుకుంటూ అన్నాడు. " మన్నించండి' ఈనాటి తెలుగు దేశంలో పల్లెటూరి ఆడవాళ్ళు మొదలుకొని కొంచానికి కొంచమైనా ఇంగ్లీషు పదాలు వాడని వాళ్ళు లేరు. భాషా సాంకర్యం ఏర్పడింది...ఆ యింతకీ మీరు ఎక్కడనుంచి వచ్చారో చెప్పనేలేదు"

జవాబుగా అతను చేతులు పైకెత్తి చూపాడు.

రచయిత వెంటనే అన్నాడు.

"అంటే ఆకాశంనుంచి ఊడి పడ్డారనా? లేకపోతే తెలీదనా?

" నేనేమీ అనటం లేదయ్యా! అన్నీ మీరే అంటున్నారు కదా? "

" ఏమని "

"ఏమయ్యా ఇంతటి రచయితవి? ఏమని ఏవరెవరన్నారో నీకు తెలీదు. మహాకవులంతా నన్ను గురించి అనందే రచనే సాగించలేదే. అది చదవలేదా? ఆమాత్రం కూడా జ్ఞానం లేనివాడివి నీవేం రచయితవి? "

ఆశ్చర్య సంభ్రమాలతో కసిగా వింతగా అన్నాడు.

" అయితే! అయితే! మీరు దేవుడా! "

"అనుకో..." తాపీగా అన్నాడు నవ్వుతూ.

రచయిత నివ్వెరపోతూ అన్నాడు

'మిమ్మల్ని గురించి మీకే తెలీదా? ఇదేమి టన్యాయం'

"ఓయి నాయినా? తన్ను తాను తెలిసికోవడమంటే మాటలా! 'అహం' అన్న పదానికి అర్ధమే యింకా నిర్ధారణ కాలేదోయీ!!...అయినా మీరందరూ అనుకుంటున్నట్టు... అంటున్నట్టు నేను దేవుడనే అనుకో......"

" సరే! ఇంకేం! మీకు వేదాంతం కూడా తెలుసన్న మాట. అదేం మాటలే. దేవుడన్నాక అన్నీ తెలుసుండాలి కదా! అయినా వినండి. దేవుడు అన్న శబ్దం చాలాచిత్రమైంది కదా! 'దివ్ ' అనే ధాతువునుండి పుట్టింది ఈ శబ్దం. 'దివ్ ' అనగా ప్రకాశించుట కదా? మరి మీరేమీ ప్రకాశించటంలేదే!'' అన్నాడు ఏదో ఆతన్లోవున్న లోపాన్ని ఎత్తి చూపుతున్నట్టుగా.

ఎదురుగావున్న వ్యక్తి నవ్వాడు.

వెంటనే అతని కళ్ళకి ఏదో జరిగినట్లయింది. ఆ ఎదుటి వ్యక్తిలో వేయి దీపశిఖలు వెలుగుతున్నట్టు కనిపించింది. ఆ వెలుగుని చూడలేక కళ్లు మూసుకున్నాడు.

" ఏం నాయనా కళ్లు మూసుకున్నావ్? అన్నాడాయన మళ్ళీ నవ్వుతూ. తిరిగి అతన్లో భాసించిన ఆ వెలుగుకి సంబంధించిన విజ్ఞానం మళ్ళీ మరుగున పడినట్లయింది.

"సరే పోనిండి ఎందుకైనా గానీ మీ పేరుకూడా సెలవిస్తారా? '' అన్నాడతను.

చిరునవ్వు చిందిస్తూ చిద్విలాసంగా చిన్మయానందంగా అన్నాడు

" పేరులో ఏముందిలే నాయనా! ఏదైనా కావచ్చు. రాముడనుకో! కృష్ణుడనుకో!! లేదా రామకృష్ణుడనుకో!!!

ఎలా అనుకున్నా ఎలాపిల్చినా పలుకుతాను. నీ మనస్సుని బట్టి వుంటుందా పిలుపు. పిలుపు తలపు ఏకమైతే పిలచిన తడవుగా పలుకుతాను'' రచయిత నవ్వాడు.

''అయ్యా చాలా చమత్కారంగా చెపుతున్నారు. అన్నీ దశావతారలు ఎత్తిన వాడిలాగా చెపుతున్నారు. అవేనా లేక మరేమీ లేవా మీకు పేర్లు.''

ఎదుటి వ్యక్తి బిగ్గరగా నవ్వాడు.

''ఏమైనా నా ఎదురుగా గట్టివాటవే వచ్చావు. అయితే విను. నీపేరేమిటి? ఏదో లే! ఆ దానితో నాకేంపని. ఈ దేశంలో ఇంకా మంచి మంచి కవులున్నారు కదా? వారందరి పేర్లు ఒకటేనా? కాదుగదా! కానీ అందరూ రచయితలే. వాళ్ళలో వైవిధ్యం వుంది. అలాగేనా పేర్లు.వేరైనా అక్కడక్కడా వైవిధ్యమున్నా అన్నీ ఒకటే!''

మాటలు విరిచి అర్ధంమార్చి ఆడునచేసే చమత్కారానికి ఆయన ధీవైశాల్యానికి రచయిత ముగ్ధుడయ్యాడు.

''మరి మీ రూపం కూడా వింతగా చెపుతారే. దాని సంగతో ?'' అన్నాడు.

జవాబు కోసమై అతని వైపు చూశాడు.

అతనిలో సకల పర్వతాలూ, సకల జంతువులూ, సర్వమానవులూ, చరాచర ప్రపంచం అంతా కనిపించినది.

భ్రమ పడుతున్నానా అనుకుని కళ్ళు నులుముకుని చూచాడు.

ఎదురుగా ఏమీ కనిపించలేదు.

సామాన్య మానవుడిలా అతను కనిపిస్తున్నాడు.

అంతే కదా ? మరి చూచిందేమిటా ? అనుకున్నాడు.

అంతే !

మళ్ళీ ఇతః పూర్వంలాగా సర్వ భూగోళం కనిపించింది.

రచయితకి మాటలు రాలేదు.

ఏమయ్యా ! మహాకవీ !! కళ్ళు అంతలేసిగా చేసి చూస్తున్నావు. నాలో ఏం కనిపిస్తోంది నీకు'' నవ్వుతూ అడిగాడు.

మళ్ళీ మామూలు వ్యక్తి అయ్యాడు రచయితే.

" ఏమీ లేదండి ! నేనేదో భ్రమ పడుతున్న ట్లున్నాను. ఒకోక్క సారి ఒకోక్క విధంగా ఏదో భాసి స్తోంది. తక్షణమే మళ్ళీ అది నశిస్తోంది. ఏమిటీ మాయ ?"

" ఆయనేమీ జవాబివ్వకుండా వెళ్ళిపోయాడు"

చదివే కాగితంమూసేస్తూ "అక్కడికి ఆగిపోయింది. ఎందుకు వ్రాశానో తెలియదు. ఎలావ్రాశానో కూడా తెలియటం లేదు. ఎలా ఆగిందో తెలీటంలేదు. ముందేం

వ్రాయాలో తెలియటంలేదు. ఎవరితోనన్నా చెపితే వింతగా చూస్తారని నవ్వుతారని భయం. అందుకే ముందుగా అంతగా తట పటాయించటం'' అన్నాడు రమణ.

అందరికన్నా ముందుగా సుజాత చాలా ఆవేశంతో ''చాలా బాగా వ్రాశారండి. దేవుడంటే మనకున్న అన్ని అభిప్రాయాల్ని వెలిబుచ్చారు అందులో. ఇంతవరకు ఎవరూ యిలా వెలిబుచ్చారు కారు'' అంది.

''అదే కద నా బాధ. అసలు దేవుడంటే నాకా అభిప్రాయంలేదు. నేను అన్నదాని కంటే మనసులో దాగి ఉన్నదే ఉత్తమమైందిగా భావిస్తాను. నా ఉద్దేశ్యం లేకుండా అలా ఎలా రచన సాగిందో యిప్పటికీ నా కర్థం కావటంలేదు.'' అన్నాడు ఏదో వ్యక్తంకాని బాధని అవ్యక్తంగా వక్త పరచటానికి ప్రయత్నిస్తూ.

''అందుకేరా అంత చక్కగా వుంది. దేవుడే నీకా ఊహ పుట్టించి వుంటాడనుకో'' అన్నాడు ప్రసాద్.

అదిగో మళ్ళీ మనం మొదటికే వస్తున్నాం. దేవుడు ఊహ పుట్టిస్తే, నేను రచయిత ననటం ఏమిటి? నా గొప్పదనం ఏ మేడ్చింది? ఎవరో నిర్దేశిస్తే ఏమిటో వ్రాస్తే అందులో ఉన్న గొప్పదనం ఏమిటి?'' అన్నాడు రమణ.

దివాకరం అందుకుంటూ అన్నాడు నవ్వుతూ.

''దేవుడి గొప్పతనమే నీ గొప్పదనమోయి! నీవు చేయ

కవిత్వం వ్రాస్తూ చాలా చక్కగా వ్రాశాననుకున్న రోజున నీ కలాన్ని ముద్దు పెట్టుకుంటా వెందుకు? ఏం కారణంచేత బాబూ? నీ కలం వ్రాసిందా? నీవు వ్రాశావా? నీ కలంతో నీవు వ్రాసి ఆకలంవల్ల నీవు అలా వ్రాశావని భ్రమపడి ఆనందంతో దాన్ని ముద్దెట్టుకున్నావ్ అలాగే యిదీను. నీవు దేవుడయితే నీ కలం నీ వవుతావు. కలాన్ని నీవు మెచ్చుకున్నట్టు యితర్లు నిన్ను మెచ్చుకుంటారంతే! దేవుడు లేడనుకోవటం పొరపాటు!"

రమణకి చాలా చక్కగా నచ్చిందది. కానీ ఎందుకో అంగీకారం తెలపలేదు.

ప్రసాద్ సుజాతలు యిద్దరూ ఒకే సారి అన్నారు.

"నిజం దివాకరంగారూ! మీరు చెప్పింది చాలా సమజసంగా వుంది"

దివాకరం ప్రశ్నార్థకంగా రమణవైపు చూశాడు.

అతని కళ్ళల్లో తృప్తి తాండవిస్తోంది.

రమణ ప్రసాద్ చేయి తీసుకుని టయం చూస్తూ "అబ్బ! అప్పుడే తొమ్మిదయిందే! వెళ్దామా యిక అన్నాడు" దివాకరంవేపు చూస్తూ.

కాస్త ఆగమన్నట్టు సైగచేసి సుజాత వేపు తిరిగి అన్నాడు ధివాకరం.

"ఓ చిన్న కోరిక సుజాతగారూ!"

"ఏమిటి?"! అంది సుజాత నవ్వుతూ

మెల్లగా అన్నాడు దివాకరం

"ఓ పాట పాడండి"

"అబ్బే! ఏం పాటల్లెండి! ఏం బాగా పాడతానని మరీ మరీ అడుగుతున్నారుమీరు"

ప్రసాద్ అన్నాడు

"కాదు సుజాతా! నీ మాధుర్యం నీకు తెలీదు. నీపాట మాలో ఎంత ఆనందాన్ని ఉత్పత్తి చేస్తోందో నీకు తెలీటంలేదు నీ గానమాధుర్యంలో మమ్మల్ని మేం మరచిపోతాం"

సుజాత నవ్వుతూ హాస్యంగా అంది

"ప్రమాదమండోయ్! మనిషి ఎన్నడూ తనని తాను మరచి పోకూడదు."

ఇక అంతగా బ్రతి మాలించుకోవటం బావుండదని మెల్లిగా లేచింది. కిటికీ దగ్గరకి వెళ్ళింది.

ఆకాశంలో చంద్రుడు దేదీప్యమానంగా వెలిగి పోతున్నాడు. రోహిణీ చంద్రులు వివాహవేళ తలంబ్రాలు పోసుకుంటే చెల్లా చెదరై వివాహ మంటపం నిండా పడి తళ తళా మెరిసి పోతున్న ముత్యాల్లా వున్నాయ్ నక్షత్రాలు.

వెన్నముద్దని మ్రింగు దామని నల్లని ఆకారంతో మేఘ మాలలు త్వరత్వరగా పరిగెడుతున్నాయ్. ఎంతైనా అవి నల్లనివే కాని నల్లనయ్యలు కావుగదా? వెన్నముద్ద ఏలా దొరుకుతుంది? ఎలా మింగుడు పడుతుంది.

పందెంలో పరుగెడుతూ చివర్న గోల్ దాటి అవతలికి వెళ్ళిన ఆటగాడిలా తొందర్లో మేఘాలు చంద్రుడిని దాటి వెళుతున్నాయ్.

మనస్సు ఆహ్లాదంగా ప్రశాంతంగా వుంది.

కిటికీ దగ్గర్నించి కదలి వచ్చింది.

కూజాలోంచి గ్లాసులో నీళ్ళు వంచుకొని

"మీకూ కావాలా" అంది,

అక్కర్లేదన్నట్టు తల అడ్డంగా తిప్పారు అందరూ.

వ్యగ్రమనస్కులై ఆమె పాటకై ఎదురు చూస్తున్నారు.

కుర్చీలో కూర్చుని వెనక్కు వాలింది.

మెల్లగా మంద్రస్వరంలో ప్రారంభించింది.

"యాంరమితా వనమాలీ..."

జయదేవుని కృతులకి యిప్పుడు సృష్టించే సమ్మోళనమే అద్భుత మనుకుంటాము అంతా.

స్వయంగా జయదేవుడు- పద్మావతీ చరణ చారణ చక్రవర్తి- ఆమె లాస్యం చేస్తోంటే ఎంత మధురాతి మధురంగా గానం చేసేవాడో చిత్రించినవారు లేరు. అది కలానికి అందనిది.

సుజాత పాడుతోంది.

ఆమె సహజ మృదు మాధురీ గాన సుధా స్రవంతిలో వాళ్ళు తేలియాడుతున్నారు.

ఆమె యిలా గానం చేసిందని నా కలం స్పష్టంచేయ లేకుండా వుంది.

గాన ప్రవాహంలో పది స్వప్నలోక తీర ప్రాంతపు భూములకి వెళ్ళి వచ్చారు వాళ్ళు నలుగురూ

సాహిత్య భోజనం పెడితే తృప్తి చెందుతారు మానవులు కొంత సేపటికి కాకున్నా మరికొంత సేపటికైనా-

కానీ సంగీతం భోజనం పెట్టడం ప్రారంభిస్తే గృహస్తు ఇక లేదంటే అనవలసిందే తప్ప అతిథి మాత్రం ఇక చాలు అన లేడు- ఆ సంగీతం సుమధురమై శ్రావ్యమైతే.

పాట ఆపటంతోటే రమణ అడిగాడు ఉత్సుకతతో.

"అదే సుమధుర గాత్రంతో హారిరిహా ముగ్ధ వధూనికరే పాడండి".

నవ్వింది సుజాత.

ఎందుకు మళ్ళీ మళ్ళీ ప్రతిమాలించుకోవాలని పాడటం ప్రారభించింది. ఆ రాసక్రీడ ప్రతిపద మధురంగా కీర్తించిన కవి చంద్రుడూ, రసోచితంగా పాడుతోన్న ఆ గాయనీ యిద్దరూ ధన్యులయ్యారు. వింటున్న శ్రోతలుముగ్ధులయ్యారు.

పాట ముగిశాక అన్నాడు రమణ నవ్వుతూ.

"నిజంగా శ్రావ్యమైన కంఠం వుండటం ఓ గిఫ్ట్ ముందే ఆడవాళ్ళ గొంతుకలు కాస్త మధురంగా వుంటవి. ఇక ఈ వరం తోడైతే మధురిమ అంతా ముద్ద కట్టినట్టు వుంటుంది. మీరు ధన్యులు సుజాతా. మనపూర్వులు ఓ మాట అంటూ వుంటారు విన్నారా. వెనుక జన్మలో కంచు దానం చేసి వుంటే ఈ జన్మలో కంఠం మాధుర్యంగా వుంటుందని. మీరు కాస్త ఎక్కువగా కంచుదానం ఎవరికో చేసినట్టున్నారు. అందుకే ఈ అపూర్వమైన శ్రావ్యత."

వాళ్ళ ముగ్గురి ముఖాల్లో లెక్కించ లేనంత ఆనందం తాండవిస్తోంది. ప్రసాద్ నవ్వుతూ అన్నాడు చమత్కారంగా.

"ఇంకెవరికయ్యా నాకే అయివుంటుంది బహుశా! అంచేతే నాకంఠంలో మాధుర్యం బొత్తిగా లేకుండాపోయింది. పూర్వం కంచుయిచ్చి కంఠం తీసుకుంది. అందుకే యిప్పుడు తిరిగి ఆ కంఠాన్ని యిచ్చేస్తోంది. ఇక ఈ జన్మలో నేనివ్వాలి కంచు ఈవిడికి" ఫక్కున నవ్వారు యిద్దరూను.

సుజాత మెల్లిగా అంది

"చిన్నవాళ్ళని పొగిడితే ఆయుక్షీణం"

దివాకరం జవాబుగా అన్నాడు

"నిజమే. పొగిడితే ఆయుక్షీణమే! కానీ ఉన్న విషయం చెప్పటం పొగడటం కాదు. వాస్తవాన్ని దాచటం ఆత్మ ద్రోహం కాదా? నిజం సుజాతగారూ మీ కంఠంలో ఏదో తెలియని ఆనందం వుందండీ! మనస్సుని ఊపే శక్తి వుంది. మనస్సుని కట్టి వేస్తుంది. ఒక్కసారి మూర్ఛ పోగొడుతుంది. మద్యం తాగినట్లు మత్తుగా వుంచుతుంది. ఆ కంఠంలో ఆ శక్తి ఏదో నాకు చెప్పటానికి, భావానికి అందటంలేదు. ఇదే కాబోలు భావకి అందని భావం అంటారు"

నిజంగా వాళ్ళ మాటలకి నొచ్చుకుంటూ అంది.

"మీరింతగా పొగడుతున్నారు. మీ పొగడ్తకి అర్హురాల్ని కాదు. నిజం ఇంకా ఎందరో మహానుభావులు. నాకంటే చక్కగా పాడేవాళ్ళు లోకంలో వున్నారు. అలాంటప్పుడు నన్నొక్కతెనే గొప్పదాన్ని చేసి పొగడటం నాకు బావులేదు"

వాతావరణాన్ని తేలిక పరచాలని చూస్తూ అన్నాడు ప్రసాదు.

"అదో ఆమాటే చెప్పుతోంది నేను బాగాపాడతానని నీవు అనుకుంటున్నావని"

నవ్వింది సుజాత.

నలుగురు నవ్వుకుంటూ క్రిందికి వెళ్ళిపోయారు.

దివాకరం రమణా బయటికి వెళ్ళాక తలుపు వేశాడు పరిసాదు. నాల్గురోడ్ల దగ్గర విడిపోతూ దివాకరం భుజాలు ఏదో భావం స్ఫురించేట్టుగా నొక్కాడు రమణ.

దివాకరానికి అర్థం అయింది అతని భావం

గట్టిగా నవ్వుతూ---అన్నాడు

"నీవు మరీ యింత వేలవేం రా!"

మసిముసి నవ్వులు నవ్వుతూ సాగిపోయాడు రమణ. మిత్రుడు వేలతనానికి నవ్వుకుంటూ దివాకరం తనదారిని వెళ్ళాడు. ఇంటికి వెళ్ళాక డైరీలో ఇలా వ్రాసుకున్నాడు దివాకరం.

"ఈ నాడు చాలా ఆనందకరమైన దినం ఎందుకో నాకీ దినం లాంటి దినం మరి జీవితంలో రాదనిపిస్తోంది. అదేమిటి కర్మో యిదే చివరి దినమేమో ఈ ఆనందానికి అనిపిస్తోంది అయినా ఏమిటీ పిచ్చి ఊహాలు? ఏమిటీ మూఢ నమ్మకాలు?" అది చదువుకుని తనలో తనే విచిత్రంగా నవ్వుకున్నాడు దివాకరం.

# 14

హాల్లో గడియారం పది గంటలు కొట్టింది. భోజనం చేస్తున్న ప్రసాద్ త్వరత్వరగా తింటూ "నేను సినీమాకు వెళ్ళాలను కుంటున్నాను సుజాతా!" అన్నాడు గడియారం వేపు చూస్తూ.

ప్రసాద్‌కి ఆరోజు చాలా ఆనందంగా గడిచింది. అతనిలో ఆనందం పురకలు వేస్తోంది. అతనికా ఆనందాన్ని అంత సులభంగా చంపుకోవటం యిష్టంలేదు. ఇంకో రెండు గంటలైనా కనీసం ఆ ఆనదం అతని వెంటే వుండాలి. అందుకే సినీమా ప్రోగ్రాం వేసుకున్నాడు.

"అలాగే వెళ్ళిరండి" అంది సుజాత నవ్వుతూ!

ఆమెకే చాలా ఆనందంగా వుందా రోజు. ఆమెకి ఆనందం ఎక్కువైతే ఏకాంతం కోరుకుంటుంది. అందుకే ప్రసాద్ సినీమాకి వెళ్ళటానికి యిష్టపడింది.

దుస్తులు వేసుకొని చెప్పులు టక టక లాడిస్తూ క్రిందికి దిగి వచ్చాడు. వెంట సుజాత కూడా దిగి వచ్చింది.

సంతోషంగా ఉల్లాసంగా గంతులు వేస్తున్నట్టు తలుపు తీసుకొని బయటకి వెళ్ళి తాళం వేశాడు. కొంచెం దూరం

యీాల వేసుకుంటూ వెళ్ళి హఠాత్తుగా ఆగాడు. చూస్తే జేబులో డబ్బుల్లేవు. నాలిక్కొరుక్కొంటూ తిరిగివచ్చాడు.

తలుపు తీసుకొని తిరిగి లోపల మాయకుండా చక చకా మెల్లెక్కి పైకి వెళ్ళాడు.

లోపలున్న సుజాతకి ఏదో చప్పుడైనట్లై లేవబోయింది. అంతలోనే తిరిగి దిగివస్తూ "ఏమీ లేదులే సుజీ! డబ్బుమరచి పోయాను" అంటూ తిరిగి బయటికివెళ్ళి తలుపు తాళం వేసుకుని వెళ్ళాడు.

ప్రసాద్ ముందుకి సాగిపోయాడు.

కానీ—

అపను మేడమీాదికి వెళ్ళిన సమయంలో ఏదో నీడ యింట్లో ప్రవేశించిన సంగతి గమనించలేదు.

సుజాత ఆనందం పట్టరానిదిగావుంది.

ఆమెలో వింత వింత కోర్కెలు మొలకెత్తాయ్.

రమణతో సన్నిహితత్వం, ప్రసాద్ ఆదరణ, దివాకరం స్నేహం ఆమెలో చనిపోయిన ఉత్సాహానికి అమృతం పోసాయ్. ఆమెలో జీవితాన్ని మేల్కొల్పాయ్.

సుజాత మెల్లగా లోగొంతుకలో " సా విరహే తవ

దీనా రాధా!" అనుకుంటూ పడకటింట్లోకి వెళ్ళింది.

ఆ గది చాలా సింపిల్‌గా వుంది.

ఓ ప్రక్కన మంచం–

దాని మీద ఓ తెల్లని పరుపు.

ప్రక్కనే గోడకి ఓ అల్మారా!

అందులో పుస్తకాలు.

వాకిలికి ఎదురుగా పెద్ద అద్దం.

అందులో సగం మనిషి కనిపిస్తాడు

అద్దం ప్రక్కనే ఓ చిన్న రౌండ్ టేబిల్–దానిమీద రంగుదారాలతో అల్లిన చక్కనిగుడ్డ–ఓ ప్రక్కన ఫ్లవర్ వాజ్–చిన్న అలారం టైం పీస్–దానిప్రక్కనే లతగారి "మోహన వంశి."

టేబిల్ నానుకొని ఓ కుర్చీ...

అద్దానికి ఎదురుగ్గా నిల్చుంది.

అద్దంలో ప్రతిబింబించే తన సౌందర్యం చూసి ఆమె ప్రలోభిత అయింది.

అమరికగా పరిపూర్ణంగా వున్న అవయవాలు విశాలమైన కళ్ళు చక్కని నాసిక గుండ్రని ముఖం–ఆమెకే ప్రలో

భాన్ని కల్గిస్తున్నాయ్.

"ఎంత అందంగా వున్నా..."

తన ఊహాకి తనే సిగ్గు పడింది.

ఊహాకి ఉత్తేజిత అయి నవ్వుకుంది.

"ఏమీ తోచటంలేదు మనస్సుకి.

అప్పటికి అప్పుడే నిద్ర పోవాలనిపించడం లేదు.

"ఏమి నిద్ర! ప్రతిరోజు పోయే నిద్రేగా. జీవితంలో ఇదేనా చివరి నిద్ర? ఇంకెన్ని రోజులు నిద్రపోవాలో? చాలా వున్నాయ్ జీవితంలో రాత్రిలుగా వచ్చేవి. ఒక్క రోజు నిద్ర- అదే కొన్ని గంటలు-పాడై పోతేనేం"

ఊహాల్లో మునిగి ఆమెకి తెలీకుండానే జడనివిప్పి వేసుకుంది. మళ్లీ అనాలోచితంగా జడని విప్పుకుంది. చివరి రిబ్బన్ని అవతల విసిరేస్తూ జడనంతా విడదీసుకుంది.

వీపుమీద భుజాలమీదా సుదీర్ఘమైన కేశరాసి చంద్రుడు చుట్టూ ఆవరించిన వికీర్ణ జలదరాసిలా వుంది. వెంట్రుకలని ముందుకి వేసుకుంటూ అద్దంలో చూచుకుంది. ముందు వెంట్రుకలన్నీ కుప్ప కుప్పగా కలసి పోయాయ్. ఆ వెంట్రుకల్ని బాగా పరుచుకుంటూ ఆనందంగా నవ్వింది.

ఒక్క సారిగా-

శరీరాన్నంతా తేరిపార జూచుకుంది.

మనస్సులో విచిత్రంగా స్నానం చేయాలని బుద్ధి పొడ చూపింది. చిత్ర చిత్రమైన మనుష్యులకి ఏ యే వేళ్ళల్లో ఏ యే విచిత్రపు టూహాలు మొలకెత్తు, తుంటాయో ఎవరి కెరుక.

"ఓహ్ భలే ఆలోచన!"

చక చకా సోప్, టవలు తీసుకొని బాత్ రూమ్‌కి వెళ్ళింది. తలుపు తెరిచేసరికి గది అంతా తెల్లగా, వెండి మలాం చేసినట్లుంది. పైన కప్పు లేకుండా విశాలమైన కడ్డీలు వేయించారు. వెన్నెల చల్లగా క్రిందికి జారుతూవుంది.

ఆ వెన్నెలలో ఆగది సౌందర్యం యినుమడించింది. షవర్ ని తిప్పి క్రింద కూర్చుంది.

చల్లగా నీళ్లు అందమైన ఆరోగ్యకరమైన శరీరం మీద పడి చిట్లుతున్నాయ్.

వర్షపు చినుకుల్లుగా సన్న సన్నగా ధారగా జాలువారు తున్నాయ్. పైన వెన్నెల.

ఆ వెన్నెలే వర్షంగా కురిసి ఆ గదిని ఆమెని ఆనంద తానాలు చేయిస్తున్నట్టుంది ఆ దృశ్యం.

ఆమె సంతోషం పొంగుతూ వుంది చంద్రుడి కాంతిలా!

ప్రక్కనే వున్న తొట్టిని జరుపుకొని పడుకుంది.

ఓ వైపు తల ఆనించి మహారాణీ లా పడుకుంది.

షవర్ చల్లగా వెన్నెల సోనగా పడుతూవుంది.

హాయ్!

"లావెండర్" వుంటేనో అనుకుంది.

మెల్లిగా లేచి ప్రక్కనే వున్న అలమార తెరచి అందులోంచి లావెండర్ తీసి తొట్టిలో కలిపింది ఎక్కువగా! సువాసనలు మత్తెక్కిస్తున్నాయ్.

బరువుగా గాలి పీలుస్తూ అలాగే చల్లగా పడుకుని వుంది. పైన వెన్నెల!

ఆ వెన్నెల లాగే కౌముదీ తుషారాల్లాంటి లావెండర్ మిశ్రితమైన నీళ్లు!

అందులో అందాలు విరజిమ్మే మేనుతో ఆమె!

ఆ కౌముదిలో కాంతే కాని పరిమళం లేదు!

ఈ నీళ్ళలో కృత్రిమముదే అయినా మనస్సుని మత్తెక్కించిహాయిని కల్గించి ఊగించే పరిమళం!!

అలాగే మాధుర్యాన్ని అనుభవిస్తూ ఓ గంట గడిపింది.

హాల్లో గడియారం పండెండు గంటలు కొట్టింది

మెల్లిగా లేచి వళ్ళు విరుచుకుంది.

లావెండరు పరిమళం మనస్సుకి మత్తెక్కించింది.

అమత్తే కొద్ది కొద్దిగా శరీరాన్ని కూడా ఆక్రమించుకుంది. వళ్ళంతా శుభ్రంగా తుడుచుకొని డ్రెస్ మార్చుకుంది.

తెల్లనిచీర !

తెల్లని రవిక!!

మూర్తీభవించిన కలువ కన్నెలావుంది.

బహుశా చతుర్ముఖబ్రహ్మరాణి-వాణి-సర్వశ్వేత మూర్తి-యిలాగే వుండేదేమో!

తల అలాగే విడిచి కొసళ్ళు టవలుతో రుద్దుకొని ఫాన్ క్రిందుగా నిలబడింది.

చల్లని వేళల్లో ఆ ఫాన్ గాలి మనసులోని చలినంతా కదిలించి నరాల్ని జివ్వు మనిపిస్తోంది.

సెంట్ తీసి దూదినిండా తడిపి ఆ ముక్కని ఫాన్‌మధ్యన ఉంచింది.

సుగంధ పరిమళాలు వీచసాగాయ్.

మెల్లిగా ఆ చల్లని పిల్లగాలిని ఆఘ్రాణిస్తూ కళ్ళు మత్తుగా మూసుకుంది!!

గడియారం మళ్ళీ మోగింది!

ఫాన్ ఆపుచేసి క్రిందిలైట్లన్నీ తీసేసి మెల్లిగా మెట్లెక్కి వెళ్ళింది.

పైన గదిలో టేబులుమీద 'ఏకవీర' కనిపించింది. దాన్ని అలా తిరిగేసి మళ్ళీ అక్కడే వుంచింది.

'ఆనందాన్ని అనుభవించాల్సిన సమయంలో పుస్తక పఠనమా?" అనుకుంది.

తలుపు తెఱచుకుని బయటకు వెళ్ళింది.

పక్కన ఏ యిండ్లూ లేవు.

ఆచివరి వీధికి చాలా దూరంలో వుందీ మేడ.

మేడకి ఎదురుగ్గా ఎన్నాళ్ళ క్రిందటో కూలిపోయిన ఓ పెంకుటిల్లు వుంది.

పైన రెండు గదులు కట్టి మిగతా స్థలాన్నంతా సిమ్మెంట్ తో చప్టా చేసి చుట్టూ గజం ఎత్తున గోడకట్టారు.

గదిలోంచి మంచం తీసుకొని వచ్చి బయట వేసింది.

పరుపు తెచ్చి పరచింది!

పై బ్లాంకెట్ మాసినట్లుంటే అది తీసేసి తెల్లటి బ్లాంకట్ పరచింది.

తృప్తిగా ఓ పర్యాయం చూసుకొని పడుకుంది అలాగే.

తెల్లని వెన్నెల—

తెల్లని పరుపు—

మనిషి తెలుపు—

అంతా శ్వేతమయం—

సత్యలోకంలో సర్వశుక్ల శయనించినట్లుంది.

నిదానించి చూస్తె తప్ప—

అక్కడో మంచం వుందని,

ఆ మంచంమీద ఓ యవ్వనవతి పడుకుందని తెలీద.

అంతా వెన్నెల్లో ఐక్యం అయిపోయినట్టుంది.

మనస్సు మధురంగా వున్నపుడు అలా హాయిగా పడుకోటం అలవాటు. వెన్నెల వేళల్లో చందమామ అందాన్ని ఆరాధిస్తు అలాగే పడుకోవటం ఆమెకిచిన్నప్పటినించి అలవాటు.

ఏకాంతగా అనుభవించటంలో ఆమెకి ఆనందం ఎక్కువౌతుంది.

వింత వింత ఆలోచనలు రాసాగా .

కళ్ళు మూసుకుని పడుకోవటంతో ఆమెలో ఆలోచనలు విజృంభించాయి.

చందమామ అందాన్ని ఆరాధించటం ముగిసి ఆలోచనల అమృతాన్ని ఆస్వాదించటం ప్రారంభమైంది.

హఠాత్తుగా ఎందుకో ఆమెకి చెలియలికట్టపై మనసు పోయింది.

"అందులోని రత్నావళికి తనకి ఏమిటి తేడా! ఆ రత్నావళి మగడిని వదలి మరిది వెంట పరాయిచోటుకు వెళ్ళింది. తనూ యించుమించుగా అంతే చేసింది కానీ తనని భర్తే వదిలాడు యిక్కడికి వచ్చాక!

మగడిని వదలటానికి ఆమెకి మరిది ప్రాధ్బలం—పట్నవాసపు జీవితం మీాది మోజు—మరది చెప్పిన దూరంగా ఆశాదీపంలాగా చూపిన భ్రమాత్మకమైన భవిష్యత్తుమీాద భ్రమ—కారణాలు.

నిజంగా ఆమె అమాయిక అవటంవల్ల వ్యామోహంలో లేచి వచ్చింది.

తనూ కొంచం భ్రమతోటి బావతో పెళ్ళాడటానికి లేచివచ్చింది. కానీ తను పెళ్ళాడక తననే భర్త వదిలాడు.

తన్ను ముంచటానికి ఎవరూ లేరు...రంగనిలాగ...

విధి తనని ముంచింది...

ఞంచితురాల్ని చేసింది...

రత్నావళిగతి ఏమిటో అది నవల అవటంవల్ల చివరికి తేలింది. అయితే—

తన సంగతి! తను ఎలా మారుతుంది? ఏమౌతుంది.

అప్రియత్నంగా ఆమె ఆలోచనలు రమణమీద మరలాయ్.

"ఈ జీవితంలో, యీ వేళలో రమణ ఒక్కడే చొరవ కలించుకోకలిగాడేమో!"

ఆమె మనస్సు రమణమీద ప్రసరించింది.

"ప్రసాద్ చేరదీసినవాడైనా అతను తనకి దగ్గరగా రాలేకపోయాడు. ఇంక దివాకరం తనికి దగ్గరగా రాలేడు. అది అతని బలహీనత. ఒక్క రమణే హృదయానికి చేరువైన వాడు"

ఆలోచనలు ఉద్ధృతం కాసాగాయ్.

"నిజంగా ఆరోజు రమణ అలా ఊరడించటంవల్లనే తనుకాస్త తేరుకోకల్గింది. ఆ సమయంలో రమణతప్ప ఇంకెవరూ అలా సాహసించేచొరవ తీసుకోలేకపోయారు. మరు

సటి ఆ విషయం వాళ్ళు ప్రశ్నించినా తేలిగ్గా విషయాన్ని తప్పించేశాడు. ఇక మళ్ళీ ఆ ప్రశక్తి లేదు ...".

ఆలోచనలు ఇంకోదారి బటాయ్

" తను పునర్వివాహం చేసుకుంటేనో ?

ఎవర్ని చేసుకోవాలి ?

ఎవర్ని చేసుకోవాలి ? "

మనస్సులో ఏమూలనుంచో మూడక్షరాలు విని పించాయి ర ... మ ... ణ "

ఆలోచనని దూరంగా పంపుతూ కళ్ళు తెరచింది. ఎదురుగా నిండు ఆకశంలో తనను చూచి నవ్వుతున్నాడు చంద్రుడు.

ఎంత హాయిగావుంది ఆ చందమామతో జతగా నవ్వు కోవటం.

జీవితమంతా వెన్నలైతే ... ...

అదీ విసుగెత్తుతుందేమో ?

ఎంతని అనుభవించటం ?

నిజానికి అలా భరించలేము అనేనేమో భగవంతుడు చంద్రుడికి వృద్ధి, క్షయాలు ఏర్పరిచాడు.

ఏదైనా ఒక్కసారి ఎదిగి అలాగే ఒక్కసారి మరిగిపోతే సొంపు వుండదు.

అందుకే వరుసక్రమంలో వృద్ధిక్షయాలున్నాయ్.

చంద్రిడిలోకి అలా అలా తొంగిచూస్తూవుంటే ...

" అలాగే అప్పడే చచ్చిపోతేనో" అనుకుంది.

" ఇలా తెల్లగా పాముకుబుసంలా పడుకొని కౌముదిని తినేస్తూ చనిపోవటంకంటే కావాల్సిందేమి ? " అనుకుంది మళ్ళీ.

ఆమె కుడిపార్శ్వం అదిరింది.

"ఛీ! ఛీ! ఏమిటీ అపశకునం" అనుకుంది.

మరుక్షణమే కుడికన్నూ అదిరింది.

నవ్వుకుంది సుజాత.

" ఏమిటి వింతఆలోచన ... ఒక్కక్షణంలోనే శుభమును, మరుక్షణంలోనే సగంలో అశుభమూనా ? ... నిజంగా ఇది జరిగేదేనా ? "

మళ్ళీ ఆలోచనలు రమణమీదికి మరలాయి.

ఎందుకో ఆమెమనస్సు అతనిపైకి లాక్కెళుతున్నట్టుగా సాగుతూవుంద.

"రమణ ... రమణ ..." అనుకుంది.

మరోసారి అనుకొంది.

ఏదో ఆనందసముద్రంలో సాగిపోతున్నట్లుంది.

సముద్రం ముంచదు కదా అనుకుంది.

అంతలో అలాగే ఊహలు సాగుతూ మగత కమ్మి నట్లైంది. ఏదో ఆనందానుభూతిలో అలాగే యిరుక్కుని పోయింది.

ఇదంతా అనుక్షణం పరిశీలిస్తున్న ఆకిందనున్నవకి భరించటం చాలా కష్టంగావుంది.

అతను సుజాత చేసిన ప్రతిపనినీ పరిశీలించాడు.

అతనికి వళ్లుమండిపోతున్నది.

"రాస్కెల్! తననికాదని ఎంతహాయిని ఎంత ఆనం దాన్ని ఎంత ఐశ్వర్యాన్ని అనుభవిస్తోంది"

అతనికి ఈ ప్రపంచంలో డబ్బుతో వచ్చే సౌఖ్యాలన్నీ అనుభవించేవాళ్ళని అందర్నీ చంపెయ్యాలని అనిపించింది.

అతనికి ధనవంతులతో ఉన్న వైరం అలాంటిది.

మళ్ళీ పైకి ఎక్కివచ్చాడు—

మొదటిసారి ఆమె మేలుకుని ఉండటంచూచి దిగి వెళ్ళాడు అప్పుడే...

క్రిందికి దిగివెళ్ళటంలో కాలుజారి క్రింద పడ్డాడు.
ఓ కఱ్ఱ విరిగిపోయింది ...

పీడ వదిలింది లెమ్మని రెంటినీ విసరివేశాడు అశక్తత మైన కోపంతో ...

అయితే ఆ శబ్దాల్ని వినేటంతదగ్గరలో లేదు సుజాత.
ఆమె ఏదో ఊహాలోకంలో తేలిపోతోంది.

గడియారం ఇంకోగంట కొట్టింది.

తలుపు ఓరగా తెరచివుంది.

సుజాత కళ్లుమూసుకుని పడుకుంది.

నిద్రపోతున్నదో ... అంతకంటే మధురమైన ఊహా జగత్తులోవుందో తెలియటంలేదు ...

అతను క్రిందికివెళ్ళి విరుగకుండా వున్న మరోకఱ్ఱను తీసుకొని పైకి వచ్చాడు.

ఆమె —

ఏదో ఉహాలోకంలో సాగిపోతున్న వ్యక్తిలా పడుకుని వుంది. కనురెప్పలు బరువుగా మూసుకున్నట్లుండటంతో ఏదో మధురమైన కలకంటూ వున్నట్లుంది.

అందమైన అధరం మీాద ఉండి ఉండి ఒక్కోసారి తియ్యని చిరునవ్వు వెలుగుతుంది.

చలిగాలి అప్పుడప్పుడూ వీచటంతో కొంచెం కొంచెం కుంచించుక పోతునట్టుంది.

వెల్లకిలా పడుకుని పరుపుకి అతుక్కుని పోయినట్టుంది.

ఆ వ్యక్తి ఇక సహించ లేక పోయాడు.

ఇంత ఆనందమా?

ఇంత తన్మయమా?

ఇంత రసాస్వాదనమా?

అసంభవం!

అనుభవించకూడదు.

మెల్లిగా జేకుంటూ మంచం దగ్గరిగా వెళ్ళాడు. సించ టానికి చేతకాక మంచానికి ఓ వైపున కూర్చున్నాడు పెట్టె మీాదుగ.

అప్పుడు ఆమె కలల్లో తేలిపోతూవుంది.

బహుశా రమణ మీాద ఆలోచనలు సాగుతూ వుం డొచ్చు. ఆ ఆలోచనా స్రవంతిలో రమణే వచ్చి పక్కన కూర్చున్నాడేమో వాస్తవ జగత్తులో కూడా అతనిపై చేయి వేసింది. అది ఆ వ్యక్తి సహించలేక ఆ చేతిని తొలగిస్తు ఆమె కంఠం చుట్టూ తన రెండు చేతులూ వేశాడు.

రమణే తనచుట్టూ వున్నాడనుకుని రెండు చేతులూ జాపింది తనకోర్కి అసమంజసమేమోనన్నట్టు-అసంభవమే మోనన్నట్టు ఆ రెండు చేతులూ ఆధారం లేక పోవడంతో క్రిందికి వాలిపోయాయి.

గొంతుక్కి వున్న చేతులు బిగిశాయి ముద్దకట్టిన కాఠిర్యంతో.

ఆమె భీతావహ్యై కళ్ళు తెరచింది

అప్పుడు ఆమె కళ్ళల్లో కనిపించిన భావాల్ని చిత్రించటానికి నాకు శక్తి చాలటం లేదు.

అంతే!

ఒక్కసారిగా నిలువెల్లా కదిలిపోయి మూర్ఛపోయింది.
అంతే!

ఆమెకి అదే ఆఖరిచూపు!

ఆ చేతులు రాను రాను మరీ బిగుసుకున్నాయి.

భయంతో రెట్టింపుగా కొట్టుకున్న గుండె మెల్లిగా మూల్గుతూ ఆగిపోయింది.

చనిపోయింది.

నిశ్చయం!

ఒక్కసారి ముఖం మీదికి వంగిచూచాడు.

అసహ్యం వేసింది అతనికి.

పక్కకి కదిలి చేతిలో కఱ్ఱ తీసికొని ఒక్క వేటు వేశాడు కాళ్ళమీద. టుప్‌మని విరిగాయి. రెండుకాళ్ళూ!

అతన్లో ఆవేశం ఇంకా చల్లారలేదు.

మళ్ళీ కఱ్ఱ ఎత్తి తలమీద మరోవేటు వేశాడు కాఠిన్యం అంతా వుట్టి పడేట్టు.

తలచిట్లి రక్తం చిందింది.

అతన్లో ఆవేశం ఆక్రోశం పూర్తిగా అణగాయి

"చావనీ" అనుకున్నాడు

కర్రని పక్కకి విసిరేశాడు.

మెల్లగా అలాగే దోక్కుంటూ క్రిందికి వెళ్ళాడు.

గడియారం రెండు గంటలు కొట్టింది.

మెట్లక్రిందవున్న స్థలంలో అలాగే క్రితంలాగే పడుకున్నాడు.

ఓ పావుగంట గడిచింది.

ప్రసాద్ తలుపు తీసుకొని లోపలికి వచ్చాడు.

మళ్ళీ వెంటనే తలుపుమూసి తాళం వేసి మేడపైకి వెళ్ళాడు.

క్రింద దాక్కున్న వ్యక్తికి చాలా భయం వేసింది

వళ్ళంతా భీతితో చిరుచెమటలు పట్టింది

అలాగే వణికి పోతూ అక్కడే నక్కాడు

"తప్పించు కున్నానా అదృష్టం లేకపోతే పీడాపోయిరి ఉరితీస్తే హాయి! జైలు శిక్షైతే ఆనందం. ద్వీపాంతరమైతే అత్యానందం"

నిశ్శబ్దంగా గురకతీస్తూ నిద్రకి జోలాడు

ప్రసాద్ పైకి వెళ్ళి లైటు వేశాడు.

గదిలో మంచం లేదు.

ఆశ్చర్యపోతూ బయటికి వెళ్ళాడు.

అక్కడ

విన్నట దేవత స్త్రీలా నిదుర పోతోంది సుజాత.

నవ్వుకున్నాడతను.

ఎంతచిత్రమైన రోజు!

అన్నీ విచిత్రంగా జరుగుతున్నాయ్.

తృప్తిగా నవ్వుకుని లైటు ఆర్పేసి క్రిందికిదిగి వెళ్ళి సుజాత మంచంపై పడుకున్నాడు.

తల్లి ఒడిలో పడుకున్న అబ్బాయిలా హాయిగా నిదుర పట్టింది క్షణంలో అతనికి.

ఊహాలోకపు సౌందర్యపు టంచులు చూస్తూ తృప్తిగా నవ్వు కుంటున్నాడు. నిద్దర్లో

కాలం చేసిన దుర్మార్గం అతనికి అగపడనంత దూరంగా వుంది.

అయితే అదెంత దూరం పోగలదు?

విధి ఈడ్చుక రాకుండా వదుల్తుందా??

15 రమణ యింటికి వెళ్ళేసరికి సరిగ్గా పదికొట్టింది.

సుభద్రమ్మగారు ఎదురుచూచిచూచి అలాగే కొంగు పరుచుకొని నిదురపోయింది.

విజయ ఇంకా కుర్చీలోకూర్చుని ఏదో నవల చదువుతోంది.

మెల్లగా తలుపుతీసుకొని యింట్లోకి వస్తూ అన్నాడు.

"విజయా! మేలుకునేవున్నావా యింకా! గుడ్! నాకుతెలుసు. నా బంగారు చెల్లాయికి వాళ్ళ అన్నయ్య మీద ప్రేమని, ఎదురుచూస్తు వుంటుందని"

విజయ నవ్వుతూ అంది.

"ఇంకేం ఎత్తేసెయి ఆకాశానికి. మళ్ళీ దించేస్తావని తెలీకుంటే కదా దిగులు. కానీ కానీ ... ఊ ..."

"ఓహ్ ! చాలా చమత్కారంగా మాటాడుతున్నావే ఇంతకీ అదేంపుస్తకం ? "

" చెలియలకట్ట "

"అరే ! చెలియలకట్ట మళ్ళీ చదువుతున్నావా ? "

" ఏదో ఆలాభ్యాసదొర్లింది. తీసి చదువుతున్నాను',

" ఏం చిత్రం ! ఈ రోజే ప్రసాద్ దీన్ని మళ్ళీ చదవాలని తీసుకున్నాడు ఖరీదుచేసి. నీవూ చదువుతున్నావు. చూస్తే యిద్దరికీ ఒకేసమయంలో ఒకే ఐడియా దొరిలినట్లుంది. చాలా చిత్రంగావుంది కదూ ? "

నవ్వుతూ అంది విజయ విషయాన్ని మార్చుతూ

" అయిందా యికనయినా భోజన చేయవే మిటి ? "

" అక్కడ ప్రసాద్ ఆదరణ దివాకరం ప్రేమ ఇక్కడ అన్నీకలిసిన నీవూ నా ఆకల్ని చంపేశారు. ఇంకెక్కడుంది ఖాళీ కడుపులో ! అయినా ఆనందం ఎక్కువైన రోజున కనీసం నాల్గుమెతుకులైనా కొరకాలిట ! పద "

"ఓహో అలాగా అయితే నాల్గుమెతుకులే యిక్కడికే పట్రానా ? "

" వద్దేవ్ తల్లీ ! అలాచేయకు నీపుణ్యముంటుంది. మళ్ళీ నాన్గంటికే లేచి "కాఫీ పానియం సేవ్యామి" అనాల్సొస్తుంది

తుళ్ళి తుళ్ళి నవ్వింది విజయ

"ఆలాగే కానీ రేపు నాల్గింటికే లేద్దామా అన్నాయ్"

ఓయి ఏమిటిది. అన్నం పెట్టావా ఏమి? కడుపు నిండా భోజనంచేసి నాల్గింటికే లేచి తలకి పోసుకోమన్నా సిద్ధమే"

సరేలే! తర్వాత ఆ వన్నీను. ముందు భోజనానికిపద" అంది యింట్లోకి నడుస్తూ.

విజయ ప్రక్కనే పీట లాక్కొని కూచ్చుంటూ అన్నాడు

విజయా ఒక్క చిన్నకోరిక! కలపి ముద్దలు వేస్తావా?. అన్నం కలుపు కోవటానికి చాతసపడం లేదు" ముద్దుగా అడిగాడు. భుజం మీాంచి వెనక్కి తిరిగి చూస్తూ అంది నవ్వుతూ.

"ఇంకేమైనా వుందా కోర్కె? కోసెయ్. చూస్తూ వుంటే ఇంకా సేపటికి ముద్దలుకలిపి నోట్లో పెట్టమనవ్ కదూ?"

ఇదిగో చూడు చెల్లాయ్. అలా వేళాకోళం పట్టిస్తే అసలు నేను భోజనమే చెయ్యను" బుంగమూతి పెడుతూ అన్నాడు.

"మా బోబువి కదూ. ఏలాగన్నా నా భోజనం చేయమ్మా. నీవు తినకపోతే నా కడుపు నిండనే నిండదూ.

బంగారు బొజ్జ కదూ! చిన్నారి తండ్రి కదూ?'' ముద్దు లొలి కే టట్టుగా అంది.

విరగబడి నవ్వుతూ ఇంకాస్త ముందుకి జరిగి చేయి చాపాడు. అన్నం కలపటం ముగించి, చేతిలో ముద్ద వేస్తూ అంది

"ఒకమాట చెపుతా వింటావా?''

తింటూ వుండటంవల్ల ఏమిటి? అన్నట్టు కనుబొమ్మ లెగర వేశాడు.

త్వరగా పెళ్ళి చేసుకో! ఈ పడే తిప్పలన్నీ ఆవిడే పడు తుంది. నేనూ అమ్మలాగే హాయిగా పడుకోవచ్చు కదా?''

ముద్దని మింగేసి మళ్ళీ చేయిజాపి అన్నాడు

''ఉ! ఊఁ! చెప్పేసెయ్. మనసులోని కోరికలన్నీ మణిగి పోకముందే! నిజమే విజయా. నీకో వదినగారూ నాకూ...ఓ...బా...వ...గారూ చాలా అవసరం. త్వరగా పిల్పించేయాల్సిందే. ఏమంటావ్ ?''

సిగ్గుపడుతూ ''ఫో అన్నాయ్'' అంది.

తిరిగి అన్నం కలపటంలో నిమగ్నమైంది విజయ.

మౌనంగా ఆమె ముగ్ధ మోహన రూపాన్ని చూస్తు న్నాడు రమణ. మెల్లిగా అడిగింది విజయ

"అన్నాయ్. రత్నావళి తప్పేమైనా వుందా?"

ఏ రత్నావళి అన్నట్టు చూచాడు.

తర్వాత మళ్ళీ గుర్తుకుతెచ్చుకొని "ఓహో! ఆ రత్నావళా?" అన్నాడు పరిహాసం

"ఓహో! అయితే ఏ రత్నావళి అని మరచిపోయి అడిగే వరకూ వచ్చిందన్నమాట ఆనందోత్సాహాల పొంగు" అంది.

"సరే నీ దెప్పులకేంగాని. ఇంతకీ నీవు తప్పు లేదంటావ్ అంటేనా?" అని ఆగాడు.

మళ్లీ తనే–అన్నాడు

"చూడు విజయా! కొందరి దృష్టిలో రత్నావళిది క్షమార్హమైన తప్పుకాదు. ఆమె క్షమించ తగ్గదికాదు. మరి కొందరి దృష్టిలో ఆమె దోషికాదు. ఆమెది తప్పుకాదు. తెలియక ముట్టుకున్నా తెలసి ముట్టుకున్నా నిప్పు నిప్పే. అది కాలక మానుతుందా? ఏదో ఎఱ్ఱగా వుంది. మెరుస్తోంది. కెంపు కాదుకదా అనుకొని భ్రమపడి ముట్టుకున్నాను. అని ప్పయింది. నాతిప్పమైనా వుందా, అంటే? ఏలా? ముట్టుది కోవటమే తప్పు అంటారు వాళ్ళు. అదేమిటి ఆవిడ తప్పేం వుంది. ఆ నాటికి ఆమె వయస్సు చాలా తక్కువ. అసలు కోరిక జ్ఞానమే శూన్యం. ఏదో భ్రమలో నల్ల కళ్ళద్దాలలో చూడటంవల్ల మోజుపడి వచ్చింది. తర్వాత మనస్సాక్షి, తనతప్పు,

జరుగుతూన్న మోసాలు తెల్సుకుని తనను తాను క్షాళితం చేసుకుంది కదా అంటారు వీళ్ళు. ఎవర్నీ కాదనలేం మనం"

"ఇంతకీ నీ అభిప్రాయం చెప్పావు కాదు"

నిగ్గదీసి అడిగింది.

"ప్రత్యేకంగా నాదంటూ ఏముంటుంది. ఎవరి ఉద్దేశ్యాలు వాళ్ళవి. వారి వారి ఉద్దేశ్యాల్ని బట్టి వాళ్ళు వ్యాఖ్యానించుకుంటారు. మనం అనుకోవల్సిందల్లా అది. అతని ఊహ అతని మాత్రమే. ఏ ఒక్కడి ఊహా స్టాండర్డు కాదు... అంతగా నీకు వినాలని వుంటే విను. నేననుకోవడం... నా దృక్పథంలో రత్నావళి చేసింది తప్పు కాదు... తెలియని తనం... తర్వాత తెలిసి కున్నాక తనుచేసింది తప్పని ఆ రత్నావళే చెప్పుకుంది...అంచేత ఆమె వయస్సుని, ఆమె పరిస్థితుల్ని, ఆమె పరిసరాల్ని దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే ఆమె తప్పు నాకేమీ అగుపించదు...అయినా అలా ఆలోచిస్తూపోతే చివరికి తప్పుచేసేవాళ్ళు చాలా తక్కువమంది తేల్తారులెద్దూ" చివరిమాట అంటూ నవ్వాడు.

పొలమారింది.

నీళ్లు అందిస్తూ అంది విజయ.

నిజం. నాకూ యిదే ఊహ వచ్చిందన్నయ్యా! చూశావా ఎంత చిత్రమో యిద్దరికీ ఒకే భావన కల్గటం!"

నిట్టూరుస్తూ అన్నాడు

"రాకేం చేస్తుందమ్మా! నీవు నా చెల్లెలివైతేవి మరె వరన్నానా. నారక్తం పంచుక పుట్టిన నీకు వేరు ఊహాలు ఎలా వస్తాయ్" విజయ మాట్లాడ లేదు.

అతని ఊహ సుజాత మీదికి మళ్ళింది.

సుజాత...సుజాత...

అయితే అతను అలాగే ఊహల్లోకి సాగకుండా విజయ పిలిచింది ముద్ద చేతిలో వేస్తూ.

ముద్దని మెల్లి మెల్లిగా తింటూ తిరిగి ఆలోచనలకి ఉపక్రమించాడు. అతనిఊహ హఠాత్తుగా రాజా మీదికి మళ్లింది.

చాలా రోజులైంది అతన్ని కల్సుకుని.

బహుశా కోపంవచ్చి వుండవచ్చు.

అంచేతే మళ్ళీ రాలేదు.

అతడు వెలిబుచ్చిన అభిప్రాయం మీద మనస్సు మళ్లింది.

పోనీ,

విజయ ఆ విషయం కనుక్కుంటేనో?

సరే కానిమ్మనుకున్నాడు

భోజనం ముగించి వచ్చాడు.

వంటిల్లు సర్ది చేతులు తుడుచు కుంటూ బయటికి వచ్చింది విజయ చెల్లెలివైపు ఒక్కసారి తేరి పారజూచి రాజా తగును రాజాకే తగును అనుకున్నాడు.

"ఇక పడుకోరాదా అన్నాయ్"

"అలాగే కానీ ఒక టడుగుతాను చెపుతావా?"

విచిత్రంగా ఏనాడు అలాంటి ప్రశ్న వేయని అన్న వేపు చిత్రంగా చూస్తూ అంది

"అదేమిటి?"

"అదంతేలే! నీకు రాజాని పెళ్లి చేసుకోవటం ఇష్టమేనా? హఠాత్తుగా అనుకోకుండా ఎదురైన ప్రశ్నకి బిత్తరపోతూ, ఆశ్చర్యపోతూ చూచింది అతని వేపు.

హఠాత్తుగా...హఠాత్తుగా...

ఆమె ఊహలు రాజా మీదికి ప్రసరించాయ్...

కానీ ఆలోచనకి తావివ్వకుండా అంది.

"ముందు నీ కిష్టమేనా?"

"భేష్... కొంచెం మార్గంలో ఉన్నట్టే... పాతిక మార్కులు వచ్చాయ్ అతనికి. ఇక నాయిష్టం ఏముంది? నీవు సరేనంటే నాలు గైదు రోజుల్లోనే అతనితో చెప్పటం... ఆ తర్వాత అతనికి నీకూ త్వరగా ముడి వేసెయ్యటం..."

కొంచెం తాపీగా ఆలోచిస్తున్నట్టుగా అంది

"నీ యిష్టమే నాయిష్టం అన్నయ్యా"

ఆల్ రైటు...ఎవరైనా పెళ్ళి కావల్సిన అమ్మాయి మీ యిష్టమే నా యిష్టమందా అది ధ్వన్యాత్మకంగా తన అభిప్రాయాన్ని వెలిబుచ్చటమే నని సుజాత......"

అర్థాంతరంగా ఆగిపోయాడు

హతోస్మి!

ఇన్నాళ్ళుగా చిన్నారి చెల్లాయికిసైతం తెలీకుండా మనసు మారు మూలల్లో దాచుకున్న రహస్యం బయటపడింది.

"ఎవరన్నాయి సుజాత?"

గొంతుకలో వెలక్కాయ యిరుక్కుందేమో!

మళ్ళీ రెట్టించింది.

"విజయా నారహస్యం దాచుతావు కదూ"

నవ్వింది విజయ...

అందులో అన్నాయి నీవూ నేనూ వేరునా అనే అర్థం కనిపించింది తృప్తి పడ్డాడు.

కదలి పోయాడు రమణ.

"అది కాదమ్మా అది చాలా రహస్యం. అసలు నిజంగా సుజాత ఎవరో నాకు తెలీదు. కానీ ఓరోజు ప్రసాద్

ఆమెని తెచ్చి ఆపదలో వుంది రక్షిద్దాం అన్నాడు. మేము ఓ. కే. అన్నాం...తర్వాత ఆమె సభ్యంగా స్నేహితంగా మాతో వుంది. ముఖ్యంగా నాతో చాలా చనువుగా వుటుంది..." అడ్డొస్తూ అంది

"అన్నాయి...అంతగా ఆత్మీయురాలైందా?"

రమణ జవాబివ్వలేదు.

విజయ నవ్వుతూ అంది

"ఎవరైనా పెళ్లికుమారుడిని ప్రశ్నిస్తే, మౌనం వహిస్తే మౌనం అర్థాంగీకారం అన్నది మాపదిన సుజాత..."

ఆశ్చర్య సంభ్రమాలు ముప్పిరి కొన్నాయి రమణలో.

"విజయా! నీ సంస్కారం సామాన్యమైంది కాదమ్మా. చేయాలి. నమస్కారం చేయచ్చు. అయినా చిన్నదానివి కాబట్టి ఆశీర్వదిస్తున్నాను. నీవు ఉజ్వలంగా వెలుగుతావు. సరే...నీ అభిప్రాయం అంగీకారమే...కానీ యింతికీ ముందుగా ఆమె చరిత్రేదో తెల్సుకుని మార్కులు వెయ్యి... రాజాకి వచ్చినట్టుగా నాకూ యాభై వచ్చాయా గుడ్...

లేచివెళ్లి ట్రంకె తీసి అట్టడుగున ఉన్న ఓ కాగితాల దొంతి తెచ్చాడు.

అదీ సుజాత రాసిన డైరీలాంటి ఆమె గీతచరిత్ర...

చెల్లెలి చేతికి అందిస్తూ "ఇదె చదవమ్మా" అన్నాడు...

మంచం మీద వాలుగా పడుకుని చదవటం ప్రారంభిం చింది.

రమణ నిద్రకి జోగాడు...

# 16

విజయ ఒక్కొక్క పేజీ తిప్పి చదవ సాగింది.



ఇవాళ నాన్నగారి వెంట ఎవరో ఒకతను వచ్చాడు.... చాలా సుందరంగా వున్నాడు. మనిషి కూడా చమత్కా రంగా మాట్లాడుతాడు. పరిచయం అవుతూనే అధికంగా చనవు తీసుకుని మాట్లాడుతున్నాడు...అధికప్రసంగం క్రింది కిరాదు.

పేరు బాబు...

నాకు బావ అవుతాడట...

బావ...

బావ.....

ఎంత మధురమైన సంబంధం...

ఇన్నాళ్ళనుంచీ ఎక్కడ దాగి వున్నాడో...

మనసులో వున్న మధుర భావాల్ని వెలికి తీస్తు న్నాడు...

మనోహరమైన భావాలికి మూల మాతున్నాడు.
అబ్బ! సిగ్గేస్తోంది!!

 

మా యిద్దరిమధ్యా చనువు ఎక్కువవుతోంది.

ఒకరి కొకరం చాలా దగ్గరవుతున్నాం.

అతన్ని చూడంది ఒక్క క్షణంకూడా వుండలేనేమో ననిపిస్తోంది.

హాయి! హాయి!!

అంత చక్కటి ఊహ ఇన్నాళ్ళనుంచీ ఏడ దాగి వుండినదో!!

  

అతనికీ అంతేనట!

నన్ను విడిచి అతను వుండలేడట!!

నా సాన్నిధ్యంలో స్వర్గద్వారం కనిపిస్తోం దన్నాడు.
చమత్కారంగా

"ప్రవేశించవోయ్ బావా! నిన్నడిగేవా డెవడోయ్" అన్నాను.

ఆమాటకే మనసంతా మురిసిందట.

దగ్గరగా వచ్చి చేయి తీసుకుని,

కళ్ళల్లో కళ్ళు కుచ్చుతూ ...చూపుల్ని తప్పించ లేను......

"నిజంగానా సుజీ..."అన్నాడు

ఆ పిలుపు!!

ఓహ్!!

" ఈ బంధం శాశ్వతం కావాలి బావా! "

"అది నీ చేతిలోనే వుంది."

అరచేయి చూసుకుంది......

తన చమత్కారానికి బిట్టుగా నవ్వుతూ-

అరచేయి ముద్దాడి అన్నాడు.

"ఇదిగో ...ఈ రేఖవుంది చూశావూ అదినీవు ... మరేమో ఈ రేఖ నేను...ఈ రేఖలు యిక్కడ పుట్టి ఇక్కడ కలిశాయి...ఇక కావల్సింది మనం..."

అతను కాస్త దగ్గరిగా జరిగాడు.

నాకు వళ్ళు జలదరించింది.

"ఏమిటి బావా! ఎవరైనాచూస్తే..."

"చూస్తే తెలీని వాళ్ళైతే కొత్తదంపతు లనుకుంటారు... తెలిసినవాళ్ళైతే కాబోయే దంపతు లనుకుంటారు...అంతేగా.."

నవ్వింది తను...

అతని కౌగిట్లో!...

* . * * *

"బావా!"

"ఓయి!"

"ఇన్నాళ్ళు ఎక్కడున్నావ్?"

"ఇక్కడ"

"ఛీ !ఛీ! అలా ముట్టుకుంటావేం?"

"ఎలా? ఇలానా?"

"అబ్బ. ఏమిటది.?"

"మనసులోని కోరిక"

"మధురమైన కోరిక"

"కరెక్టు! తీరే దారే కావాలిక"

"పో బావా!"

"ఎక్కడికి. నీ మనసులోకి చొచ్చుక పొయ్యాను... మనువైతే శరీరంలోకే చొచ్చుకుని పోతాను..."

"ఛీ! సిగ్గులేదు."

* * *

ఆవేశం!

ఆవేశం!!

భగవాన్!!!

ఆవేశానికి హద్దులు దాటాము.

చాలా తప్పు జరిగిపోయింది.

అసలు నిజంగా అది తప్పేనా?

తప్పుకాదని కుడివేపు, తప్పని ఎడంవేపు హృదయంలో కొట్లాటలు జరుగుతున్నాయి.

ఆవేశానికి ఇద్దరం పాలు పంచుకున్నాం.

నాకేమో ఏమీ తెలియటంలేదు.

ఏదో ఆరాటంగా వుంది.

ఎందుకో ఆనందంగా కూడా వుంది.

అయినా అతనేమీ పట్టించుకోవడంలేదు దాన్ని గురించి.

"జస్ట్ ఇటీజ్ ఎ మాటర్ ఆఫ్ ఫాక్ట్" అన్నాడు అంటే

"సర్వ సామాన్యంగా జరిగే అతివాస్తవికత"ట!

నాన్నగారు ఎందుకో నావేపు కోపంగా చూచారు.



మళ్లీ చేసిన తప్పే (తప్పేనా?) చేయటం జరుగుతుంది.

ఏమీ తెలియని మనసు.

ఎటూ నిర్ణయించలేని వయసు.

ఎందుకో బలహీనం పరిపాలిస్తే తలొగ్గుతున్నాను.

కాదని అనలేకుండా వున్నాను.

బాధలోనే ఆనందం!!

విషాదంలోనే సుఖం!!

నా మనస్సులో కూడా ఏ అంతరాంతరాల్లోనే యింతటి వాంఛ యిమిడి వుందికాబోలు!

మనస్సులో యిది ఈ రోజు నెలవేసిందా?

ఇంతక్రితమే వుండి ఈ నాడు మొల్క వేసిందా?

నేను కూడా యిందుకు బాధ్యురాల్నే కదా?

కాక?

అయినా

తప్పు, ఒప్పు అనేది ఎప్పుడు, ఎక్కడ నిర్ణయింపబడతాయి,...

చాలా గడబిడ జరిగింది. ఈరోజు.

నేను నెలతప్పటం గురించి చాలా చర్చ జరిగిందట వీధిలో!

నాన్నగార్ని ఎవరో వీధిలో చాలా నీచంగా అన్నారట.

నాకు తెలీంది వీధికి ఎలా తెలిసింది?

అవును నేనే మరచిపోయాను.

ఆనంద సముద్రి వీచికల్లో తేలియాడుతూ—

కాలచక్రంలో నెలన్నర తిరగటమే మరచాను.

నాన్నగారు నన్ను కొట్టబోయారు.

ఆయన--బావ--అడ్డం వచ్చారు.

ఆయన్ని కొట్టబోతే—

"ఆగవోయి-మహా వీరుడిలా వస్తున్నావ్. నా తప్పేం వుంది...అయినా అంత గొంతు చించుకోవాల్సిన అవసరమూ, దండించాల్సిన ఆవశ్యకతా ఏముంది. ఇంతకీ నేను పెళ్ళి చేసుకుంటే అన్నీ తీర్తాయికదా...చేసుకుంటాలే" అన్నాడు.

నాన్నగారు ముఖం అంతా మాడ్చుకుని బయటికి వెళ్ళి పోయారు. నాకేదో భయంగా వుంది....



అంతే!

నాన్నగారు మళ్ళీ తిరిగి రాలేదు...

అబ్బ భరించరాని రంపపు కోతగావుంది...

నాన్నను విడిచి బ్రతకటం ఎలా!

అవన్నీ సరే!

తినటానికి తిండి!

నాన్నతోనే అది పోయిందా?

ఉన్నది అంతా అప్పులాళ్ళు వచ్చారు. లాక్కెళ్ళారు...
నాన్న లేరు...ఆస్తి లేదు...

ఎలా బ్రతకటం...

"ఎక్కడికైనా వెళ్ళి పోదామన్నాను"

"వెళ్తే బ్రతకటం ఎలా? కూలిచేస్తావా? అన్నాడు
"ఏం చెప్పను?"



ఈ రోజు యిక్కడికి వచ్చాం.

కొంచెం సాహిత్య గ్రంథాలు తప్ప మరేమీ వెంట రాలేదు.

నాన్న స్మృతికి అవి మాత్రమే మిగిలాయ్.

నాన్న నైర్మల్యానికి చిహ్నంగా చక్కటి గ్రంథాలు.
చాలు!

అంతకన్నా ఏం కావాలి.

వెంట డబ్బు ఏమీ తెచ్చుకోలేదు.

అయినా ఎలాగో, ఓలాగు బ్రతకలేమా?



ఛీ! ఛీ!

ఏమిటి ఇలాంటి ప్రదేశంలోకి వచ్చాము.

అదే మాట అడిగాను

"ఏం నీకంటే చెడిపోయారా?"

నిర్ఘాంత పోయాను!

"వాళ్ళకంటే నీవు ఏ విధంగా శ్రేష్ఠం?"

మరో పిడుగు!!

"అధిక ప్రసంగం చేయకు"

భగవాన్!!!

పద్దీ రంపపు కోత



బావ చాలా ఆనందంగా వున్నాడు

తుళ్ళి తుళ్ళి నవ్వించాడు.

మళ్ళీ ఎన్నాళ్ళకి!

ఎంత తీయగా కబుర్లు చెబుతాడు.

ఎక్కడో ఫ్రెస్‌లో ఉద్యోగం దొరికిందట.

మా జీవితానికి అంతకంటే జీతం కావాలా?

బుల్లి పాపాయ్...

అబ్బ!

ఎంత ఆనందం!!

అయినా ఎంత సిగ్గు!!!

నా ఆరోగ్యం చక్కబడడానికై ఏదో మందు తెచ్చాడు.

అవి తింటే "బాబు" బలంగా పెరుగు తాడట!

  

తను ఇంకా జీవించే వుంది.

తన ప్రాణాధికమైన తండ్రిని పోగొట్టుకుంది.

ఎవరికోసం?

ముక్కు మొహం తెలియని వారికోసం.

సిగ్గు లేక బ్రతుకుతోంది తను.

తన ప్రాణంలోని ప్రాణాన్ని పోగొట్టుకుని

ఎవరికోసం?

తనకు ఏమీకాని ఓ మూర్ఖుడికోసం.

మనసా! ఈ మనిషిని విడిచిపో!

లేదా—

నీవు చావు.

లేదా—

నన్ను చంపు.



బావా...

అనుకోవటానికే సిగ్గుగావుంది ఆమాట.

అతనితో మట్లాడటమే మానేశాను.

ఈ నెల నాళ్ళూ అతను నాకు దూర దూరంగా వున్నాడు.

దగ్గరికొచ్చాడీరోజు!

అసహ్యం వేసింది.

బానిసనట!

తృప్తికోసం తయారైన యంత్రాన్నట!!

అడ్డం వస్తుందనే ఆ మంచెచ్చాడట!!!

ఎవరు చెప్పినా నమ్మలేని నిజం!

ఎవరికి చెప్పినా నమ్మసాధ్యం కాదనే నిజం

అయినా ఇది నిజం.

తిరస్కరించాను.

కొట్టాడు.

సహించాను.

తిట్టినా, కొట్టినా, చంపినా సహిస్తాను.

కానీ!

అతడకి మళ్ళీ లొంగను.

అదొక పీడకల అంతే!

మనస్సంతా చికాకై పోయింది విజయకు.

ఆమె మనస్సులోని క్రోధమంతా మూర్తీభవించి "బాబుని" మింగేట్టుంది ఆమె తరహా!

నిజానికి రమణ చెప్పకపోతే యిలాంటి వ్యక్తులు ప్రపంచంలో వుంటారన్నా నమ్మలేదు తను.

ప్రత్యక్షంగా సుజాత కనిపిస్తోంది

అతను...అతను...ఆ రాక్షసుడూ వున్నాడు.

వ్రాసుకొన్న "మనోదర్పణం" ఎదురుగా వుంది

ఇక నమ్మకపోవడం ఏలా?

రమణవేపు చూచింది.

అతను నిద్రపోతున్నాడు.

ఏదో స్వప్నలోకాల్లో సాగిపోతున్నట్టున్నాడు.

విషాదంగా నిట్టూర్చి,

మళ్ళీ డైరీ చదవటంలో మునిగిపోయింది



అతనూ, అతనివెంట మరో యువకుడూ వచ్చారు.

భోజనం వడ్డించాను. తిన్నారు.

తాంబూలం వేసుకుని "నేనలా వెళ్ళొస్తాను. వీరిక్కడే వుంటారు అని" నా జవాబుకి ఎదురు చూడకుండా వెళ్ళాడు.

మరో పరాయి వ్యక్తితో ఒంటరిగా గడపటం ఎలా?

ఇంట్లో మరెవరూ లేదు?...

అతను మంచం మీద కూర్చున్నాడు.

నా వేపు ఏదో వింత దృష్టితో చూస్తున్నాడు.

కాస్సేపు గడిచింది.

అలాగే తడక కానుకుని నిదురపోయాను

ఎవరివో ఉచ్ఛ్వాస నిశ్వాశాలు తీవ్రంగా వినిపిస్తున్నాయి

ఎవరిదో చేయి తలమీద పడింది.

ఉలిక్కిపడి కళ్ళు తెరిచాను.

ఆ నూతన వ్యక్తి చాలా దగ్గర్లో వున్నాడు.

విరసుగా లేచాను.

కంపించే కంఠంతో అన్నాడు

"ఫరవాలేదు. కూర్చో"...

చేయి పట్టుకోబోయాడు. విదిలించి కొట్టాను.

కోపంతో అన్నాడు

"ఏమిటీ శృంగారం? రా!"

"నేనూ అదే అడుగుతున్నాను. ఆయనవెంట మీతు? డిలా వచ్చి ఆయన బయటికి వెళ్ళినప్పుడు భార్యతో సరసా లాడేటంత గుండెధైర్యం నీ కెలా వచ్చింది. ఆయనకి తెలిస్తే నిన్ను చంపేస్తాడు" వికటంగా నవ్వి అన్నాడు.

"కాదు. అతనికి ఇది తెలిస్తే నిన్నే చంపేస్తాడు. అతనికి నీవు భార్యవు కాదు. అతను నీకు 'ఆయనా' కాదు! నాకు తెలుసు. ఇరవై రూపాయలకోసం నా భార్యవవ్వటానికి ఒప్పుకున్నాడు. కావాలంటే అడిగితే నీకూ యింత యిమ్మన్నాడు" హుందాగా పదిరూపాయలనోటు విసిరేశాడు

తీవ్రంగా చూచి దాన్ని అందుకొని ముక్కలు ముక్కలుగా చింపాను.

కోపంగా మూర్ఖంగా వచ్చి నన్ను పట్టుకున్నాడు.

తెలియని తీవ్రశక్తితో అతని జబ్బకొరికాను.

అంతే!

దెబ్బతో పారిపోయాడు....

తలుపువేసి మంచంమీదపడి ఏడుస్తున్నాను.

హఠాత్తుగా తలుపు తీసుకుని వచ్చాడు బాబు.

తూలుతున్నాడు. ఏదో వాసన వేస్తోంది

ఏయ్ ధగిడీ! నా మాట కాదంటావా? గరే! ఇక నీకూ నాకూ రాం! రాం!

ఎవరితోనైనా తిరుగు. ఎవడినైనా దగ్గరికి తీసుకో! నాకు సంబంధం లేదు. వెళుతున్నాను. అల్లరి చేశావా. నేనెవరో తెలుసా రౌడీ బాబుల్... బాబుల్ రౌడీ.. నోరు మూసుకుని చావు. నోరు తెరిచావా చస్తావు".

వెళ్ళిపోయాడు.

భగవాన్!

పది రోజులైంది బాబుల్ వెళ్ళిపోయి.

తిండికి సాగడం కూడా కష్టంగావుంది.

కమలని పిలిచి కమ్మలు అమ్మించి ఎలాగో నెట్టుకొస్తున్నాను. అయినా యిలా ఎన్నిరోజులు? బ్రతకటం ఎలా?

వద్దు భగవాన్? నాకీ శిక్ష!

జీవితం వరమా? శిక్షా?

ఏమి వరము!

ఉరిశిక్ష కాక. చావుమేలు ఈ జీవితం కంటే?

* * *

మళ్ళీ వచ్చాడు.

"తే! తాళితే?"

అర్థం అయ్యేలోగానే తాళి తెంచుకుని వెళ్ళాడు.

కట్టుకోటానికి పూసలు కూడా లేవు.

కమలని అడిగితే ఎగతాళి చేసింది.

* * *

ఎంత చిత్రమైనరోజు!

ఎవరో కుర్రవాడు. తమ్ముడని పిలుస్తున్నాడు.

ప్రసాద్! ప్రసాద్!! ప్రసాద్!!!

చిత్రమైన వాంఛతో, విచిత్రమైన కోరికతో వచ్చాడు.

నవ్వుకున్నాను. అతని అమాయకత్వానికి.

జీవితంలో నా సంగీతానికి మెప్పుదల పొందినరోజు వచ్చింది.

* * *

పార్కులో బ్లాకల్ బెదిరించాడు.

పైకం సంపాదిస్తున్నానని బెదరింపు. ఛీ! ఛీ!

మానవతిమైన ఆడదానికి అంతకంటే శిక్షవుందా!

అయినా కోపం చంపుకున్నాను.

అవును దుర్మార్గుడిపై కోపం చంపుకోవాలి! ఆగ్రహం అణచుకోవాలి!!

* * *

ప్రసాద్ తెలుసుకున్నాడు

అతను ఏమీ అనలేదు.

నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు. ఎందుకు?

* * *

పరిస్థితులంతా వివరించి, ఎవరో దివాకరం రమణల సలహాటనట, నన్ను ప్రసాద్ తన యింటికి తీసుకెళ్ళాడు!

చక్కటి వసతివున్న భవనం. ముందు ఇబ్బందిగా వున్న తర్వాత సర్దుకుపోయాం.

అక్కా– తమ్ముడు కలసి జీవిస్తే యిలాగే వుంటుందా! అయినా జీవితంలో విధురత్వం లేదా?

* * *

ఇక్కడికి వచ్చి సరిగా నెలరోజులైంది.

రమణ, దివాకరం వచ్చారు.

వారి అందరి ఎదుటా మనస్సు ఆనందంతో గంతులు వేసినట్టు కాలం సాగింది.

* * *

ఈరోజు ప్రసాద్ ఏదో అడిగాడు.

దుఃఖం వచ్చింది.

రమణ ఓదార్పు!

అది ఓదార్పు కాదు. చెదరిన మనస్సుని కుదుట కూర్చోబెట్టటం. నా డైరీలాంటి డైరీ యిచ్చాను. చదివాడు

* * *

రమణ జీవితానికీ, జీవానికీ, మనసుకీ, మనిషికీ దగ్గరిగా వచ్చేస్తున్నాడు.

ఎందుకో అర్థంకాని ఆపేక్ష, అర్థాన్నివ్వలేని అనుభవం లేని అనుభూతి అంతరాంతరాల్లో కదులుతోంది.

కానీ మనసుకి, మనిషికి ఆవేశం రావటంలేదు.

శీతల చందన స్పర్శలా వుంది అతని సాన్నిధ్యం.

అయినా అతడిమీద నేను ఫలించని కోరికల మేడల్ని కట్టుకోవటం లేదు కదా!

విరిగిన కెరటం లాంటి జీవితం, కాలసముద్రంలోనే కలసిపోవాలా?



విజయకు కన్నీళ్ళు తిరిగాయ్.

ముగిసిన డైరీని పక్కన పెడుతూ రమణవేపు చూచింది.

గడియారం ఒకగంట వేసింది.

బాబోయ్. పండ్రెండున్నర!!

మళ్లీ నాల్గింటికే లేవాలి!

ఆలోచనా తరంగాల్ని ఆవలికి నెట్టుతూ నిద్రాదేవిని తన బరువు కౌగిలికి దగ్గరిగా లాక్కోమని ప్రార్థించింది.

# 17

ఆకాశం నిర్మలంగావుంది.

నిట్టూర్పులతో కప్పబడిన అద్దంలా చంద్రబింబం మంచుతో కప్పబడివుంది. అక్కడక్కడా తారకలు మినుకు మినుకు మంటున్నాయ్.

చాలా ఎత్తుగా రెండు తెల్లటి పావురాలు ఎగురుతున్నాయ్.

ఒకదాన్నొకటి పరస్పరం ప్రేమవీక్షణాలు చూచుకుంటూ, చిరునవ్వులు చిందించుకుంటూ ఆహ్లాదకరంగా రెక్కలు టప టప లాడించుకుంటూ పోతున్నాయ్.

చిత్రంగా పావురాలు ఆకాశ గహ్వరంలోకి చొచ్చుకుపోతున్నట్టుగా ఎంతో ఎత్తుగా ఎగురుతున్నాయ్! ఎంత విచిత్రం!

సంతోషమే రూపంగా, హ్లాదమే ఆహారంగా, జీవనమే జ్యోతిగా, పరువమే దారిగా, పరిణయమే ఊతగా ముందుకు సాగుతున్నాయ్.

ఉన్నట్టుండి హఠాత్తుగా ఆకాశం గర్జించింది.

పావురాలు జడుసుకున్నాయ్.

ఈశాన్య మూలని బయలుదేరిన జీమూతం కంబళిలా ఆకాశాన్నంతా కప్పివేస్తోంది.

పావురాలు దాన్నుండి తప్పించుకోవాలని మరీ తీవ్రంగా ఎగురుతున్నాయ్.

మళ్ళీ ఆకాశం మార్మ్రోగింది!

గర్జన వెంటే పిడుగు !!

పిడుగు కాదు...పిడుగు కంటే భీకరమైన కంఠస్వరంతో అరుస్తూ ఎదురుగా ఓ పెద్ద గద్ద వస్తోంది.

గద్దని చూసి ఆడుపావురం బెదిరింది.

జంటనున్న మగపావురం మరికాస్త దగ్గరగా వచ్చింది.

వెలుగుని అంతా మింగేసి నల్లని చీకటి రాక్షసిలా రాజ్యం చేస్తోంది.

రాను రాను గద్ద కాలయముడిలా దగ్గరికి వస్తోంది.

ఆడు పావురం గిజ గిజ లాడుతోంది.

ఆయ్!

అయిపోయింది.

గద్ద దగ్గరిగా వచ్చి రెండు పావురాల మధ్య దూసుకుని పోయింది—

వాటిని ఏమీ చేయలేదు.

మగపావురం ఉత్తరం వేపుగా సప్తర్షులు క్రిందికి వెళ్లింది.

ఆడుపావురం దక్షిణ దిశకి విసరి వేయబడింది.

కాస్సేపు గాఢాంధకారం!

అంతలో వెలుగు.

 

మసక మసకగా అది చెదరి పోయింది

మళ్ళీ నిర్మలాకాశంలో రెండు విమానాలు ఎగురుతున్నాయ్.

శాంతి దూతల్లా, స్వర్గాన్నించి భూలోకానికి వచ్చే దివ్యుల్లా వున్నాయి విమానాలు.

అవి విమానాలేనా ?

నిశితంగా చూస్తే మనుష్యులు ఆ ఆకారం దాల్చినట్టుంది.

గంధర్వులేమో.

రెక్కలు విసురుగా విసురుకుంటూ జంటగా ముందుకి సాగి వెడుతున్నాయి .

స్వర్గాన్నించి శాంతిని, సుఖాన్ని తెస్తోంది ఓ విమానం!

నాకాన్నుంచి సంతోషాన్ని, సంపదని తెస్తోంది ఓవిమానం

" మనం ఇద్దరం కలిస్తే ! ''అనుకున్నాయి విమానాలు.

'సంపూర్ణమైన జీవితం" అంది ఓ విమానం.

'' కొరతలేని జీవనం '' అంది మరోవిమానం.

రెండూ నవ్వుకున్నాయి.

మెల్లిగా ఓ విమానం ఓ సంగీత గీతం పాడనారంభించింది.

అందులో సాహిత్యం లేదు. కేవలంఅంతా సంగీతమయం.

మరో విమానం తాను కూని రాగాలుగా పాడింది.

అందున సంగీతం లేదు కేవలం సాహిత్యమయం.

రెండూ గొంతుకలు కలిపాయి.

ఇప్పుడు రెండు సంగీతాలు లేవు.

రెండు గీతాలు లేవు.

ఒకే ఒక గీతం- దానికి ఒకే ఒక సంగీతం-

శృతిలో అపశృతి పలికింది గీతానికి శబ్దవాఖ్యతపోయింది.
రెండూ బిత్తరపోయి ఆగాయి.

పైనున్న మరో విమానం వికటంగా నవ్వి రెంటినీ వేరు చేస్తూ మధ్యన వెళ్ళింది.

అంతే!

సంగీతం పాడిన విమానం పైకి ఎగరగొట్టబడింది.
మూగపోయింది.

గీతం పాడిన విమానం అధోలోకానికి తొక్కి వేయబడింది. మౌనం వహించింది.

కాలం నిశ్శబ్దంగా సాగుతోంది.

 

సముద్రతీరం !

చల్లగా గాలి వీస్తోంది !!

బీచి అంతా నిర్మానుష్యంగా వుంది !!!

చిన్నగా గాలివీచింది. ఇసుక చెదరిపోయింది.

రెండు ఆకారాలు ఇసుకలోంచి లేచి నిలబడ్డాయి.

ఫుల్ ఉలెన్ సూటులు తలకి మఫ్లర్ చుట్టుకుని హుందాగా నిలబడిందో ఆకారం ! దాని పక్కనే చక్కని నైలాన్ చీరలు, టెర్లిన్ రవికలు అందంగా అమరిన దేహంలో తలకి చల్లగాలి సోకకుండా మఫ్లర్ చుట్టుకుని వుంది ఇంకో ఆకారం !!

నిశ్శబ్దంగా ఒకర్ని ఒకరు చూచుకుంటూ నిలబడ్డారు.

విచిత్రంగా వారికి సముద్రం ఆవలి ఒడ్డు కనిపిస్తోంది...

ఆశగా అటే చూస్తున్నారు...

ఏవో అక్షరాలు సముద్రంలోంచి బయటికి వస్తున్నాయి. అన్నీ కలపి చదివారు

"సౌఖ్యసముద్రం...ఆనంద తీరం..."

అవతల సముద్రం ఒడ్డున ఏదో బోర్డు కనిపిస్తోంది.

అంత దూరం దృష్టి ఆనుతుందా అనుకున్నారు.

అస్పష్టంగా ...స్పష్టంగా...కనిపించింది "హ్లాదదీవి"

"హాయ్! హాయ్!! చప్పట్లు కొట్టింది నైలాన్‌లోని ఆకారం. నవ్వింది దానిజత. ఏం అక్కడికి వెడదామా అన్నట్టు.

"ఎలా" అన్నట్టు చూచింది.

అంతలో ఒడ్డున ఓ ఓడ కనిపించింది.

పరిగెత్తి ఆనందంగా వెళ్ళారు. ఎక్కారు.

ఓడ మెల్లిగా సంతోషపు నౌకలా సాగుతోంది...

మెల్ల మెల్లగా ఓడ ఆనందతీరం దాటి, సౌఖ్యసముద్ర మధ్యం చేరుకుంది. ఇంకాస్సేపు వెళితే హ్లాదదీవి చేరుకో వచ్చు...

ఇద్దరి ముఖాల్లో సంతోషం తాండవిస్తోంది.

ఉన్నట్టుండి ఓడకింద ఏదో చప్పుడైంది.

ఓడలోకి నీళ్ళు వస్తున్నాయి!

భయం వేసింది. బాగాచూచారు.

కింద ఎవరో జలాంతర్గామిలో వచ్చి ఓడకి రంధ్రం వేశారు...

భీషణ వికటాట్టహాసం వినిపించింది.

ఓడనిండా నీళ్ళు ! నీళ్ళు ! తలకిందులైంది ఓడ.

అబ్బాయి దారి దొరక్కుండా జాడ తెలియకుండా ఒడ్డుకి విసరివేయబడ్డాడు కెరటంలో ! అమ్మాయి జాడే తెలియదు !!

 

ఏదో అందమైన నగరం !

పూలతోటలూ, పూలబాటలూ ఎక్కువగా వున్నాయి నగరం నిండా !

జంటలు జంటలుగా స్త్రీ పురుషులూ, స్త్రీలూ, పురుషులూ వెడుతున్నారు తోటల్లోకి !

అన్నీ అందమైన జంటలు ! చూడటానికి కళ్ళు ఆనటం లేదు !! గుర్తు తెలుస్తోంది !

అవి పబ్లిక్ గార్డెన్స్ !!

అది హైదరాబాద్ !!!

అందమైన ఆడదాని మత్తులాంటి హైదాబాద్ !

చిలిపి చలాకి పిల్ల మనసులాంటి పబ్లిక్ గార్డెన్స్.

ఓ !

పబ్లిక్ గార్డన్స !

ఓ అందమైనజంట.

చెట్టా పట్టా లేసుకుని రైలుపట్టాలెంట పరిగెత్తే ఎక్స్ ప్రెస్‌లా వెళుతున్నారు...

మనల్ని అడ్డేవారే లేరు. మనకేం అడ్డం అన్నట్టు సాగుతున్నారు...

హఠాత్తుగా వారివెనుక ఓ రాక్షసాకారం పడింది.

వారివెంట అది కుంటు కుంటూ సరిగా వారిని అందుకో లేకుండా వుంది.

ఆ జంట ఓ పూల గుట్టదగ్గర ఆగారు.

మల్లెలు, జాజులు, గులాబీలు, సంపెంగలు......

నీ మక్కులా వుందిది ... నీ పెదవి ఇది ... ఇవి నీ కన్నులు ... ఇవి నీ చెక్కిళ్ళు ......

అమ్మాయి నవ్వింది ...

రాక్షసుడు వారిని అందుకున్నాడు.

అబ్బాయికి అమ్మాయికి సరిగా మధ్యన నిలబడ్డాడు.

చంకక్రిందనున్న కఱ్ఱ తీసుకున్నాడు.

పైకి ఎత్తాడు.

ఓయ్ బాబోయ్. చంపేస్తాడా ఏమిటి ?

తీవ్రంగా కిందికి గించాడు.

అమ్మాయి అబ్బాయి ఎందుకో జరిగారు.

మధ్యగా వాలింది కజ్జు.

గులాబీలు, మల్లెలు, కలువలు, సంపెంగలు నలిగి పోయాయి.

 

కళ్యాణ మంటపం !

రంగు రంగుల దీపాలతో, రకరకాల పుష్పాలతో అలంకరించారు మంటపాన్ని. రత్నాల ముగ్గులు పోశారు. ముత్యాల వరసలు వేశారు.

వజ్రాల దీపాలు వెలుగుతున్నాయి ...

మంటపంలో రెండు పీటలు వేశారు.

హేమ నిర్మితం అయిన వాటికి, చుట్టూరా రత్నాలు పొదిగారు.

మధ్యన ఓ మాణిక్యం బొద్దులా వేశారు.

ఓహ్ !

ఏం ఠీవిగా, ఎంత హాయిగా ధగా ధగా వెలుగుతోంది !

సాలంకృత అయిన కన్య ఓ పీటమీద, మరో పీట మీద పెళ్ళికుమారుడూ కూర్చున్నారు.

ఇద్దరు మందహాసాల్తో పరస్పరం చూచుకుంటున్నారు.

కొంగ్రొత్త వధూ త్రిప పాలనలో అమ్మాయి అబ్బాయివేపు సరిగా చూడలేక పోతోంది.

అమ్మాయి ముఖం తన కాలిచివరనున్న మెట్టెను చూస్తోంది. అబ్బాయి ఆ వేలిని చూచి తామరతూడనుకున్నాడు.

ఓహో !

కాలివేలే యింత అందంగా వుంటే అమ్మాయి...

భజంత్రీలు ఒక్కసారిగా ఆకాశం దద్దరిల్లేట్లు మోగాయి...

ఉలిక్కిపడ్డారిద్దరు.

అమ్మాయి భయపడింది.

ఇంతలో ఎవరో ముసలిది కఱ్ఱ ఆధారంగా నడుచుకుంటూ వచ్చింది వధూవరుల్ని చూచి నవ్వింది. సభికులు ఆమె సంతోషానికి సంతోషించారు, కానీ అమ్మాయికి అందులో భీకర రాక్షసత్వం గోచరించింది.

హఠాత్తుగా ముసలిదాన్లో మాంత్రికురాలి లక్షణాలు కనిపించాయి.

కళ్లతో అలా వూపింది.

అమ్మాయి మాయమైంది-

అబ్బాయి పిచ్చెక్కిన వాడిలా నిలబడ్డాడు. ముసలిది కళ్లు మళ్ళీ వూపింది. అబ్బాయి ఎటో పోయాడు.

పీటలమీద మరి కాసేపులో నూతన వధూవరులు వెలిశారు.

సభికులు సంతోషంగా చూశారు.

వారిముఖాలు మాడిపోయాయి

ఆ వధూవరులు కారీ వధూవరులు.

 

పండు వెన్నెల రాత్రి.

మేడమీద ఆరుబయలు !!

అందులో రెండుమంచాలు వేయబడ్డాయి !!!

తెల్లటి మల్లెపూ ల్లాటి పరుపులు.

అసలా పండు వెన్నెల నిండు వెలుగులో రెండుమంచాలు కానీ అందుపైని రెండుపరుపులు కానీ కనుపించటం లేదు.

అల్లరి పిల్ల కొంటెచేష్టలా ఓ అఘాయిత్యపు మేఘం చంద్రుడికి అలా అడ్డొచ్చి వెన్నెల వే వెల్గుని మాయలేక సిగ్గుపడి చెదరి పోయింది. వచ్చీ రానీ ఆ మసక వెన్నెల వచ్చినపుడు ఆ మంచాలపై రెండు ఆకారాలు పడుకున్నట్టు కనిపించింది !

నిదానించి, నిఘా వేసి చూస్తే అందుపై గనూ, సుజాత నిద్రిస్తున్నారు !

నవ్వాడు నిద్దట్లోనే తను.

అనుకోకుండా అకస్మాత్తుగా ప్రచండ పవనం వీచింది.

పక్కనున్న మంచం లేచింది

ఆశ్చర్య పోతున్నాడు గను !

అదే ! గాలికి మంచమూ, మనిషీ ఎలా ఎగురుతారు?

పూర్తిగా కనిపించకుండా మాయమైంది.

భయంతో, ఆశ్చర్యంతో తను మంచంమీద లేచి కూర్చున్నాడు

అంతే !

మంచంతో సహా తనూ ఎటో లాక్కెళ్ళబడుతున్నాడు. తీవ్రమైన గాలి !

పదునాల్గు లోకాల్ని భయపెట్టే ప్రళయకాల ఝంఝూ మారుతం. ఏమీ కనుపించటం లేదు.

కొద్దికాలం మింగాడు కాలపురుషుడు.

అంతా ప్రశాంతంగా మారింది

మళ్ళీ వెన్నెల!

మళ్ళీ రెండుమంచాలూ వచ్చాయ్

ఇద్దరు వ్యక్తులు నిదురిస్తున్నారు.

ఇది ఎలా సంభవం?

తను లేడే అక్కడ?

మరెవరు?

నిశితంగా చూచాడు.

అప్రక్క మచంపై వుండేది సుజాతా¡

కాదు!

విజయ!!

ఆశ్చర్యపోయాడు.

మళ్ళీ ఇవతల చూచాడు.

అక్కడ రాజా!!

నవ్వుతున్నాడు.

మళ్ళీ చూచాడు.

ఆశ్చర్యం!

అక్కడ రాజా లేడు!

మరెవరు?

ప్రి ... సా .... ద్ !!!

ఏమిటేది?

అంతలో ఏదో మోగుతోంది?

ఏమిటది? ఏమిటది?? ఏమిటది???

అలారం!



# 18

అలారం మోగింది!

హఠాత్తుగా కళ్ళు తెరిచాడు రమణ.

కళ్ళు నులుముకుని లేచి కూర్చున్నాడు.

గూట్లో గడియారం నాల్గు గంటలు చూపుతోంది.

ఎందుకు ఈ వేళకే అలారం పెట్టాడు?

తన మట్టిబుర్రకి ఏదీ గుర్తుండదు.

తల గీరుకున్నాడు. ఓహో రాత్రి అనుకున్నాంగా.

తెల్లవారుఝాము పొద్దుగా విషయం. ఎంత మందమతి తను!

లేచాడు.

అతన్లో రాత్రి వచ్చిన రక రకాల స్వప్నాలు కొంచెం ఆనందాన్ని మరికాస్త భయాన్ని రేపుతున్నాయ్.

"అయినా స్వప్నాలకి భయ పడట మేమిటి?"

"'కలలో జరిగేది ఇలలో జరుగదు గదా?"

స్వప్నాల వ్యాఖ్యాన ప్రకరణానికి స్వస్తిశ్రీ చుట్టుతూ, చెల్లెలివేపు చూచాడు.

విజయ నిద్రపోతోంది ఇంకా. ప్రక్కనే సుజాత డైరీపేపర్లున్నాయ్.

అంటే రాత్రే పూర్తిగా చదివేసిందన్న మాటే!

అందుకే అలారాన్ని నిర్లక్ష్యం చేసింది.

నవ్వింది విజయ!

ఆమె ముఖంలో తృప్తి వెల్లి విరుస్తోంది.

చాలా ఆనందమైంది అతనికి!

తట్టుతూ పిలిచాడు

"విజయా! విజయా!!"

మెల్లిగా కళ్ళు తెరుస్తూ ఎదురుగావున్న అన్నని చూచి నవ్వింది- తలతిప్పి గడియారంవేపు చూచింది. నాలుగూ పదిహేను!! బాబోయ్!

మంచం మీంచి లేచి, నిలబడి వళ్ళు విరుచుకుంది.

పరుపు చుట్టేస్తూ అంది.

"మళ్ళీ పడుకోకుంట ఇంట్లోకి రాదూ!"

లేకపోతే మళ్ళీ శయనిస్తా ననుకున్నావా? మరీ అంత నిద్రపోతును కానులే! పైగా ఇదే చివరి నిద్ర అన్నట్లు మోజు పడటం లేదులే। పద పద కాగుకింద రాజేతువుగానీ!"

చలాకిగా నవ్వుతూ, తుళ్ళుతూ, పరిగెత్తినట్లుగా ఇంట్లోకి వెళ్ళింది.

ఆమె వెనకాలే నవ్వుతూ వెళ్ళాడు రమణ.

నిప్పు రాజేశాక ఇద్దరూ వచ్చిక నముల్తూ నిల్చున్నారు

పళ్ళు తోముకోవటం ముగిశాక ముఖం కడుక్కుంటూ అన్నాడు.

"కాఫీ ఎలా?"

"దాని ప్రశ్నే ముందన్నాయ్! ముందు తలకి పోసుకోవటం. తర్వాత టిఫిన్ తయారు చేయటం. ఆ తర్వాత

కాఫీకి వెడితే తెల్లవారుతుంది ఎలాగు! అప్పుడు టిఫిన్ తర్వాత కాఫీ "

విజయకూడ ముఖం కడిగేసుకుంది.

పీట వంచుతూ పిల్చింది అతన్ని.

మెల్లిగా తలంటుతూ అంది "అమ్మకడుపు చల్లగా అయ్యకడుపు చల్లగా ......"

పూర్తిగా అనకముందే నోరుమూశాడు రమణ.

"ఛెల్లాయ్. చిన్నవాళ్ళు అలా ఆశీర్వదించరాదు. తప్పు..."

ఏమీ అనకుండా తలంటు ముగించింది.

"కాస్తాగుతావా? లేకపోతే ఇప్పుడే పోసుకుంటావా?"

"కొంచెం నానితే మేలేకదా?"

"అదేం లేదులే! వస్తావా నీళ్లుబాగా కాగాయి "అంది వెచ్చదనం చూస్తూ.

"సరే!"

పీట వాల్చుకుని కూర్చున్నాడు

నీళ్ళు చిలకరించి తలరుద్దుతూ అంది

"అన్నయ్యా నీలో ఈ రోజు ఎందుకింత ఆనందం పొంగి పొర్లుతోంది చెప్పవా ?"

"చెప్పకేమమ్మా నీ కాక పోతే మరెవరితో చెప్పుకుంటాను.

కారణం ఆలోచించాల్సిన అవసరం కూడా లేదు నిన్నరాత్రి నేనూ కృష్ణమూర్తి ప్రసాద్ సుజాతా అంతా మాట్లాడుతూ కూర్చున్నపుడు నా రచన చదవమన్నారు. చదివాక అంతా చాలా మెచ్చుకున్నారు. ఎవరైనా తము చేసిన పనిని మెచ్చుకుంటే ఆనందం పొందటం సహజమే కదా ! అదే నమ్మా నాలో యింత ఆనందం పెల్లుబకటానికి కారణం !

సుజాత పేరు పలికేటప్పుడు అతన్లో ఓ విధమైన చలనం కలిగింది- అది గమనించి అంది విజయ.

"అన్నయ్యా ఆమె అంత ఆత్మీయురాలైందా"

రమణ జవాబు ఇవ్వలేదు. ఆలోచనలో పడ్డాడు.

విజయ కూడా రెట్టించలేదు.

రుద్దటం పూర్తి చేసి నీళ్ళు పోసింది.

వీపు రుద్దుతూ అంది.

"ఆమెను నీవు ఆదరించటంలో ఆసక్తి కనబడుతోంది

లేదన్నాయ్. ఆమె తప్పులేదు. క్షమా గుణం వున్నవారికి ఆమె క్షమార్హురాలే!". చెల్లెలి సంస్కారానికి అబ్బురపడ్డాడు.

"నిజం చెల్లాయ్. చక్కగా చెప్పావ్..."

కొద్దిసేపు గడిచింది. మళ్లీ అన్నాడు.

"విజయా నాకెందుకో ఇదే చివరిసారి నువ్వు తలంటు పోయటం అనిపిస్తోంది. మళ్ళీ నీవు పోయలేవు. నేను పోయించుకోలేను. అది జరగదేమో ననిపిస్తోంది. ఎందుకో!"

నవ్వుతూ అందామె.

"అదేమిటి అల్లా అడుగుతావ్. నీ మనస్సులో ఏదో తడితే నే నెలాగు సమాధానం చెపుతాను. నా కేమున్నా నీ మనసు శోధించే శక్తి వుందేమిటి?"

రమణ జవాబు ఇవ్వలేదు.

విజయ మళ్లీ అందుకుంటూ అంది.

"అయినా నాకు తోచింది చెపుతాను... వదిన వస్తుందేమో? ఇక నే నెందుకు ఆవిడ వస్తుంది కదా? అవును... నిజంగా నువ్వు త్వరగా పెళ్లి చేసుకోరాదూ? వదిన వుంటే ఏం చక్కగా హాయిగా ఆమెతో ఆడుకోవచ్చు. ఇదుగో చూడన్నయ్యా అప్పుడేం నువ్వు ఎప్పుడూ నాతో ఆడుతూ నీతో ఆడటానికి రాదని తగవుకి రాకేం"

రమణ పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వుతూ అన్నాడు

"అదేమిటి? ఆ. ఊహాగానాల్లో తేలిపోతున్నావ్. అప్పుడే నాకు పెళ్ళయినట్లు, ఓ వదిన నీకు వచ్చినట్లు, మళ్లీ యింకేమేమో జరిగినట్టు"

విజయ మౌనం వహించింది.

"అయినా అదేవిటమ్మా! నీకు పెళ్లికాకుండా నా పెళ్లెలా సాధ్యం అరే! నిజంగా నీవు నన్ను హెచ్చరించటం లేదుకదా?"

"ఛీ! ఛీ!"

"ఇంతకీ నీకు రాజా అంటే యిష్టమే నాయిరి! యింకే మిటి లే నీ పెళ్ళవుతే నా పెళ్ళి అదే అవుతుంది సదాసంగా. నిజానికి నచ్చిన వాళ్ళని చేసుకోవటం అదృష్ట మనుకో"

విజయ మాటాడలేదు.

"విజయా. నేను నాకు నచ్చిన వాళ్ళని చేసుకోవటం నీ కిష్టమే కదూ? అమ్మే మయినా అభ్యంతరం చెపుతుం దంటావా?"

"చాలా చిత్రంగా మాటాడతావే?...ఆ...లేకపోతే ఏమిటి మరి నీ కిష్టమైన వారిని చేసుకోకుండా మేం కాదం టామా! నీకంటే చక్కని వదిన్ని మేం తెచ్చుకుంటామా? అమ్మమాత్రం తనకి నీకంటే చక్కని కోడల్ని ఎన్నుకోవడం

తెలుసా ? అన్నయ్యా... ఇదంతా ఎందుకు నీ యిష్టమే మా యిష్టం సరేనా ...?"

నవ్వాడు రమణ.

తలతుడవటం ముగిశాక లేచి వెళ్ళి బయట కూర్చు న్నాడు సుభద్రమ్మగారు నిద్దర్లేచి వీళ్లాఘాయిత్యానికి ఆశ్చ ర్యపోయింది.

తెల్లగా తెల్లవారింది.

దినకృత్యాలు నిర్వహించుకోవటానికి అందరూ వెళు తున్నారు.

తమకంటే ముందుగా తనపని ముగించుకుని ఇంటికి వెళ్లి పోతాడేమోనని సూర్యుడిని చూచి ఈర్ష్యపడుతున్నారు కొందరు!

టిఫిన్ చేసి కాఫీ తాగుతున్నారు రమణ విజయ్!

నేనుగా వచ్చేశాడు రాజా! వాకిలి తీసుకుని.

విజయ లేచి లోపలికెళ్ళింది.

"రా! రా! రాజా!"

పీట ముందుకి లాగుతూ అన్నాడు రమణ.

కూర్చున్నాక "సారీరా బ్రదర్! ఒక్క కాఫీ మాత్రమే సప్లయ్ చేయగలం" అన్నాడు రమణ నవ్వుతూ.

"అంత మహాభాగ్యానికే థాంక్స్. అయినా ఈ ప్రొద్దుకే కాఫీని ఆదరంతో యిచ్చేవాళ్లు లేరు. అంచేత మరీ మరీ మెనీ మెనీ థాంక్స్ చెవుతున్నాను"

"ఏం రోయ్! చాలా ఎత్తు నెట్టుతున్నావ్ ఏమిటి కథ? ఇంత ఆనందంగా వున్నావ్"

కాఫీకప్పు క్రింద పెడుతూ అన్నాడు రాజా.

ఏముంది బ్రదర్. నేను ఇంత త్వరలో ఓ యింటివాడిని కావాలని నిశ్చయించుకున్నాను."

సంతోషంగా అన్నాడు రమణ.

"కంగ్రాచ్యులేషన్స్. అలాగే త్వరగా కానివ్వరా!"

"అదేరా బ్రదర్. నిన్ననే బెజవాడనుంచి వచ్చారు. ఎవరో రిటైర్డు డిప్యూటీ కలెక్టరట. ఒక్కతే అమ్మాయ్! ముందు కట్నం ఇరవై వేలట తర్వాత ఆస్తిఅంతా చెరిసగం యిస్తారట. అంటే మరేమీ లేదు. ఆస్తిలో హక్కు సగం మనకి మిగతాసగం అమ్మాయిది. చేసుకుంటావా అంటూ వచ్చాడు. వెంట అమ్మాయ్ కూడావుంది ఇంకా వెళ్ళలేదులే వాళ్లు. అందుకే ఇంత త్వరగా వచ్చేశాను.

ఫగలబడి నవ్వాడు రమణ.

"ఓహో అదా సంగతి. అందుకే నన్నమాట యింత ఉదయమే మా యిల్లు పావనంచేసి, మా కాఫీ పానంచేసింది.

సరి సరి వాళ్ళకి నిష్కర్షగా ఏమీ చెప్పలేక ఇలా పారొచ్చావా ? తప్పుకాదూ ? మళ్ళీ ఓ మూడు నాలుగు రోజులు హోటల్లో పడుండటం ఆ తర్వాత వాళ్ళు వెళ్ళారని తెలిశాక చల్లగా యింటికి వెళ్ళటం నాల్గు చివాట్లు తినటం. ఛీ ఛీ యింత పిరికి వాడవేమిట్రా ”

రాజా ఆశ్చర్యపోయి ఏమి జవాబివ్వలేదు.

“ సరే ! ఇక దాపరికాలు, దాగుడు మూతలు పనికి రావు. ఇద్దరమూ వెళదాం పద మీ నాన్నగారితో మాటాడదాం. ”

మెల్లిగా నసుగుతూ అన్నాడు రాజా !

“ అది కాదురా బ్రదర్. నాకు ఈ పెళ్ళి యిష్టమే. ముహూర్తంకూడా నిశ్చయం చేసుకుని వెళతారు వాళ్లు. ఈ సంగతి నీకు చెప్పటానికే వచ్చాను. నన్ను క్షమించాలి బ్రదర్ ”

పిడుగు పడ్డట్టయింది రమణకి.

ప్రపంచమంతా ఓ క్షణం తిరక్కుండా ఆగిపోయినట్లయింది. చలనంలేని సూర్యుడిని చూసి ఆగిన గ్రహాల్లాని ఖ్రాంత పోయాడతను.

“ నీకు ఆశ కల్గించాను బ్రదర్. తప్పే. చాలా తప్పు.

క్షమింపరాని నేరం. అయినా ఈ చపలచిత్తుడిని, పిచ్చికహృదయుడిని నీవే క్షమించాలి. నీవు క్షమించలేకపోతే ఇంక ప్రపంచంలో క్షమ అన్న పదానికే విలువలేదు. బహుశా ఈ వ్యవహారం మీ చెల్లిదాకా పోయుండక పోవచ్చు. ఒక వేళ ఆవిడికి తెలిసివుంటే మాత్రం నన్ను నిజంగా షూట్ చేసినా పాపంలేదు. అయినా నన్ను క్షమించాలి! ఈ దుర్బలుడిని ..."

రమణలో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయ్.

"ఇదేమిటి? ఇతను ఇంత చపలుడా? అన్ని విషయాలు ఎరగకుండా నేను పొరపడ్డానే! అయినా ఎందుకంత త్వర పడి చెప్పాను విజయకి. ఇంకా కొన్నాళ్ళాగి వుంటే బావుండేది. నిన్నటి ఆనందంలో మరచిపోయి అంతా పాడుచేశాను. ఆమె కేమిటి చెప్పటం? అసలు ఎలా చెప్పటం? చూస్తే ఆవిడకి పిడిమీద యిష్టం యింత కృత్రిమే వున్నట్టుంది. భగవాన్. ఎంత చిత్రంగా వుంటాయయ్యా నీ లీలలు!"

నిట్టూర్చాడు అతను.

రాజా తదేక ధ్యానంగా అతన్ని చూస్తున్నాడు.

"క్షమించటమే నీ క్కావలసివస్తే అది మా యిద్దరి నుంచి నీకు ఎప్పుడూ లభిస్తుంది రాజా!"

అంతకంటే అతను మరేమీ అనలేక పోయాడు.

లేస్తూ అన్నాడు రాజా!

"వస్తా బ్రదర్! మళ్ళీ సాయంత్రం కలుద్దామా? పార్కువేపు వస్తావా? పోనీ పిక్చరు కెళదామా?"

రమణకి ఆశ్చర్యం వేసింది. అతన్లో క్షణ క్షణానికీ కనిపించే చాపల్యానికి.

అలాగే. ఎక్కడైనా ఎక్కడికైనా సరే నీయిష్టం"

రాజా ఈల వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

 

# 19

రాజ వెళ్ళిపోయాక మనసంతా సూన్యంగా వుంది.

"ఏమిటీ విచిత్రం. నిన్నంతా అంతులేని ఆనందం. రాత్రి ఏవేవో అర్థంలేని కలలు. ఉదయమే ఈ అయిష్టకరమైనవార్త. బహుశా ఈ వార్తాశ్రవణానికే రాత్రంతా ఆ దుస్స్వప్నాలు వచ్చాయేమో! అవును బహుశా అందుకే అయి వుంటాయ్. అయినా ఇక ఇంతటితో ఈ స్వప్నాలు ఆగిపోతే...స్వప్నఫలితం ఆగిపోతే...ధన్యుడిని..."

కుర్చీలు నిర్లిప్తంగా పడుకున్నాడు.

కళ్ళు మూసుకుని దీర్ఘంగా ఆలోచిస్తూ, విచారిస్తు న్నాడు.

ముఖం అంతా చిరు చెమటలతో నిండి వుండడంతో అతని మనస్సు చాలా వ్యాకుల పడతోందని తెలుస్తున్నది.

హఠాత్తుగా దివాకరం తలుపుతీసుకుని వచ్చాడు!

ఆ చప్పుడికి ఉలిక్కి పడ్డట్టు కళ్ళు తెరిచాడు రమణ.

ఎదురుగా దివాకరం

అతని కండ్లంతా వాచి వున్నాయ్.

ముఖం పీక్కుపోయిందీ.

మనిషి వూగి పోతున్నాడు.

ముక్కు పుటాలు చాలా తీవ్రంగా ఎగురు తున్నాయ్

పెదవులు ఒకచోట నిలువకుండా అదురు తున్నాయ్.

చాలా ఆతురతతో ఎంతో దుఃఖంతో పరుగెత్తుకుని వచ్చాడల్లే వుంది.

రమణ కళ్ళు తెరచి అలాగే చూస్తున్నాడు.

ఏమీ మాట్లాడటం లేదు.

అతని మనస్సంతా మొద్దు బారిపోయింది.

మెదడుకి ఆలోచనా శక్తి ఎక్కువై, ఆ వేడికి అది కరిగిపోయి నట్లుంది.

దివాకరం కనులప్పగించి చూస్తున్నాడు.

రమణలో చలనం లేదు.

దివాకరం అన్నాడు.

" రమణా! సుజాతా చనిపోయింది! "

అతని కంఠం దుఃఖంతో పూడుకపోయి, విషాదానలంతో దగ్ధం చేయబడి మాట స్ఫుటంగా పలుక నివ్వటంలేదు.

" ఏమిటి ? "

అదిరిపడ్డాడు రమణ.

దివాకరం బిత్తర పోయాడు అతన్లో కలిగిన చలనానికి.

" సు...జా...త...చ...ని...పో...యిం...ది "

అష్టగ్రహకూటమి కలిగితే సర్వప్రపంచం దగ్ధమై లేదా ప్రళయకాల జనిత ప్రవాహంలో ముంచెత్తబడి పోతుందని భ్రమపడింది అబద్ధమే !

కానీ

అష్టాక్షరం సంపుటమైన ఆ దుర్వార్త, ఘోర భీకర

గర్జన్యా రావంలా అతని కర్ణ పుటాన్ని ఛేదించి, అతని మానస ప్రపంచాన్ని దగ్ధం చేసింది.

అంతే!

"సుజాతా!"

బిగ్గరగా అరచి ఎదురుగా వున్న దివాకరాన్ని తోసి అదే పరుగున వీధిలోకి పడ్డాడు రమణ.

సగం తెరచి వున్న వాకిలి నుదురుకు కొట్టుకుని గూడు కట్టింది.

వీధిలో అలా పిచ్చిగా పరిగెడుతున్న రమణని చూసి ఆశ్చర్య పోతున్నారు తెలిసిన వాళ్ళంతా.

ఆ దాటున అలాగే ప్రసాద్ యింటికి వెళ్ళాడు.

దార్లో బస్సుల క్రింద పడబోయి తప్పించు కున్నాడు.

రిక్షాలతో డాష్ యివ్వబోయి తప్పించు కున్నాడు.

సైకిళ్ళకి డాష్ యిచ్చి వాళ్ళని కిందేసి, తనూ కింద పడి, వాళ్ళు తిడుతూ వుంటే లెక్కించు కోకుండా పరిగెత్తాడు.

ఎందరో వ్యక్తులని స్త్రీ పురుష విచక్షణ లేకుండా అడ్డు తగిలి వాళ్ళు విడ్డూరంగా చూస్తుంటే ముందుకి పరుగెత్తాడు

ఇంటి కెదురుగా పోలీస్ వాన్ వుంది.

వాకిట్లో వున్న పోలీసుల్ని నెట్టుకుని ఒక్కదాటున లోపలికి వెళ్ళాడు.

క్రింద ఇంకా కొందరు పోలీసులున్నారు.

ఇతన్ని చూచి వాకిట్లో జరిగింది గమనించి నిచ్చేష్టు లయ్యారు.

ఒక్కదాటున మేడ మెట్లెక్కాడు.

పైన కుర్చీలో ఇన్స్పెక్టర్ వున్నాడు.

గది దాటుకుని వెళ్ళాడు.

మంచం ప్రక్కన కుర్చీలు తల చేతులమధ్య యిరికించుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు ప్రసాద్.

పక్కన మంచంలో సుజాత !

సుజాత కాదు !!

సుజాత శవం !!!

" సుజాతా ! "

గట్టిగా కేకేసి అలాగే మంచం మీద పడిపోయాడు.

ఇన్స్పెక్టర్, ప్రసాద్ ఇద్దరూ ఆశ్చర్య పోయారు ఆ అరుపుకి ! నిశ్చేష్టు లయ్యారు యిద్దరూ.

పది నిమిషాలు గడిచాయ్.

రమణ లేచాడు.

సుజాత చెక్కిళ్ళు నిమిరాడు.

చేతులు కాళ్ళు అన్నీ ఒక్కసారి నిమిరాడు.

మృదువుగా కళ్ళమీద చేతితో అలా తాకాడు.

ఎఱ్ఱగా మెరుస్తోన్న పెదవుల్ని చేతిలో అలా అలా స్పృశించాడు.

అంతే!

అలాగే వెనక్కి తిరిగి చూడకుండా ఎవర్నీ పలుకరించకుండా వెళ్ళి పోయాడు.

ఎవరు పిలిచిందీ వినిపించలేదు.

ఎవరు పిలుస్తున్నదీ వినిపించుకోలేదు.

అలాగే మౌనంగా మెట్లుదిగి బయటి ప్రపంచంలోకి వెళ్ళి పోయాడు.

అంతే!

  

# 20

రమణ అంచిన అరుపుకి హడలిపోయింది విజయ.

భయంతో గజగజా వణుకుతూ బయటికి వచ్చింది.

అక్కడ రమణ లేడు.

అలాగే నిశ్చేష్టుడై గోడకానుకుని వున్న దివాకరం వున్నాడు.

భయం రెండింతలైంది.

" దివాకరంగారూ ! "

ఆ మాటలు ఆమె గొంతులోనే దాగిసలాడాయి.

గొంతు సవరించుకుని మళ్ళీ అంది.

" దివాకరంగారూ ! "

ఉలిక్కిపడ్డాడు దివాకరం

తేరుకుని అన్నాడు.

" అన్నయ్య ఏడమ్మా ! "

ఆశ్చర్యపోయింది విజయ.

"అరే! అదేమిటండీ అలా అడుగుతున్నారు. అన్నయ్య ఇంతవరకూ యిక్కడే వున్నాడు. రాజాగారు కూడా వుండాలి. అసలు మీరెప్పుడు వచ్చారు? ఏం జరిగింది మీరలా వున్నారు?

అన్నయ్య "సుజాతా" అని అరచాడెందుకని? అయితే మీకేమీ తెలీదా? అన్నయ్య ఎక్కడికి కెళ్ళినట్టు"

దివాకరం ఏమీ మాట్లాడలేదు.

అతనికి ఒక్కొక్కటే స్మృహలోకి రాసాగింది.

తనొచ్చాడు.

రమణ యిక్కడే వున్నాడు.

ఆ వార్త చెప్పాడు.

రమణ అరుస్తూ తన్ను తోసుకుని బయటికి వెళ్ళాడు. అవును తనూ...

మౌనంగా దివాకరం కదలబోతుండే సరికి విజయ మళ్ళీ అడిగింది.

"ఏమిటండి ఇది. అన్నయ్య ఎందుకలా అరిచాడు?... ఎక్కడికి వెళ్ళాడు. నాకేమో గాబరాగా వుంది."

"ఏముందమ్మా సుజాత చనిపోయింది"

"సుజాత పోయిందా ......"

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"అన్నయ్యా......"

ఆమె మనసులో తుఫాను రేగింది.

"శివ శివా! ఏమిటీ నీ లీలలు! గాలి మేడలు కట్టు కోమని, వాటిని కూల్చివేయటమేనా నీధర్మం..."

తేరుకుని అంది.

"నిజంగానా? ఏమిజరిగిందండీ అసలు"

రాత్రి ప్రసాద్ సినిమాకి వెళ్ళాడమ్మా. అతనిపోర బాటువల్ల ఎవడో రాక్షసుడు...బాబుల్ అట...సుజాత కి తనకీ సంబంధం వుందని...తను ఆవిడ బావనని వాళ్ళ నాన్నని మోసంచేసి ఆమెను యిక్కడికి తెచ్చాడట...కుంటివెధవ... ఆవిడ తను కాదన్నప్పుడు మౌనంగావుండీ తను వెళ్ళగానే యిక్కడ చేరి స్వర్గసుఖాలు అనుభవించటం చూచి సహించ లేక...ప్రవేశించి...మేడమీద పడుకుని నిద్రపోతున్న సుజా తని చంపేశాడు. కానీ బయటికి వెళ్ళలేక యింట్లోనే యిరు క్కుని సుజాతకి సంబంధించిన వస్తువల్లా నాశనం చేశాడు. బల్బులు పగుల గొట్టాడు! రేడియో నాశనం చేశాడు... వాడికి ధనవంతులంటే అసహ్యమట! సినిమానుంచి తిరిగి వచ్చిన ప్రసాద్ సుజాత తన పక్కపైపడుకుందని తను క్రిందనే పడుకున్నాడు. ఉదయంనే వెళ్ళిచూస్తే యింకా నిదురి

స్తూనే వున్నాడు. నే పిలిచాక తలుపు తాళం తీశాడు. నాకు ఎదురుగా ఎవరో ముష్టివాడు...వాడే...కనిపించాడు. ఆశ్చర్యం వేసింది...ప్రసాద్‌ని ఆమెనుగురించి అడిగాను క్రింద లేకపోవటంవల్ల...తనకేమీ తెలీదని రాత్రి నిద్రమత్తుతో వచ్చి ఆలాగే క్రిందనే నిదురపోయానన్నాడు. పైకి వెళ్ళి పిలిచి వస్తానన్నాడు. అంతే. అతను కేకవెయ్యటం మాత్రమే నాకు వినబడింది. పైకి పరిగెత్తి చూస్తే సుజాత చంపబడి వుంది...వెంటనే క్రిందికి పరిగెత్తి పారిపోబోతున్న ఆ వెధవని కట్టిపడేసి స్టేషనులో రిపోర్టిచ్చి అన్నయ్యకి చెపుదామని వచ్చాను. అంతేనమ్మా. అన్నయ్య అక్కడికే వెళ్లాడు"

నిశ్శబ్దంగా గుడ్లనీరు కుక్కుకుంటూ వెళ్ళిపోయాడు దివాకరం. నిశ్చల నిరీహ నిర్నిమేష దృక్కుల్తో అలాగే నిలబడింది విజయ. ఆమె చూపులు దిగంతాల కవతల సుజాతని చూస్తున్నాయి. నిర్జీవమైన ఆమె పెదాలనుండి ఏదో అస్పష్టంగా వినబడింది.

"అయ్యో ! విధీ !! ఎంత క్రూరమైన దానివే !!!"

* * *





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B180 |
| పుస్తకం పేరు | విషాదిని |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | No |
| మొత్తం పేజీలు | 235 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 3,4,15,16 |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |